# పరమేశ్వరుడు సర్వాంతర్యామి

## స్వామి పరమానందనాథ

శ్రీ గణపతి సచ్చిదానంద ప్రశస్తి అవార్డు గ్రహీత
విశిష్ఠ విద్యాశిరోమణి, ప్రముఖ శ్రీవిద్యా ప్రచారకులు,
చతుర్వేద భాష్యకారులు, శ్రీవిద్యాబ్రహ్మసూత్ర భాష్యకారులు
అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు,
ఇండియా కల్చరల్ సెంటర్ & టెంపుల్, అమెరికా.
ఆస్థాన విద్వాంసులు, కనకాభిషేకగ్రహీత,
గండపెండేర సన్మానిత, సువర్ణ ఘంటాకంకణ,
శ్రీవిద్యారత్నాకర, శ్రీవిద్యావిశారద
డా॥ క్రోవి పార్థసారథి

ప్రకాశకులు :
భారతీ గ్రంథమాల
సత్యనారాయణపురం, విజయవాడ-520 011.
సెల్ : 9985616824

# పరమేశ్వరుడు సర్వాంతర్యామి

**స్వామి పరమానందనాథ**

ప్రథమ ముద్రణ : ఆగష్టు, 2019

ప్రతులు : 1000



**వెల : రూ. 75-00**

## విషయ సూచిక

# 1. పరమేశ్వరుడు సర్వాంతర్యామి

ఈ ప్రశ్నకు సమాధానం చెప్పాలి అంటే మళ్ళీ మనం ఎదురుప్రశ్న వెయ్యాలి. దేవుడు ఎక్కడ లేడు? అని. చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. నదీనదాలు అడవులు, కొండలు, బండలు, ఎడారులు, లోయలు, పర్వతాలు, సముద్రాలు, గాలి, నేల, నిప్పు, నీరు, నింగి ఒకటేమిటి జగత్తులో కంటికి కనిపించేవి, కనిపించనివి అన్నీ పరమేశ్వర స్వరూపమే. చలనమున్నవి, చలనము లేనివి అన్నీ పరమేశ్వర స్వరూపమే. అందుకే పరమేశ్వరుడు జగత్తంతా ఆక్రమించి ఉన్నాడు. సృష్టి ప్రారంభం కాకముందు జగత్తంతా శూన్యంగా ఉండేది. ఆ శూన్యాన్ని ఆక్రమించి ఉన్నాడు పరమేశ్వరుడు. సృష్టి జరిగిన తరువాత 84 లక్షల జీవరాసి రూపంలో జగత్తును ఆక్రమించి ఉన్నాడు. మొత్తం మీద జగత్తంతా పరమేశ్వర స్వరూపమే.

**ఛాందోగ్యోపనిషత్తు**లో సత్యకామజాబాలికి పరబ్రహ్మస్వరూపం నాలుగు భాగాలుగా ఉంటుంది.

1. తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం నాలుగు దిక్కులు పరబ్రహ్మలో ఒక భాగము.

2. నదీనదాలు అడవులు, కొండలు, ఎడారులు, పర్వతాలు, సముద్రాలు అన్నీ పరబ్రహ్మలో రెండవ భాగము.

3. ఆకాశంలో కనిపించే సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, మెరుపులు, ఉరుములు అన్నీ పరబ్రహ్మలో మూడవ భాగము.

4. ప్రాణం బ్రహ్మ, దృష్టి బ్రహ్మ, శ్రోత్రం బ్రహ్మ. ఇవన్నీ పరబ్రహ్మలో నాల్గవ భాగము.

అంటే జగత్తంతా పరమేశ్వర స్వరూపము. అంతకు మించినది ఏదీ లేదు అని చెబుతారు. భాగవతంలో కూడా భగవంతుడు ఎక్కడ ఉన్నాడు అని హిరణ్యకశ్యపుడు అడిగినప్పుడు

**సర్వోపగతుండు చక్రి. ఎందెందు వెదకి చూసిన అందందే గలడు** అంటాడు ప్రహ్లాదుడు. కాబట్టి జగత్తంతా వ్యాపించి ఉన్నాడు పరమేశ్వరుడు.

పూర్వకాలంలో ఒకరాజు గారికి ఇదే విషయం మీద మూడు అనుమానాలు వచ్చాయి. ఎంత ఆలోచించినా వాటికి సరైన సమాధానం దొరకలేదు. ఒకరోజు ఒక పెద్ద సభ ఏర్పాటు చేసి పండితులు, శాస్త్రకారులు, మేధావులందరినీ ఆహ్వానించాడు. అందరూ సభకి విచ్చేశారు. ఇప్పుడు సభికులనుద్దేశించి "ఓ సభికులారా! నేను మూడు ప్రశ్నలు వేస్తాను. వాటికి సరైన సమాధానం చెప్పిన వారికి గొప్ప బహుమతి ఉంటుంది. సరైన సమాధానం చెప్పకపోతే వారిని కారాగృహంలో బంధిస్తాను." అన్నాడు. అందరూ భయపడి పోయారు. ఎవరూ ముందుకు రాలా. 'నా ప్రశ్నలకు సమాధానం చెప్పేవాడే లేడు'' అని నిర్ణయించుకున్నాడు రాజు. దేశం అంతటా చాటింపు వేయించాడు. అయినా ఎవరూ ముందుకు రాలా. దాంతో 'నా ప్రశ్నలకు సమాధానం చెప్పేవాడే లేడు' అని నిర్ణయించుకున్నాడు రాజు. దేశం అంతటా చాటింపు వేయించాడు. అయినా ఎవరూ ముందుకు రాలా. దీంతో రాజుగారికి గర్వంకూడా పెరిగిపోయింది. కొంత కాలానికి ఒక చిన్నగ్రామం నుంచి పశువులకాపరి ఒకడు రాజసభకి వచ్చాడు. ఆ సమయంలో సభలో పండితులంతా కూర్చుని ఉన్నారు. పశువుల కాపరి సభలో ప్రవేశించి 'రాజా, నువ్వేదో ప్రశ్నలు వేస్తావని, సమాధానం చెప్పిన వారికి గొప్ప బహుమానం ఇస్తావని విని ఇక్కడికి వచ్చాను. ఆ ప్రశ్నలు ఏవో అడిగితే, సమాధానం చెప్పి, నువ్విచ్చే బహుమతి తీసుకుపోతాను' అన్నాడు. ఆ మాటలు విన్న రాజు గొప్ప గొప్ప పండితులే ముందుకు రాలేదు. ఇక ఈ పశుపాలకుడు ఎంత? అనుకుని ముందుగా మొదటి ప్రశ్నను అడగబోతున్న సమయంలో పశువులకాపరి "రాజా! ముందుగా నాది ఒక చిన్న విన్నపం. 'ఎక్కడైనా సరే చెప్పేవాడు గురువు. వినేవాడు శిష్యుడు. గురువుపైన ఉండాలి. శిష్యుడు క్రింద ఉండాలి. కాబట్టి నువ్వు సింహాసనం దిగు' అన్నాడు.

ఈ మాటలు సబబుగానే తోచినాయి రాజుగారికి. వెంటనే సింహాసనం నుంచి క్రిందికి దిగాడు. ఇప్పుడు పశువులకాపరి సింహాసనం అధిష్టించి 'రాజా' ఇప్పుడు చెప్పు నీ మొదటి ప్రశ్న ఏమిటో' అన్నాడు. రాజుగారు ప్రశ్నిస్తున్నాడు.

**దేవుడు ఎటువైపు చూస్తున్నాడు**? ఇదే నా మొదటి ప్రశ్న. జవాబు చెప్పు అన్నాడు. పుశువులకాపరి ఒక దీపం తెప్పించు రాజా! అన్నాడు. దీపం తెచ్చి సభ మధ్య భాగంలో పెట్టారు. ఇప్పుడు పశువులకాపరి అడుగుతున్నాడు. 'రాజా! దీపం ఏ వైపు చూస్తున్నది? నావైపా, నీవైపా, ప్రక్కలకా?' అన్నాడు.

అన్ని వైపులకు చూస్తున్నది అన్నాడు రాజు.

ఆ మాటలు విన్న పశువుల కాపరి 'రాజా ! ఇంత చిన్న దీపం అన్ని వైపులకు చూడగలిగినప్పుడు సర్వాంతర్యామి అయిన పరమాత్మ అన్ని వైపులకు చూడలేడా? అన్నాడు. పరమాత్మ అన్ని వైపులకు చూస్తాడు అనే విషయం తెలిసింది రాజుకు. ఇప్పుడు రెండవ ప్రశ్న వేస్తున్నాడు. **దేవుడు ఎక్కడ ఉంటాడు**?

ఒక గ్లాసులో పాలు తెప్పించమన్నాడు. భటులు పాలగ్లాసు తెచ్చి సభ మధ్యలో పెట్టారు. ఇప్పుడు పశువులకాపరి రాజుగారితో – "రాజా! పాలల్లో నెయ్యి ఉన్నది కదా? అన్నాడు 'అవును' అన్నాడు రాజు.

'అయితే ఈ పాలల్లో నెయ్యి ఎక్కడ ఉందో చూపెట్టు! అన్నాడు. ఆ మాటలు విన్న మహారాజు "ఇవి పచ్చిపాలు. వీటిలో నెయ్యి ఎలా కనిపిస్తుంది? పాలను కాచి తోడుబెడితే పెరుగు అవుతుంది. పెరుగును చిలగ్గొడితే వెన్న వస్తుంది. ఆ వెన్నను మరగ కాస్తే నెయ్యి వస్తుంది" అన్నాడు.

"నిజం చెప్పావు మహారాజా! అలాగే హృదయమనే పాలను గురువు అనే నిప్పుల మీద బాగా మరగబెట్టి, మనస్సు అనే తోడువేసి, స్థిరంగా ఉంచితే వచ్చే సత్యం అనే పెరుగును సాధన అనే కవ్వంతో చిలికితే జ్ఞానమనే వెన్న వస్తుంది. ఆ సాధన అంతర్ముఖం అనే నిప్పులమీద నరగబెడితే పరమాత్మ అనే నెయ్యి వస్తుంది. అందుచేత భగవంతుడు సర్వాంతర్యామి" అన్నాడు పశువుల కాపరి.

హర్ష ధ్వానాలు మిన్నంటాయి సభలో.

ఇప్పుడు మూడవ ప్రశ్న వేస్తున్నాడు రాజు.

"దేవుడు ఏంచేస్తాడు?" పశువుల కాపరి సమాధానం చెబుతున్నాడు. 'రాజా! సింహాసనం మీద కూర్చుని దేశాన్ని పాలించాల్సిన నువ్వు ఇలా నేలమీద కూర్చున్నావు. ఏమీ తెలియని పశువుల కాపరినైన నేను సింహాసనం మీద కూర్చున్నాను. పైనున్న

నిన్ను క్రిందకి దింపి, క్రింద నున్న పైన కూర్చోబెట్టాడు. ఇదే పరమేశ్వరుడి లీల అంటే దేవుడు ఇలాంటి విచిత్రమైన పనులు అనేకం చేస్తుంటాడు. జీవితంలో మంచి పనులు చేసిన వారికి ఉత్తమ జన్మలు ఇచ్చి చెడ్డ పనులు చేసిన వారికి నీచ జన్మలిస్తాడు. ఇదే పరమేశ్వరుడి పని' అన్నాడు. రాజుగారు పశువుల కాపరికి పాదదాసుడైనాడు.

కాబట్టి పరమేశ్వరుడు ఎక్కడ ఉంటాడు? అంటే అతడు సర్వాంతర్యామి చరాచర జగత్తంతా నిండి ఉంటాడని గ్రహించాలి.

## 2. మహాలయామావాస్య

**'మహాలయము'** అంటే పిత్రుదేవతలకు సంబంధించిన పవిత్రమైన పుణ్య కాలము. ఇది పదిహేను రోజులు ఉంటుంది.

ప్రతి సంవత్సరం భాద్రపద మాసంలో పౌర్ణమి వెళ్ళిన తరువాత వచ్చే పాడ్యమి నుంచి అమావాస్య వరకు ఉండే పదిహేను రోజులను **'మహాలయాపక్షాలు'** అంటారు. ఇవి పూర్తిగా పిత్రుదేవతలకు సంబంధించిన రోజులు. భాద్రపద మాసం శూన్యమాసం కాబట్టి వివాహము, గృహప్రవేశము వంటి మంచి పనులు ఏవీ చెయ్యరు. అసలు ముహూర్తాలే ఉండవు. మహాలయపక్షం పదిహేను రోజులు పిత్రు సంబందమైన దినాలు కాబట్టి ఏ రకమైన శుభకార్యాలు చెయ్యరు. ఈ రోజుల్లో పిత్రుదేవతలకు తర్పణలు ఇస్తారు. వారి యొక్క తిథిరోజు కాని లేకపోతే అమావాస్య రోజున కాని మహాలయం పెట్టటం జరుగుతుంది. సంవత్సరంలో వారి తిథి పెట్టకపోయినా పిత్రుదేవతలకు తర్పణలు సరిగా అందకపోయినా వారు కోపగించటం జరుగుతుంది. పిత్రుదేవతలు కోపగిస్తే మనకు ఇబ్బందులు వస్తాయి. పిల్లలకు వివాహాలు కావు. వారికి సంతానం కలగదు. వారి కాపురాలు సరిగా ఉండవు. కాబట్టి తప్పనిసరిగా ప్రతివారు పిత్రుకార్యాలు చేసి తీరాలి. మనం చేసిన కార్యాల వల్ల పిత్రుదేవతలందరికీ తర్పణ అందదు. అందుకని మహాలయ పక్షంలో వారి తిథి వచ్చినప్పుడు మహాలయం పెట్టటం జరుగుతుంది. తల్లిదండ్రులలో ఎవరిదో ఒకరి తిథి వచ్చినప్పుడు ఈ మహాలయం పెడతారు. మహాలయం ఎందుకు పెట్టాలి అనే దానికి ఒకకథ ఉంది.

కర్ణుడు మహావీరుడే కాదు. మహాదాత. అడిగిన వాడికి లేదనకుండా దానం చేసేవాడు. ఈ కారణం చేత మరణానంతరము స్వర్గానికి వెళ్ళాడు. స్వర్గానికి వెడుతుండగా త్రోవలో ఆకలి వేసింది. ఆ ప్రక్కనే ఒక చెట్టు కనిపించింది. దాన్నిండా పూలు, కాయలు, పండ్లు విరగకాచి ఉన్నాయి. ఆ పండు తిని ఆకలి తీర్చుకుందామని కర్ణుడు చెట్టెక్కి ఒక పండును కోశాడు. తినటానికి నోటిదగ్గర పెట్టుకున్నాడు. ఆశ్చర్యం ఆ పండు కాస్తా బంగారపు సుద్ద అయిపోయింది. ఆ పండు వదిలి ఇంకొకటి కోశాడు. తినబోయేసరికి అదికూడా బంగారం అయిపోయింది. పోనీ అని ఇంకొక చెట్టుకున్న పండు కోశాడు. తినబోయేసరికి అది కూడా బంగారపు ముద్ద అయింది. ఏ చెట్టు పండును కోసి తినబోయినా బంగారపు సుద్దలు అయిపోతున్నాయి. కనీసం మంచి నీరయినా త్రాగుదాయని దగ్గరలో ఉన్న సెలయేరుకు వెళ్ళాడు. దోసిలిలోకి నీటిని తీసుకుని త్రాగబోయాడు. ఆ నీరంతా బంగారం అయిపోయింది. అలాగే స్వర్గలోకం చేరాడు. అక్కడ కూడా అదే పరిస్థితి. తాను ఏం తీసుకున్నా బంగారుమయ మయిపోతోంది. తినటానికి త్రాగటానికి పనికి రావటం లేదు. తను చేసిన తప్పు ఏమిటి? తనకు ఎందుకిలా జరుగుతోంది? అర్థం కాలేదు కర్ణుడికి. ఇంతలో అశరీరవాణి వినిపించింది.

“కర్ణా? నువ్వు దానశీలిని. చేతికి ఎముక లేకుండా దానాలు చేశావు. అయితే ఆ దానాలన్నీ బంగారము, వెండి, నగదు రూపాలలో ఇచ్చావు. నువ్వు ఎప్పుడూ కనీసం ఒక్కరికి కూడా అన్నం పెట్టి ఆకలి తీర్చలేదు. మనం ఇతరులకిచ్చినది, దానం చేసినది కొన్ని వందల రెట్లయి మళ్ళీ మనకు తిరిగి వస్తుంది. అలాగే నువ్వు ఇచ్చిన వెండి బంగారాల దానాలు కొన్ని రెట్లయి మళ్ళీ నీ దగ్గరకు వచ్చినాయి. నువ్వు ఎవరికీ అన్నం పెట్టలేదు. అందుకనే నీకు ఆకలి దప్పికలు తీరలేదు.” అన్నది అశరీరవాణి.

ఇప్పుడు ఏం చెయ్యాలి? ఆలోచించాడు కర్ణుడు, తండ్రి అయిన సూర్యభగవానుడి దగ్గరకు వెళ్ళాడు. విషయం అంతా వివరించి తన ఆకలి దప్పికలు తీర్చమన్నాడు. ఈ పని నేను చెయ్యలేను. దేవరాజైన ఇంద్రుణ్ణి కలు అన్నాడు సూర్యుడు. ఇంద్రుడి దగ్గరకు వెళ్ళి విషయం వివరించి తనకు సాయం చెయ్యమన్నాడు కర్ణుడు. అప్పుడు ఇంద్రుడు “కర్ణా ! నువ్వు వెంటనే భూలోకానికి వెళ్ళి అక్కడ అన్నార్తులకు అన్నం పెట్టి, తల్లితండ్రులకు తర్పణాలు ఇచ్చి రమ్మన్నాడు.

ఇంద్రుడి సలహా మేరకు భాద్రపద బహుళ పాడ్యమి నాడు భూలోకానికి వచ్చాడు ఇంద్రుడు. అక్కడ పేదలు, బంధువులు, మిత్రులు అందరికీ అన్నసంతర్పణ చేశాడు. పిత్రుదేవతలకు తర్పణలు వదిలాడు. తిరిగి అమావాస్య రోజున స్వర్గానికి వెళ్ళాడు. ఎప్పుడైతే కర్ణుడు అన్నసంతర్పణలు చేసి, పిత్రుతర్పణలు ఇచ్చాడో అప్పుడు అతని ఆకలి దప్పికలు తీరిపోయినాయి. కడుపు నిండిపోయింది. కర్ణుడు ఈ రకంగా భూలోకంలో గడిపిన పక్షం రోజులనే మహాలయపక్షము అంటారు. అందులో చివరి రోజు మహాలయామావాస్య.

అసలు మహాలయం ఎప్పుడు ప్రారంభమవుతుంది? అంటే సంవత్సరాన్ని రెండు భాగాలుగా చెబుతున్నాం. ఆ భాగాన్నే అయనము అంటున్నాం. సంవత్సరానికి రెండు అయనాలు 1) ఉత్తరాయణము ఇది దేవమార్గము 2. దక్షిణాయనము. ఇది పిత్రుమార్గము. ఉత్తరాయణంలో సూర్యుడు కొంచెం ఉత్తరంగా, దక్షిణాయనంలో దక్షిణంగా ప్రయాణిస్తాడు. సూర్యుడు మకరరాశిలోకి వచ్చినప్పుడు మకర సంక్రమణం అంటారు. అప్పటి నుంచి ఉత్తరాయణం ప్రారంభమవుతుంది. అక్కడి నుండి ఆరు నెలలకు సూర్యుడు కర్కాటకంలో ప్రవేశిస్తాడు. అప్పటి నుంచి దక్షిణాయనం మొదలవుతుంది. సూర్యుడు మకరరాశిలోకి జనవరి 14న, కర్కాటకరాశిలోకి జులై 17న ప్రవేశిస్తాడు. అంటే జులై 17 నుంచి దక్షిణాయనం (పిత్రుయానం) ప్రారంభ మవుతుంది. దక్షిణాయనం ప్రారంభమైన మొదటి 15 రోజులు మహాలయ పక్షం.

సంవత్సరాది చైత్రశుద్ధ పాడ్యమి, అశ్వనీ నక్షత్రం, ఆదివారం నాడు రావాలి. దాని కాని అలా జరగదు. దీనికి కారణం కాలచక్రంలో వచ్చిన మార్పులు. చైత్రమాసంలో పౌర్ణమి చిత్తా నక్షత్రంలో రావాలి. కాని 2018 సం॥లో చైత్ర పౌర్ణమి మార్చి 31న ఉత్తరానక్షత్రంలో వచ్చింది. ఇదంతా కాలచక్ర భ్రమణంలోని మార్పుల వల్ల జరుగుతోంది. 2018 సం॥లో జులై 17 అంటే ఆషాఢ శుద్ధపంచమి నుంచి మహాలయం ప్రారంభం కావాలి. అయితే క్రీ.పూ. 3000 సంవత్సరాల ప్రాంతంలో భాద్రపద బహుళ పాడ్యమి రోజున కర్కాటక సంక్రమణం జరిగింది. అందుకని అప్పుడు భాద్రపద బహుళ పాడ్యమి నుంచి అమావాస్య వరకు మహాలయం నిర్వహించారు. అయితే పంచాంగాలు సరిచేయకుండా ఇదే పద్ధతిని ఇవాళ్ళ కూడా ఆచరిస్తూ భాద్రపద బహుళంలోనే మహాలయం పెడుతున్నారు.

ఇక్కడ ఇంకొక చిన్న అనుమానం వస్తుంది. మాసం ప్రారంభమయ్యేది శుద్ధ పాడ్యమి గదా అని. ఉత్తర దేశంలో యు.పి., యం.పి., ప్రాంతాలలో బహుళపాడ్యమి నుంచి మాసం ప్రారంభమవుతుంది. అదీగాక నెలలో శుక్లపక్షం దేవతలకని, కృష్ణపక్షం పితృదేవతలకని ఒక సంప్రదాయం ఉంది. వీటన్నింటినీ అనుసరించి భాద్రపద మాసంలో బహుళ పాడ్యమి నుంచి అమావాస్య వరకు మహాలయం పెట్టటం జరుగుతున్నది.

మహాలయం పెట్టేటప్పుడు

**కన్యాగతే సవితరి ఆషాఢ్యాది పంచమాపరపక్షే**

**సకృన్ మహాలయా ఖ్యాన్న శ్రాద్ధకర్మం కరిష్యే**

కన్యాగతే సవితరి - సూర్యుడు కన్యలో ఉండగా

ఆషాఢ్యాది - ఆషాఢ మాసం నుంచి

పంచమాపరపక్షే - ఐదు పక్షములు పూర్తి అయిన తరువాత ఆరవ పక్షంలో

మహాలయ శ్రాద్ధకర్మ చేస్తున్నాము అని సంకల్పం, దీన్ని బట్టి ఆషాఢం నుంచి ఐదు పక్షాలు పూర్తి అయిన తరువాత ఆరవ పక్షం అంటే భాద్రపద బహుళ పక్షంలో మహాలయ శ్రాద్ధకర్మ చెయ్యాలి.

ఈ పదిహేను రోజులు పితృదినాలు కాబట్టి పితృదేవతలకు తర్పణలు ఇవ్వాలి. ఇది ఏమీ ఖర్చుతో కూడిన పనికాదు. పితృదేవత పేరు చెప్పి **'స్వధాంతర్పయామి'** అంటూ మూడుసార్లు నువ్వులు నీళ్ళు కలిపి బ్రొటనవ్రేలి మీదుగా పితృదేవతలకు తర్పణ వదలాలి. ఇలా చేస్తే అంతా మేలే జరుగుతుంది.

# 3. మంత్రసిద్ధి

చాలామందిలో ఒక రకమైన భావన ఉంటుంది. ఈ రోజుల్లో కూడా మంత్రాలు తంత్రాలు ఏమిటి? పిచ్చి కాకపోతే. మంత్రం వేస్తే రోగాలు తగ్గుతాయా? మంత్ర జపం చేస్తే పనులు జరుగుతాయా? పూజలు హోమాలు చేస్తే పనులు సానుకూలం అవుతాయా? ఇదంతా పెద్ద ఛాదస్తం. సైన్సు బాగా అభివృద్ధి చెందిన ఈ రోజుల్లో కూడా ఇంకా మంత్ర తంత్రాలను పట్టుకుని వ్రేలాడుతున్నారు. అని కొందరంటే ఇదంతా ఒక వర్గంవారు తమ భుక్తికోసం చేస్తున్నపని అంతకు మించి ఏమీ లేదు. అనే వారు కొందరు.

మరి నిజంగానే మంత్రాలు తంత్రాలు పని చేస్తాయా? వాటికి ప్రభావం ఉన్నదా? అనేది మనముందున్న వేయి డాలర్ల ప్రశ్న.

ఏదైనా ఒకపని చేసేటప్పుడు దానిమీద పూర్తిగా విశ్వాసం ఉండాలి. వివాహం చేసుకునేటప్పుడు స్త్రీ పురుషులు ఒకరిమీద ఒకరికి నమ్మకం ఉండాలి. ప్రేమానురాగాలు, అభిమానం, ఆప్యాయత ఉండాలి. అవి ఉంటేనే ఆ కాపురం సజావుగా, ఆదర్శవంతంగా సాగుతుంది. అలా కాకుండా ఒకరి మీద ఒకరు అనుమానంతో, అపనమ్మకంతో ఉంటే ఆ కాపురం ఎలా నిలుస్తుంది? ఎంత కాలం నిలుస్తుంది? ఏదైనా సరే నమ్మకం మీద ఆధారపడి ఉంటుంది. పూర్వకాలంలో ఒక వైద్యుడు హాస్పిటలు కట్టేసి ఇంటికి బయల్దేరుతున్నాడు. ఇంతలో ఒక రోగిని తీసుకువచ్చారు బంధువులు. అతడు తెలియని, చెప్పలేని, భరించలేని అనారోగ్యంతో పాటు పడుతున్నాడు. కాని ఆ వ్యక్తికి ఈ వైద్యుడికి బాగా పరిచయం ఉంది. ఈ వైద్యుడంటే అతడికి విపరీతమైన నమ్మకం. అందుకే అతని దగ్గరకు తీసుకువచ్చారు. రోగిని చూశాడు వైద్యుడు. ఏ రకమైన రోగలక్షణాలు కన్పించటంలా. కాని విపరీతమైన బాధ పడుతున్నాడు. సరే వైద్యుడు తన జేబులోంచి ఒక మాత్ర తీసి ఇచ్చి దీన్ని వెంటనే నోట్లో వేసుకో. మింగద్దు. చప్పరిస్తూ ఉండు. కొద్దిసేపటికే నీ బాధ పూర్తిగా తగ్గిపోతుంది. ఎలాంటి సమయంలోను నోట్లోని మాత్రను మాత్రం బయటకు తియ్యకు. మళ్ళీ రేపు ఉదయం రా ! అని చెప్పి పంపేశాడు. మర్నాడు ఉదయాన్నే వచ్చాడు రోగి. ఎలాఉన్నది అని అడిగాడు వైద్యుడు. మీరు మాత్ర ఇచ్చిన పదినిమిషాలకల్లా తగ్గిపోయింది. ఇప్పుడు నాకు ఏ బాధా లేదు. హాయిగా ఉన్నాను అన్నాడు. నోట్లోని మాత్ర బయటకు తియ్యమన్నాడు వైద్యుడు. తీశాడు రోగి. అది మాత్ర కాదు. చొక్కాగుండీ. రాత్రి వైద్యుడు మాత్ర అని చెప్పి తనకు ఇచ్చింది ఈ గుండీ అన్న మాట. దీనివల్లనే తన బాధ తగ్గిపోయిందా? అతని ముఖం చూడగానే అర్థం అయిపోయింది వైద్యుడికి. నవ్వేశాడు. చొక్కా గుండీ వల్ల నీ బాధ తగ్గిపోలేదు. నామీద ఉన్న నమ్మకం వల్ల రోగం తగ్గింది. అన్నాడు వైద్యుడు.

ఇలాంటి ఉదాహరణలు కోకొల్లలు. మంత్రం కూడా అలాంటిదే. మంత్రోపదేశం తీసుకునేటప్పుడే, మంత్రం మీద విపరీతమైన నమ్మకముండాలి. మంత్రాన్నిచ్చే గురువుమీద నమ్మకముండాలి. గురువంటే భక్తి, శ్రద్ధ, గౌరవం. సాక్షాత్తు గురువు పరమేశ్వరుడు అనే భావన చెయ్యాలి. అలాంటప్పుడే అతడిచ్చిన మంత్రం ఫలితాన్నిస్తుంది.

పూర్వకాలంలో ఒకగురువుగారి దగ్గర శిష్యరికం చేశాడు ఒక శిష్యుడు. నీకు ఏం కావాలి? అని అడిగాడు గురు. నాకు ఆకాశంలో విహరించాలని ఉంది. కాబట్టి ఆకాశ గమనానికి సంబంధించిన విద్య కావాలి అన్నాడు. వాడికి ఏదో మంత్రోపదేశం చేశాడు గురువు. ఆ మంత్రాన్ని సాధనచేసి కృతకృత్యుడై ఆకాశంలో విహరిస్తూ వెళ్ళిపోయాడు శిష్యుడు.

కొద్దిరోజులు గడిచాయి. శిష్యుడు ఆకాశమార్గంలో వెడుతుండగా, ఎదురుగా ఇంకొకతను వస్తున్నాడు. 'ఎక్కడో చూసినట్లుంది' అని తటపటాయించి చూస్తున్నాడు ఈ శిష్యుడు దగ్గరకు వచ్చాడు ఆ వ్యక్తి. తనకు పరిచయం ఉన్నవాడే. సహాధ్యాయి. తనతోపాటు తన గురువుగారి దగ్గరే విద్యాభ్యాసం చేశాడు. పరస్పరం మిత్రులు కలుసుకున్నారు. కుశలప్రశ్నలు అయిన తరువాత మొదటివాడు రెండవవాణ్ణి అడిగాడు. 'ఆకాశ గమనం చెయ్యటానికి గురువు గారు నీకిచ్చిన మంత్రం ఏమిటి?' అన్నాడు. **'కా'** అన్నాడు రెండవ వాడు. ఈ మంత్రాన్నే కొంతకాలం సాధన చేశాను. దాని ప్రభావం వల్ల ఇలా ఆకాశంలో తిరగ్గలుగుతున్నాను. అని చెప్పి, నీకు ఏ మంత్రం ఇచ్చారు? అని అడిగాడు. **'కీ'** అన్నాడు మొదటివాడు. ఈ మంత్రాన్ని సాధించే ఆకాశగమనం చేస్తున్నాను అన్నాడు. ఇద్దరికీ ఆశ్చర్యం వేసింది. ఇంతేనా మంత్రం అంటే. కా, కీ అనే మాటలు మనకు తెలుసు కదా. ఇదే మంత్రం అయితే మనం ఎప్పుడోనే చేసేవాళ్ళం కదా? ఇంత కాలమెందుకు? దీనికి గురువుగారెందుకు? అనుకున్నారు. అంతే మరుక్షణంలోనే ఆకాశం మంచి నేలమీద పడిపోయారు.

ఇక్కడ కావలసింది గురువుగారి మీద నమ్మకం. భక్తి అది లేకపోతే మంత్రం ఏ మాత్రం పని చెయ్యదు.

మంత్రం చెప్పుకోగానే ఫలితం రాదు. మంత్రజపం చెయ్యాలి. మంత్రం మీద పట్టు రావాలంటే నిర్ణీతమైన సంఖ్య జపం చెయ్యాలి. మంత్రదీక్ష తీసుకున్నప్పుడు నియమనిష్ఠలు పాటించాలా? అనేది అనుమానం. నియమనిష్ఠలు పాటించిన వారికి శక్తి ఎక్కువ ఉంటుంది. దాంతో మంత్రం త్వరగా సిద్ధిస్తుంది. కాబట్టి మంత్రజపం చేసేవారు దానికి తగిన ఆహారం మాత్రమే గురువుగారు నిర్దేశించినట్లుగానే తీసుకోవాలి. అబద్ధమాడకూడదు. అధర్మం చెయ్యకూడదు. ఇతరులకు హాని తలపెట్టరాదు. క్షమాగుణం, శాంతం అలవరచుకోవాలి. ఇతరులకు సాధ్యమైనంత సేవ చెయ్యాలి. మంత్ర పునశ్చరణ చెయ్యాలి. ఆ సమయంలో ఒంటిపూట భోజనం,

భూశయనం, వంటివి విధిగా ఆచరించాలి. ఇలాచేస్తే మంత్రం త్వరగా సిద్ధిస్తుంది. ఇవేవీ చెయ్యకుండా నాకు మంత్రం సిద్ధించలేదు. మంత్రాన్ని వదిలేస్తాను. అన కూడదు. మంత్రసిద్ధి అనేది గతజన్మలలో నీ కర్మమీద కూడా ఆధారపడి ఉంటుంది.

అర్వాణచక్రంలో మంత్రం నాలుగు రకాలుగా కనిపిస్తుంది.

1. **సిద్ధము** – ఈ మంత్రం ఇతడికి తప్పనిసరిగా ఈ జన్మలోనే సిద్ధిస్తుంది. అంటే గతజన్మలలోనే ఈ మంత్రాన్ని ఇతడు బాగా చేసి ఉన్నాడన్న మాట.
2. **సుసిద్ధము** – త్వరగా ఈ జన్మలోనే మంత్రం సిద్ధిస్తుంది. అంటే గతజన్మలోనే ఈ మంత్రం ఇతడికి సిద్ధించింది. ఈ జన్మలో కేవలము మంత్రోపదేశం తీసుకుని కొద్దిపాటి జపం చేస్తే చాలు. గతం మళ్ళీ వచ్చేస్తుంది.
3. **సాధ్యం** – మంత్రసిద్ధి జరుగుతుంది. కాని సమయం పడుతుంది. ఈ జన్మలో మాత్రం కాదు. ఎన్ని జన్మలు పడుతుందో చెప్పలేము. అది సాధకుడి మీదనే ఆధారపడి ఉంటుంది.
4. **అరిష్టము** – ఈ మంత్రం నీకు పనికిరాదు. దాన్ని జపం చేస్తే నీకు అపకారం జరుగుతుంది.

మంత్రోపదేశం చేసేటప్పుడు గురువుగారు ఈ విషయాలకు పరిశీలించి మంత్రం ఇస్తారు. మహామంత్రాలకు అర్వాణం చూడనవసరం లేదు. కాని చాలామంది చూస్తున్నారు.

మంత్రం చెప్పుకున్నాను. కాని అది నాకు పని చెయ్యటంలేదు. అని కొంతమంది భావిస్తుంటారు. వారి భావనలో మంత్రం చెప్పుకున్న మరుక్షణం నుంచీ అది పని చెయ్యాలని. అదెలా జరుగుతుంది? పెళ్ళి చేసుకున్న మరుక్షణంలోనే పిల్లలు పుట్టరు కదా? ఇక్కడ ఒక చిన్నకథ ఉంది.

ఒకసారి ఒక గురువు గారి దగ్గర మంత్రం తీసుకున్నాడు శిష్యుడు. కొంతకాలం తరువాత వచ్చి "గురువుగారూ ! నేనింక ఈ మంత్రజపం చెయ్యను' అన్నాడు.

'ఏమైంది' అడిగాడు గురువుగారు.

'రోజూ క్రమం తప్పకుండా చేస్తున్నాను. ఇంతవరకు ఏ ఫలితము రాలేదు' అన్నాడు శిష్యుడు.

'మంత్రం చెప్పుకుని ఎంత కాలమైంది?' గురువు గారి ప్రశ్న. 'నెల రోజులైంది భగవంతుణ్ణి ఒక్కసారి స్మరించినంత మాత్రం చేతనే పాపాలన్నీ పటాపంచలై పోతాయి. మరి నెలరోజులైనా నాకు ఇంతవరకు ఏ పనీ జరగలేదు. మంత్రంలో బలముంటే పని చెయ్యాలి కదా? ఉపయోగం కొంచెం అన్నా కనిపించాలి కదా?' అన్నాడు శిష్యుడు. 'ఓర్పుగా మంత్రజపం చెయ్యాలి. నీకిచ్చింది మహామంత్రం కాబట్టి కొంచెం సమయం పడుతుంది' అన్నాడు గురువుగారు 'లేదండీ ప్రతిరోజు రెండుపూటలా స్నానంచేసి శుచిగా జపం చేస్తాను. ఒంటిపూట భోజనం భూశయనం. అన్నీ చేస్తూనే ఉన్నాను. ఎక్కువగా మాట్లాడను. అయినా మంత్రసిద్ధి కలుగలేదు.'

మంత్రం మీద నాకు నమ్మకం పోయింది. దాన్నింక వదిలేస్తాను. ఎలా వదలాలో చెప్పండి' అన్నాడు శిష్యుడు. ఆలోచించాడు గురువుగారు. 'సరే అలాగే వదిలేద్దువుగాని. రేపురా ! ఎలా వదలాలో చెబుతాను' వెళ్ళేటప్పుడు ఒకపని చెయ్యి. ఇదిగో ఈ మామిడిటెంకని మన ఆశ్రమంలో జాగ్రత్తగా పాతిపెట్టి వెళ్ళు' అన్నాడు గురువుగారు.

అలాగే అని మామిడిటెంకను పాతిపెట్టి, కాసిని నీళ్ళు పోసి, వెళ్ళిపోయి మరునాడు వచ్చాడు. వచ్చీ రాగానే 'మంత్రం వదిలేసే మార్గం ఏదో చెప్పండి' అన్నాడు. 'అలాగే చెబుతాను. నిన్న నాటిన మామిడిటెంక మొలకెత్తిందో లేదో చూశావా?' అడిగాడు గురువు.

'లేదు. నిన్ననే కదా నాటింది. మొక్క మొలవాలంటే కొంతకాలం పడుతుంది' అన్నాడు శిష్యుడు.

సరిగా గొయ్యితీసి పాతిపెట్టావా? నీరు పోశావా? లేకపోతే టెంక మొలకెత్తదు అన్నాడు గురువు.

"ఆ జాగ్రత్తలన్నీ తీసుకున్నాను. కాని టెంక మొలవాలంటే ఇంకా సమయం పడుతుంది" అన్నాడు శిష్యుడు.

'ఇన్ని జాగ్రత్తలు తీసుకున్నా టెంక మొలవలేదా? కాయలు కాయలేదా? ఎందుకని?' అడిగాడు గురువుగారు. 'అదేమిటి గురువుగారూ ! టెంక మొలవాలంటే సమయం కావాలి. అది మొక్కై, చెట్టై కాయలు కాయాలి. పండ్లు పండాలి 'ఇంకా చాలా సమయం పడుతుంది' అన్నాడు శిష్యుడు.

‘అవన్నీ నిజమే. టెంకను నాటి కొన్ని గంటలై పోయింది. ఇంకా అది మొలవలేదు. కాయలు కాయలేదు. దానిమీద నాకు నమ్మకం పోయింది”

దాన్ని తవ్వి తీసి పారెయ్. నేనింక ఈ ఆలస్యం భరించలేను’ అన్నాడు గురువుగారు.

తలవంచుకున్నాడు శిష్యుడు క్షమించండి గురువుగారు. విషయం నాకు పూర్తిగా అవగతమైంది. అని గురువుగారి పాదాలకు నమస్కరించి వెళ్ళిపోయాడు.

మంత్రం చెప్పుకోగానే ఫలితాన్నివ్వదు. దాన్ని సాధన చెయ్యాలి. మంత్రం సిద్ధించాలంటే పూర్వజన్మ సుకృతం కావాలి. ఈ విషయాలు దృష్టిలో పెట్టుకుని మంత్రోపదేశం తీసుకోవాలి.

## 4. సద్గురువు

నీలోని అజ్ఞానాన్ని తొలగించి జ్ఞానజ్యోతులు వెలిగించే వాడే గురువు. **గుకారో అంధకారశ్చ, రుకారశ్చతన్నిరోధకః** అంధకారము అంటే అజ్ఞానము. నీలోని అంధకారమనే అజ్ఞానాన్ని తొలగించి మోక్షమార్గాన్ని చూపేవాడే సద్గురువు.

**గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।**
**గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మైశ్రీ గురవే నమః ॥**

గురువు త్రిమూర్తి స్వరూపుడు. అదెలా అంటే – బ్రహ్మ సృష్టికర్త – **గురుర్బ్రహ్మ.** గురువే సృష్టికర్త. దేన్ని సృష్టిస్తాడు అంటే సాధకుడి మదిలో జ్ఞానబీజాగ్ని నాటతాడు. అందుకే అతడు బ్రహ్మస్వరూపుడు.

**గుర్ర్విష్ణుః** – గురువు విష్ణుస్వరూపుడు. విష్ణువు స్థితి కారకుడు. సాధకుని మదిలో నాటిన జ్ఞానబీజాన్ని పెంచి పోషిస్తాడు. అందుకే అతడు విష్ణుస్వరూపుడు.

**గుర్ర్దేవో మహేశ్వరః** – గురువు రుద్రస్వరూపుడు. రుద్రుడు లయకారకుడు. సాధకుని మదిలో ఉన్న అజ్ఞానాన్ని, మలినాలను నాశనం చేస్తాడు. అందుకే గురువు రుద్రస్వరూపుడు.

**గురుస్సాక్షాత్ పరబ్రహ్మ** – మోక్షమిచ్చేవాడు, మోక్షమార్గాన్ని చూపేవాడు పరమేశ్వరుడు. గురువు తన శిష్యునికి మోక్షమార్గం చూపుతాడు కాబట్టి అతడు పరమేశ్వరుడు. అంటోంది గురుగీత.

భారతీయ ఆధ్యాత్మిక ప్రపంచంలో గురువుకు అంత గొప్ప స్థానమున్నది. ఎటువంటి వాడైనా, ఎంత గొప్పవాడైనా మరే గురువును ఆశ్రయించాల్సిందే. గురూపదేశం లేకపోతే, గురువు యొక్క మార్గదర్శకత్వం లేకపోతే మోక్షం లభించదు. జన్మ చరితార్థం కాదు.

సద్గురువు అమ్మలాంటివాడు. మన అహంకారాన్ని చూసి విచారిస్తాడు. మనల్ని సన్మార్గంలో పెట్టటానికి ప్రయత్నిస్తాడు అంతేకాని అసహ్యించుకోడు. ఓపికగా జ్ఞానబోధ చేసి, చిత్తశుద్ధి చేసి, అహంకార మమకారాలను దూరం చేసి భగవంతుడి దగ్గరకు చేరుస్తాడు. ఈ సందర్భంలో చిన్న విషయాన్ని గమనించండి.

భార్యా భర్త పసిపిల్లవాడు ఉన్నారు. పిల్లవాడు మంచం మీద పడుకుని ఆడుకుంటున్నాడు. వాడికి ఏమీ తెలియదు. వాడి ప్రపంచమే వేరు. పిల్లవాడు పొత్తిళ్ళలోనే మలమూత్రవిసర్జన చేవాడు. పెద్దగా ఏడుస్తున్నాడు. పిల్లవాడి ఏడుపు విన్నాడు తండ్రి. వచ్చి చూశాడు. చాలా ఘోరంగా ఉంది పరిస్థితి. పిల్లవాణ్ణి ఎత్తుకోవాలంటే చాలా అసహ్యంగా ఉన్నాడు. ముక్కు మొహము ఏకం చేసుకున్నాడు. భరించలేక ఘొల్లుమని ఏడుస్తున్నాడు. భర్త భార్యని పిలిచాడు. తల్లి వచ్చింది. పరిస్థితి చూసింది. తండ్రిలాగా చూస్తూ దూరంగా నుంచోలేదు. గబగబా రెండు చేతుల్లోకి తీసుకుంది పిల్లవాణ్ణి. లోపలికి తీసుకువెళ్ళింది. గోరువెచ్చని నీళ్ళతో వళ్ళంతా కడిగింది. శుభ్రంగా స్నానం చేయించింది. పౌడరు రాచి, మంచి దుస్తులు వేసి, ముఖాన బొట్టుపెట్టి పాలు పట్టింది. ఇప్పుడు పిల్లవాడు అందంగా ఉన్నాడు. అతడికి పట్టిన మురికి అంతా వదిలిపోయింది. తండ్రి ఎంతో ఆప్యాయంగా పిల్లవాణ్ణి ఎత్తుకున్నాడు ముద్దులాడాడు. పిల్లవాడు నవ్వుతూ ఆడుతున్నాడు.

ఆధ్యాత్మిక ప్రపంచంలో కూడా జరిగేది ఇదే. తల్లి మోక్షమార్గాన్ని చూపే గురువు. తండ్రి పరమేశ్వరుడు. మోక్షప్రదాత. పరమేశ్వరుడు అజ్ఞానిని, మురికిగా ఉన్నవాణ్ణి దగ్గరకు రానీయడు. ఎత్తుకోడు. సద్గురువు అమ్మలాంటి వాడు. మన అహంకారం చూసి అసహ్యించుకోడు. ఓపికగా జ్ఞానబోధ చేస్తాడు. మనలోని మలినాలను కడిగేస్తాడు. చిత్తశుద్ధి చేసి, అహంకారాన్ని అణిచివేసి నిర్మలుడుగా చేస్తాడు. అంటే మోక్షమార్గాన్ని చూపుతాడు.

మోక్షం పొందాలంటే అరిషడ్వర్గాలు, అహంకార మమకారాలు, ఏవీ ఉండరాదు. గురువు వాటన్నింటినీ తన బోధల వల్ల దూరం చేస్తాడు. అపరోక్ష

జ్ఞానాన్ని కలుగచేస్తాడు. అప్పుడు సాధకుడు జగత్తంతా పరమేశ్వరమయము. ఆ పరమేశ్వరుణ్ణి నేనే అనే భావన దృఢంగా కలిగినవాడై పరమపదం చేరతాడు.

ఈ రకంగా మోక్షాన్నిచ్చేవాడు భగవంతుడైతే మోక్షమార్గాన్ని చూపేవాడు సద్గురువు. అటువంటి సద్గురువును ఆశ్రయిస్తేనే మోక్ష సిద్ధిస్తుంది.

## 5. తమ కర్మను తామే అనుభవించాలి

కర్మను గురించి అనేకసార్లు చెప్పుకున్నాం. కర్మ అంటే మనం చేసిన పని. ఆ పని మనమే చేశాం కాబట్టి దానివల్ల వచ్చే ఫలితం కూడా మనమే అనుభవించాలి. ఇందులో సందేహం లేదు. నేను ఈ పని చేస్తున్నప్పుడు ఎవరూ చూడలేదు కదా ? అనుకోకూడదు. ఎవరు చూసినా చూడకపోయినా ఎవరు చేసిన కర్మవారే అనుభవించాలి. మనం చేసిన కర్మకి ఆ భగవంతుడే సాక్షి. మనం వండుకున్నఅన్నం మనమే తినాలి. అలాగే మనం చేసిన కర్మఫలాన్ని మనమే అనుభవించాలి. ఇది ఎలా జరుగుతుందో చూద్దాం.

పూర్వకాలంలో ఒకరాజు గారు ఒకరోజున తన ఆస్థానంలో ఉన్న మంత్రులు ముగ్గురిని పిలిచి, ఒక్కొక్కరికి ఖాళీ గోనె సంచి ఒకటి ఇప్పించి "మీరందరూ అరణ్యంలోకి వెళ్ళి సాయంత్రంలోగా మీకిచ్చిన సంచులను మీకు తోచిన పండ్లతో నింపి తీసుకురండి' అన్నాడు.

ముగ్గురు మంత్రులూ ఖాళీ సంచులు తీసుకుని అరణ్యంలోకి వెళ్ళారు. మొదటి మంత్రి ఆలోచిస్తున్నాడు. 'రాజుగారు అరణ్యంలోంచి పండ్లు తెమ్మన్నారు. అలా అనటంలో ఏదో పెద్ద విశేషం ఉండి ఉంటుంది. లేకపోతే అలా చెప్పరు. కాబట్టి నిజాయితీగా అరణ్యం అంతా తిరిగి మంచి నాణ్యత గల పండ్లు ఏరి మరీ తీసుకువెడదాం! అనుకుని చాలా శ్రమపడి సాయంత్రం వరకు అరణ్యమంతా తిరిగి మంచి మంచి తాజాపండ్లు, నాణ్యత గల పండ్లు సేకరించి తీసుకువచ్చాడు.

రెండవ మంత్రి అరణ్యానికి వెడుతూ త్రోవలో 'రాజు గారికి పండ్లకి కొదవలేదు అయినా సరే పండ్లు ఏరుకురమ్మని మమ్మల్ని పురమాయించారు. ఎలాగో ఒకలాగా ఈ బస్తా నింపితే చాలు' అని ఆలోచించి అరణ్యంలో కంటికి కనిపించిన పండ్లన్నీ ఏరి సంచిలో వేసుకున్నాడు. అందులో తాజావి, నిల్వ ఉన్నవి, పాడైపోయినవి,

కుళ్ళిపోవటానికి సిద్ధంగా ఉన్నవి అన్నీ ఉన్నాయి. ఇలా బస్తా నింపుకుని సాయం సమయానికి రాజభవనం చేరాడు.

ఇక మూడవ మంత్రి అరణ్యానికి పోతూ 'రాజుగారికి తీరిక ఎక్కడ? ఎప్పుడూ ఏదో ఒక రాచకార్యం ఉంటుంది. చాలా పనులకు నాలాంటి సేవకుల మీదనే ఆధారపడతాడు. పండ్లు తీసుకుని రండి అని మాకు చెప్పాడు. మేంసరిగా తెచ్చామో లేదో ఆయన ఎక్కడ చూస్తాడు? ఏదో ఒక రకంగా బస్తానింపేస్తే సరిపోతుంది.' అనుకుని సంచిలో మూడువంతుల వరకు ఆకులు, అలములు, చెత్త, చెదారం పోసి, పై పైన పండ్లు సర్ది బస్తాని రాజభవనానికి తీసుకువచ్చాడు.

వీరనుకున్నట్లుగానే వీరందరూ ఏ రకమైన పండ్లు తెచ్చారో రాజుగారు అసలు చూడనే లేదు. కాని వీరు రాజభవనం చేరగానే భటులను పిలిచి ఈ ముగ్గురు మంత్రులను వారు తెచ్చిన బస్తాలతో సహా చెరసాలలో బంధించి ఒక నెలరోజులపాటు ఉంచండి. వారికి ఆకలేస్తే, వారు ఏరి తెచ్చిన సంచిలో పండ్లను తినమనండి' అన్నాడు. రాజాజ్ఞను పాటించారు భటులు. మంత్రులు ముగ్గురు చెరసాలలో బంధించబడ్డారు. వారికి ఆహారంగా వారు ఏరుకొచ్చిన పండ్లనే ఉపయోగిస్తున్నారు. నాలుగు రోజులు గడిచినాయి. వారు వచ్చిన రెండవ రోజుకే మూడవమంత్రి తెచ్చిన బస్తాలోని పై పైన పేర్చిన పండ్లై పోయి ఆకులు అలములు బయటపడ్డాయి. ఇప్పుడు మంత్రి వాటినే ఆహారంగా తీసుకుంటున్నాడు. సరైన పోషకాహారం లేక ఆ మంత్రి గారికి ఆరోగ్యం పాడయింది. దీంతో మంచాన పడి రోగంతో తీసుకు తీసుకుని చచ్చిపోయాడు.

రెండవ మంత్రి తెచ్చిన కాయలతో మరి కొంతకాలం జీవించగలిగాడు. అయితే ఆ పండ్లలో కొన్ని పాడైనవి కాబట్టి వాటివల్ల రోగం వచ్చింది.

క్రమేణా ఆరోగ్యం దెబ్బ తినటం చచ్చిపోవటం జరిగాయి.

మొదటి మంత్రి ఎంతో శ్రమపడి మంచి నాణ్యత గల పండ్లు మాత్రమే తెచ్చాడు. అని చాలా ఆరోగ్యంవంతమైనవి. దాంతో మొదటి మంత్రి నెలరోజులు ఆ పండ్లు తిని ఆరోగ్యంగా ఉన్నాడు.

మనం చేసిన పనులకు ప్రతిఫలం తప్పకుండా అనుభవిస్తాం. అందుకే మొదటి మంత్రి తాను ఏరి తెచ్చిన మధుర ఫలాలు తిన్నాడు. శరీరం ఇంకా ఆరోగ్యంగా ఉంది.

దీన్ని బట్టి మనకు అర్థం అయ్యేది ఏమంటే, ఎవరు చేసిన కర్మను వారే అనుభవించాలి వేరెవరూ ఆ ఫలితాన్ని అనుభవించరు. అందుకే ఎప్పుడూ మంచి పనులే చెయ్యాలి. సత్కర్మలే ఆచరించాలి.

ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. 84 లక్షల రకాల జీవరాసి కర్మ చేసింది కదా? అలాంటప్పుడు ఎవరెవరు ఏ కర్మ చేశారు అనే దాన్ని బట్టి ఫలితము దొరుకుతుంది. మంచి పనులు చేసిన వారు మంచి ఫలితాన్ని, చెడ్డ పనులు చేసినవారు దుష్టమైన ఫలితాన్ని అనుభవించాలి. చేసిన కర్మఫలాన్ని, ఆ కర్మ చేసిన వారే ఎలా అనుభవిస్తారు. అంటే పెద్ద గోవులు వాటి పిల్లలు కలిసి వెడుతున్నాయి. అంత పెద్ద మందలో కూడా దూడ తన తల్లి దగ్గరకే వెతుక్కుంటూ పోతుంది అలాగే జీవి చేసిన కర్మ, అతడు అనుభవించటానికి అతణ్ణే వెతుక్కుంటూ చేరుతుంది.

కాబట్టి కర్మ చేసేటప్పుడు నిజాయితీగా, మంచి ఫలాన్ని ఇచ్చే కర్మను మాత్రమే చెయ్యండి. అలా కాకుండా చెడుకర్మ సేసినట్లైతే ఆ కర్మఫలితాన్ని కూడా నువ్వే అనుభవించాలని గుర్తుంచుకోవాలి.

## 6. దానం-ధర్మం

మామూలుగా మాట్లాడేటప్పుడు దానధర్మాలు అంటాం. ఇవి రెండు పదాలు 1.దానం 2.ధర్మం.

దానము అంటే మన కర్మ పోగొట్టుకునేందుకు చేసేది. జాతకంలో శని గ్రహం ప్రస్తుతం బాగాలేదు. అతడి వల్ల మనకి ఇబ్బందులు వస్తాయి. అందుకని శనికి జపము, అభిషేకము చేయించి నువ్వులు దానం ఇవ్వండి అన్నారు. అలాగే చేశాం. దీంతో మనకి పట్టిన శని కొంతవరకైనా తప్పుతుంది అని నమ్మకం. అలా జరుగుతుందనే మన శాస్త్రాలు కూడా చెబుతున్నాయి. పండుగలు పబ్బాలు వచ్చినప్పుడు గాని, ఇతర పవిత్రమైన రోజుల్లో గాని పెద్దవాళ్ళని పిలిచి వాళ్ళకి బట్టలు పెడతాం. ఇది వస్త్రదానం. మనం బట్టలు పెట్టాము అంటే, అవి వారికి లేవని కాదు. వారికి బట్టలు పెట్టటం వల్ల మనకు పుణ్యం వస్తుందని. ఇలా దానం చేసిన సొమ్ము కొన్ని రెట్లై మళ్ళీ మనకే తిరిగి వస్తుంది. పేద విద్యార్థులకు ఫీజులు కట్టి, పుస్తకాలు కొనిచ్చి వాళ్ళని చదివిస్తుంటాం. దీనివల్ల పదిమందికి మేలు జరుగుతుంది. దేశంలో విద్యావంతులు పెరుగుతారు. మరుజన్మలో మనకి మంచి

చదువు వస్తుంది. మనం కూడా ఉన్నత విద్యాభ్యాసం చేస్తాం. ఇలాంటి కారణాలతోనే దానం చెయ్యటం జరుగుతుంది.

ఇక ధర్మం. హైందవ ధర్మం ప్రకారం సంపాదించిన దానిలో కొంత భాగం పేదలకు పంచిపెట్టాలి. ఆకలితో అలమటించే వారి ఆర్తిని తీర్చాలి. కట్టుకోటానికి బట్టలు లేనివారికి బట్టలు ఇవ్వాలి. నా చిన్నప్పుడైతే 'మాదాకబళం తల్లీ' అంటూ ఆడుక్కునే వారు ఇంటివద్దకు వచ్చేవారు. మనింట్లో మిగిలిపోయిన పదర్థాలు వాళ్ళకి ఇచ్చేవాళ్ళం. అయితే ఇవాల్టి రోజున అలా అన్నం అడుక్కునేవాళ్ళు కనిపించటం లేదు. పూర్వకాలంలో అయితే తాము ఒండుకున్న పదార్థంలో కొంత భాగం ఎవరికైనా ధర్మం చెయ్యందే భోజనం చేసేవారు కాదు. అది ఒక నియమంగా భావించేవారు. అంటే ప్రతివారు తప్పనిసరిగా ధర్మం చేసే వారన్నమాట. ధర్మము అనేది ఎదుటివారి ఆకలి అవసరము తీర్చటానికి చేసేది. ఇప్పటికీ మనం చూస్తూనే ఉంటాం. 'మా అమ్మాయికి పెళ్ళి కుదిరింది. తలా కొంచెం సాయం చెయ్యండి' అని అడుగుతుంటారు. మనకి చేతనైనది సాయం చేస్తాం. ఇది ధర్మము. ఇంటి ముందుకు వచ్చిన బిచ్చగాడు కూడా 'ధర్మం చెయ్యి తల్లీ' అంటాడు అంతేకాని దానం చెయ్యమని అడగడు. కళాకారులు, పురోహితులు, పేదలు, సన్యాసులు, విద్యార్థులు, ఇలంటి వారందర్నీ పోషించవలసిన బాధ్యత సమాజానికి ఉంది. వారికి మనం చేసేదే ధర్మం.

ఏ మతంలోనైనా సరే, ఏ ధర్మంలోనైనా సరే నువ్వు సంపాదించిన దాంట్లో కొంత భాగం దానధర్మాలకు వినియోగించాలి అనే చెప్పారు. కాబట్టి ఈ లోకంలో ప్రతివారు దానధర్మాలు చెయ్యాలి.

ఒకసారి ఒక బాటసారి త్రోవనపోతున్నాడు. మధ్యాహ్న సమయం. ఎండ బాగా మండిపోతుంది. నడిచి నడిచి బాగా అలసిపోయాడు. విపరీతంగా దాహం వేస్తోంది. బయలుదేరే ముందు కూడా దాహం వేసింది. ఆ దగ్గరలోనే ఒక నది ఉన్నది. ఆ నది దగ్గరకు వెళ్ళి, స్నానం చేసి దాహం తీర్చుకున్నాడు. ఇప్పుడు మళ్ళీ దాహం వేస్తోంది. దగ్గరలో నది ఎక్కడైనా ఉన్నదా? అనుకుంటూ జాగ్రత్తగా దిక్కులు పరికిస్తున్నాడు. దూరంగా నీరు ఉన్నట్లుగా అనిపించింది. ఓపిక చేసుకుని అటువైపుగా నడిచాడు. అక్కడ నది లేదు. దానికన్న కొందలరెట్లు పెద్దదయిన సముద్రం ఉంది. చిన్ననదే తన దాహాన్ని తీర్చగలిగినప్పుడు, ఇంత పెద్ద సముద్రం దాహాన్ని తీర్చదా? అనుకుంటూ సముద్రం దగ్గరకు వెళ్ళి దోసిలితో నీరు తీసుకుని నోట్లో పోసుకున్నాడు.

ఇంకేముంది? ఉప్పుమయం. ఆ నీరంతా కటిక ఉప్పగా ఉంది. భరించలేక వెంటనే నోట్లో నీరు బయటకు ఉమ్మేశాడు. అయినా కూడా ఆ ఉప్పదనానికి కడుపులో త్రిప్పేస్తోంది. అప్పుడు అతడికి చిన్న అనుమానం వచ్చింది. నది చాలా చిన్నగా ఉంది. అందులోని నీరు తియ్యగా ఉంది. మరి సముద్రం ఇంత పెద్దగా ఉన్నప్పటికీ అందులోని నీరు ఇంత ఉప్పగా ఉన్నది ఎందుకని? అదే మాటను సముద్రంతో అన్నాడు. "ఓ సముద్రమా ! నది చాలా చిన్నగా ఉంది అయినా నదిలోని నీరు తియ్యగా ఉన్నది. నువ్వు ఆకారంలో చాలా పెద్దగా ఉన్నావు. కాని నీలోని నీరు ఉప్పగా ఉన్నది. దీనికి కారణం ఏమిటి? దానికి సముద్రం సమాధానం చెబుతోంది. 'నది ఈ చేత్తో తీసుకున్న నీటిని ఆ చేత్తో దానం చేస్తుంది. నదిలోకి వచ్చి చేరిన నీరు వ్యవసాయానికి, త్రాగటానికి, ఇంట్లో వాడుకోటానికి ఇలా అనేక రకాలుగా ఉపయోగిస్తుంది. నదికి తీసుకునే గుణమే కాదు ఇవ్వటం కూడా ఉంది. అంటే నది తన నీటిని ఇతరులకు దానం చేస్తుంది. అందుకే నది నీరు తియ్యగా ఉంటుంది. ఇక నేను నీటిని తీసుకుంటానే గాని ఎవరికీ ఇవ్వను. దానగుణం నాకు లేదు. అందుకే నా నీరు ఉప్పగా ఉంటుంది.'

మానవులు కూడా నదిలాగానే జీవించాలి ఒక చేత్తో సంపాదిస్తూ రెండవ చేత్తో దానధర్మాలు కూడా చెయ్యాలి. అలా చేసినవారి జీవితమే సార్ధకమవుతుంది. వారే జీవితంలోని మాధుర్యాన్ని రుచి చూడగలుగుతారు. సంపాదించినదంతా ఎవరికీ దానం చెయ్యకుండా, కనీసం తానుకూడా అనుభవించకుండా దాచుకునే వారికి పుట్టగతులుండవు. వారి సంపద అంతా సముద్రపు నీటిలాగా వ్యర్థం అవుతుంది. కష్టపడి సంపాదించి దాచిన సొమ్ము 'రాజులపాలో లేక రాళ్ళపాలో అవుతుంది.

సంపాదించిన ధనాన్ని ఆ రోజుల్లో అయితే నేలలో గొయ్యి తీసి, పాతిపెట్టేవారు. అలా పాతిపెట్టబడిన ధనమే గుప్తనిధిగా ఇవాళ్ళ మన వాళ్ళకి దొరుకుతోంది. సంపాదించిన ధనం తాను అనుభవించకుండా, ఇతరులకు దానం చెయ్యకుండా దాచిపెట్టినవాడు పరమలోభి. మరణానంతరము అతడికి ఉత్తమగతులు ప్రాప్తించవు.

కాబట్టి **కష్టపడి సంపాదించిన దాంట్లో కొంత మొత్తాన్ని తప్పనిసరిగా దానధర్మాలను వినియోగించాలి.**

# 7. పదిమందికీ మేలుచెయ్యి

ప్రతి మానవుడు తన పిల్లల మీద విపరీతమైన ప్రేమాభిమానాలు కలిగి ఉంటాడు. తను పడ్డ కష్టాలు తన పిల్లలు పడకూడదు అనే కోరుకుంటాడు. అందుకే తమ ఒకపూట తిన్నా పిల్లలు రెండు పూటలా తినేలా చూస్తాడు. తను నేలమీద పడుకున్నా పిల్లలు పరుపుల మీద పడుకోవాలి అని కోరుకుంటాడు. దాని కోసమే ప్రయత్నం చేస్తాడు. తను చినిగిపోయిన బట్టలు కట్టుకున్నాసరే పిల్లలకి మాత్రం మంచి బట్టలు కొంటాడు. పగలనక రాత్రనక కష్టపడి సంపాదించి ఆస్తులు కూడబెట్టి పిల్లలకిస్తాడు. తను పూరిపాకలో ఉండి కూడ పిల్లలు అందమైన భవనంలో నివశించాలనే కలగంటాడు. తను కష్టపడి పని చేసి పిల్లలకి మంచి చదువులు చెప్పిస్తాడు. వాళ్ళ జీవితానికి పూలబాట వేస్తాడు. అదే తండ్రి గొప్పదనం. కాని విచిత్రమేమంటే తల్లిదండ్రులకు పిల్లల మీద ఉన్న ప్రేమ, పిల్లలకు తల్లితండ్రుల మీద ఉండదు. తమకు చదువు చెప్పించటం, డబ్బులు సంపాదించి కూడబెట్టి జాగ్రత్తగా వాటిని తమకు వప్పచెప్పటం తల్లితండ్రుల బాధ్యతగా భావిస్తారు. అంతేకాని అందులో అభిమానం ఆప్యాయత, అనురాగం, ప్రేమ, మమకారం వంటివి పిల్లలకు కనిపించవు. తల్లితండ్రులిచ్చే ఆస్తిపాస్తులు కావాలి. కాని వారు మాత్రం అక్కర్లేదు. వాళ్ళు కష్టపడి చెమటోడ్చి సంపాదించిన డబ్బులు కావాలి. ఆ డబ్బుతో తాము విలాసవంతమైన జీవితం గడపాలి. అంతేకాని ఆ డబ్బు సంపాదించి ఇచ్చిన తల్లితండ్రులు మాత్రం అవసరం లేదు. వాళ్ళతో మాట్లాడే తీరుబడి ఉండదు. వాళ్ళు తిన్నారో లేదో కనుక్కునే సమయం ఉండదు. వారు ఆరోగ్యంగా ఉన్నారో లేదో విచారించే తీరుబడి ఉండదు. కొన్ని చోట్లైతే తల్లితండ్రులు సంపాదించిన డబ్బు ఇంకా తమకు ఇవ్వలేదని వాళ్ళని చంపేసే స్థితికి దిగజారిపోయిన పిల్లల్ని కూడా చూస్తున్నాం. అందుకే తల్లితండ్రులు పిల్లల పట్ల ప్రేమాభిమానాలు కలిగి ఉండాలి. వారిని అల్లాడు ముద్దుగా పెంచాలి. పిల్లల మీద వ్యామోహం కాని, వారితో బంధం కాని విపరీతంగా పెంచుకోరాదు. తగిన హద్దుల్లోనే ఉండాలి. దీనికి ఉదాహరణగా ఒక చిన్నకథ చూడండి.

పూర్వకాలంలో దేశం ఇంత అభివృద్ధి చెందలేదు. విద్యుత్తు లేదు. రవాణా సౌకర్యాలు లేవు. ఎక్కడికి వెళ్ళాలన్నా సామాన్యులు కాలినడకనే పోయేవారు. సంపాదించిన డబ్బులు దాచి పెట్టుకోటానికి బ్యాంకులు లేవు. అందుకే ఆ డబ్బుని

నేలలో గోతులు తీసి, అందులో పాతిపెట్టేవారు. అలా పాతిటచెిఇిన ధనమే ఇప్పుడు గుప్తనిధి పేరుతో మనవాళ్ళు తవ్వుకుంటున్నారు. ఆ రోజుల్లో ఒక సాధువు ఒక గ్రామం గుండా నడిచి వెడుతున్నాడు. అలా వెడుతూ, అలసటగా ఉండి త్రోవలో ఒక చెట్టు క్రింద కూర్చున్నాడు. ఆ చెట్టు ఎదురుగా ఒక భవంతి ఉన్నది. అందులో ఒక సంపన్నుడు ఉన్నాడు. అతడు ఈ సాధువుని చూసి "స్వామీ ! మా ఇంటికి వచ్చి విశ్రాంతి తీసుకుని, మా ఆతిథ్యం స్వీకరించి వెళ్ళడి' అని ప్రాధేయపడ్డాడు. సరే అన్నాడు సన్యాసి.

ఇంటికి వచ్చిన సన్యాసికి సకల మర్యాదలు చేశాడు గృహస్థు. ఆ రాత్రికి అక్కడే విశ్రమించాడు సన్యాసి.

భోజనాలు చేసిన తరువాత గృహస్తు, సన్యాసి ఇద్దరూ అనేక విషయాల మీద మాట్లాడుకున్నారు. మాటల్లో వారి స్వంత విషయాలు కూడా వచ్చాయి. ఆ సమయంలో గృహస్తు 'ఏమిటో స్వామీ ! జీవితంలో సుఖమనేది లేదు. మీ జీవితమే హాయిగా ఉంటుంది. దేనికీ విచారమనేది ఉండదు' అన్నాడు.

ఆ మాటలు విన్న సన్యాసి 'అయితేనావెంటరా ! నీకు మోక్షమార్గం చూపిస్తాను' అన్నాడు.

ఆ ఆ మాటలు వినగానే కంగారు పడ్డాడు యజమాని 'అదెలా కుదురుతుంది స్వామీ ! పిల్లలు చిన్నవాళ్ళు. వాళ్ళని పెంచి పెద్ద చెయ్యాల్సిన ధర్మం నాకున్నది కదా?' అన్నాడు. సన్యాసి ఏమీ మాట్లాడలేదు. తెల్లవారిన తరువాత తన త్రోవన తను వెళ్ళిపోయాడు. కాలచక్రం వేగంగా తిరిగింది. కొన్ని సంవత్సరాలు గడిచాయి.

మళ్ళీ ఈ సన్యాసి అదే మార్గంలో వెడుతున్నాడు. గతంలో పరిచయమయిన గృహస్థు ఇల్లు చూసి ఆగాడు. సన్యాసిని చూసిన యజమాని అమితానందంతో వెళ్ళి పలకరించాడు. ఇంటికి ఆహ్వానించాడు. అన్ని మర్యాదలు చేశాడు. ఇప్పుడు అన్నాడు సన్యాసి. 'నాయనా! పిల్లలు పెద్దవాళ్ళైనారు కదా? ఇప్పుడు నాతో వచ్చెయ్యి. మోక్షమార్గం చూపుతాను.' అని. యజమాని తల అడ్డంగా తిప్పాడు. 'ఇప్పుడు కాదు స్వామీ! పిల్లలు ఇంకా స్థిరపడాలి' అన్నాడు. మరునాడు సన్యాసి వెళ్ళిపోయాడు.

కొన్ని సంవత్సరాలు గడిచాయి. సన్యాసి అదే మార్గం గుండా వెడుతున్నాడు. అదే యజమాని ఆతిథ్యమిచ్చాడు. మళ్ళీ అడిగాడు సన్యాసి 'నాతో రా' అని. విసుకున్నాడు యజమాని. 'పిల్లలకు డబ్బు విలువ తెలియదు. సంపాదించిన డబ్బంతా

చెట్టు క్రింద పాతిపెట్టాను. వీలు చూసుకుని పెద్ద ఇల్లుకట్టాలి. ఇవన్నీ పిల్లలకి అప్పగించాలి. మీ లాగా నాకు ఎలా కుదురుతుంది?' అన్నాడు మరునాడు వెళ్ళిపోయాడు సన్యాసి.

కొన్ని సంవత్సరాలు గడిచాయి. సన్యాసి మళ్ళీ ఆ త్రోవగుండా పోతున్నాడు. అక్కడ ఒకపెద్ద భవనం ఉంది. దానివైపు చూడకుండా వెడుతున్నాడు సన్యాసి. యజమాని కొడుకు పరుగెత్తి వచ్చి తండ్రి మరణించాడని చెప్పి, సన్యాసిని తమ ఇంటికి ఆహ్వానించాడు. అతడి ఆహ్వానాన్ని మన్నించి, వారింటికి వెళ్ళాడు సన్యాసి.

ఇంట్లోంచి బయటకు వస్తున్న సన్యాసికి ఎదురుగా చెట్టుక్రింద ఒక కుక్క కనపిడింది అర్థమయింది. యజమాని తన డబ్బంతా ఆ చెట్టుక్రింద పాతిపెట్టి, మరణానంతరము కుక్కగా పుట్టి ఆ ధనాన్ని రక్షిస్తున్నాడు.

కమండలంలోని నీరు కుక్కమీద జల్లి 'ఏమిటి ఈ పిచ్చి వ్యామోహం. కుక్కగా పుట్టి ధనాన్నికి కాపలా కాస్తున్నావా? నా వెంటరా మోక్షమార్గం చూపిస్తాను" అన్నాడు.

'నేను డబ్బు ఇక్కడ దాచిన సంగతి పిల్లలకి చెప్పలేదు. దొంగలు తీసుకు పోకుండా దీన్ని రక్షించాల్సిన బాధ్యత నాదే. నేను రాలేను' అన్నాడు యజమాని సన్యాసి వెళ్ళిపోయాడు.

మళ్ళీ కొన్నాళ్ళకి సన్యాసి ఆ మార్గం గుండా వచ్చాడు. ఇప్పుడు కుక్క కనపడలేదు. అది చచ్చిపోయిందని అక్కడి వాళ్ళు చెప్పారు. ఆ చుట్టుపక్కల తిరుగుతూ ఒక పాము కనిపించింది సన్యాసికి. పరిక్షగా చూశాడు. అదే యజమాని. ఇప్పుడు సన్యాసి పాముతో 'ఈ ఇల్లు వదిలిపెట్టి వెళ్ళవా? నాతోరా' అన్నాడు

ఆ మాట మాత్రం అనకండి స్వామీ ! నా సొమ్ము పిల్లలకు చేరేట్లుగా చూడాలి కదా. నేను మీతో రాలేను' అని సమాధానం ఇచ్చాడు చాలా దీనంగా.

సన్యాసి వెంటనే భవనంలోకి వెళ్ళి, యజమాని కొడుకులతో 'మీ నాన్న సంపాదించినందా ఆ చెట్టు క్రింద పాతిపెట్టాడు. కాకపోతే పాము రూపంలో మీ నాన్నే ఆ ధనానికి కాపలా ఉన్నాడు' అని చెప్పాడు.

వెంటనే యజమాని కొడుకులు కర్రలు తీసుకుని వెళ్ళి పాముని కొట్టి చంపి. తండ్రి పాతిపెట్టిన ధనాన్ని స్వాధీనం చేసుకున్నారు. అలా తన పిల్లలే తను సంపాదించిన ధనం కోసం తనను కొట్టి చంపుతుంటే, ఏమీ చెయ్యలేక, దీనంగా సన్యాసిని చూస్తూ ప్రాణాలు వదిలాడు యజమాని.

డబ్బు చాలా చెడ్డది. రూపాయి రూపాయి ఏం చేస్తావు అంటే – 'భార్యా భర్తల మధ్యన చిచ్చుపెడతాను. అన్నదమ్ముల్ని విడదీస్తాను. కాపరాలు కూలుస్తాను. దేశంలో ఒకరికి ఒకరు కాకుండా చేస్తాను' అన్నదట. అటువంటి రూపాయి తండ్రి కొడుకుల మధ్య బంధాన్ని ఎలా నిలుపుతుంది?

కాబట్టి ఓ మానవుడా మేలుకో. పిల్లల్ని జాగ్రత్తగా చూడు. అంతే గాని హద్దులు మీరకు. వాళ్ళే నీ లోకం అని మాత్రం అనుకోవు. **డబ్బు ముందు బాంధవ్యాలు ఉండవు.** కాబట్టి నీకున్న సమయంలో కొంతైనా భగవచ్చింతనలో గడుపు. నీకు **చేతనైనంత వరకు పది మందికీ మేలు చెయ్యి.**

## 8. మానవసేవే మాధవసేవ

భగవంతుడి యందు ఉన్న విపరీతమైన ఇష్టము, లేదా ప్రేమనే భక్తి అంటారు. భగవంతుణ్ణి తండ్రిగా, కుమారుడుగా, భర్తగా పలురకాలుగా భావన చేస్తారు. ఈ భక్తిలో తత్పరత పరాకాష్ఠ.

అయితే భగవంతుడు సర్వాంతర్యామి అయిన పరమేశ్వరుడు. 84 లక్షల జీవరాసి యందు ఆవరించి ఉన్నాడు. జగత్తులో ప్రతిదీ పరమేశ్వర స్వరూపమే. ఈ జీవరాసిలో దేనికి సేవచేసినా, అదంతా భగవంతుడికే చెందుతుంది. పూర్వ కాలంలో ధనవంతులు అన్నసత్రాలు, విద్యాలయాలు, శరణాలయాలు మొదలైనవి కట్టించి సమాజసేవ చేసేవారు. అదంతా భగవంతుడి సేవే తప్ప వేరుకాదు. మానవసేవే మాధవసేవ. తోటి మానవుడికి సాయపడకుండా చేసే పూజలు, వ్రతాలు ఏవీ ఫలించవు. దరిద్ర నారాయణ సేవ. ఇది పూర్తిగా భగవంతుడికి చేసేసేవ. ఇలా సేవ చేసే వారిని భగవంతుడు కరుణిస్తాడు. వారు భగవంతుడికి దగ్గరవుతారు.

పూర్వకాలంలో ఒకసారి కాశీనగరంలో అర్చకుడు విశ్వనాధుడికి అభిషేకం చేస్తున్నాడు. ఇంతలో ఆలయం బయట పెద్ద శబ్దం అయింది. అర్చకుడు బయటకు వచ్చి చూశాడు. పెద్ద బంగారు పళ్ళెం కనిపించింది. ఆశ్చర్యపోయాడు పూజారి. దగ్గరకు వెళ్ళి చూశాడు 'నా భక్తునికోసం' అని దానిమీద వ్రాసి ఉంది. ఈ బంగారు పళ్ళాన్ని సాక్షాత్తు విశ్వనాథుడే తనకోసం పంపించాడు. తాను ప్రతిరోజు క్రమం తప్పకుండా త్రికాలముల యందు విశ్వనాథుడికి అభిషేకం చేస్తాడు. ఇతర రకాలైన సేవలు చేస్తాడు. అందుకని ఆ భగవంతుడు అనుగ్రహించి తనకోసం ఈ బంగారు

పళ్ళెం పంపించాడు. వెళ్ళి తీసుకుందాం అని దాన్ని ముట్టుకున్నాడు. మరుక్షణంలో అది మట్టిమూకుడుగా మారిపోయింది. పూజారి మొహం వెలవెలబోయింది. పళ్ళాన్ని వదిలేశాడు. అది బంగారం అయిపోయింది. మళ్ళీపట్టుకున్నాడు. అది మట్టిమూకుడు అయిపోయింది. ఇక లాభం లేదు. తను ముట్టుకుంటే బంగారం కాస్తా మట్టి అయిపోతోంది. కాబట్టి ఇది తనకోసం కాదు అని నిర్ధారించుకుని ఇవతలకి వచ్చేశాడు. ఆలయానికి వచ్చిన భక్తులు కొంతమందికి ఈ విషయం చెప్పాడు. వాళ్ళు కూడా దాన్ని తీసుకోటానికి ప్రయత్నం చేశారు. కాని అది మట్టిమూకుడుగా మారిపోయింది. ఇది మనకోసం కాదు. ఇదసలు బంగారమే కాదు అంటూ అంతా వెళ్ళిపోయారు కాని వారందరి మనసు బంగారు పళ్ళెం మీదనే ఉంది.

'ఆలయంలో బంగారు పళ్ళెం' అనే మాట దేశం అంతా దావానలంలా వ్యాపించింది. కాశీనగరం నుంచే కాదు దూరప్రాంతాల నుంచి కూడా భక్తులు వచ్చి ఆ పళ్ళెం తీసుకోవటానికి ప్రయత్నం చేస్తున్నారు. వారు ముట్టుకోగానే అది మట్టిమూకుడు అయిపోతోంది. చూడటానికే చాలా తమాషాగాను వింతగాను ఉంది. ఈ మాట రాజభవనానికి చేరింది. కాశీనగరాన్ని పాలించే మహారాజు చాలా గొప్ప శివభక్తుడు. అందులోను రాజు. దాంతో నాకన్న గొప్ప భక్తుడు ఎవరున్నారు. ఆ పళ్ళెం నాకోసమే అయి ఉంటుంది అనుకున్నాడు రాజు. వెంటనే మంది మార్బలంతో ఆలయానికి బయల్దేరాడు. ఆలయానికి వచ్చి స్వామికి నమస్కరించి వెళ్ళి బంగారు పళ్ళెం చూశాడు. చాలా పెద్దది. విశ్వేశ్వరుడు తనకోసమే దాన్ని పంపించాడు అనుకున్నాడు. తీసుకోవటానికి దాన్ని పట్టుకున్నాడు. అంతే వెంటనే బంగారం కాస్తా మట్టైయిపోయింది. రాజుకు తెలిసింది. అది తన కోసం కాదు. ఇప్పుడు అనుభవపరంగా ప్రజలందరి ముందు అవమానం కూడా జరిగింది. అవమాన భారంతో తలవంచుకుని అక్కడి నుంచి నిష్క్రమించాడు.

గతంలో ఒక పెద్దాయన. స్వామివారి భక్తుడు. రోజూ క్రమం తప్పకుండా ఆలయానికి వచ్చి స్వామిని సేవిస్తుంటాడు. ఆయన ఆలయం లోపలికి వస్తున్నాడు. త్రోవలో రెండువైపులా బిచ్చగాళ్ళు కూర్చుని ఉన్నారు. అందులో కళ్ళు లేనివాళ్ళు, కాళ్ళు లేనివాళ్ళు, నోరు లేనివాళ్ళు, నడవలేని వాళ్ళు ఇలా రకరకాల వాళ్ళున్నారు. వారంతా అనాథలు. నా అనేవారు ఎవరూ లేనివాళ్ళు. వాళ్ళందరికీ ఆ విశ్వేశ్వరుడే దిక్కు. రోజూ అక్కడే కూర్చుంటారు. భక్తులు వేసే ధర్మంతో జీవిస్తుంటారు. వాళ్ళని

చూసి చాలా బాధపడ్డాడు ఈ భక్తుడు. విశ్వేశ్వరా ! వీళ్ళందరికీ మంచి జీవితాన్ని ప్రసాదించు స్వామీ. వీరి అంగవైకల్యాల్ని పోగొట్టు అని భగవంతుణ్ణి ప్రార్థించాడు. ఇంతలో ఒక బిచ్చగాడు కుంటివాడు. నడవలేక పడిపోతున్నాడు. అతణ్ని పట్టుకుని నడిపించి తీసుకొచ్చి కూర్చోబెట్టాడు. ఒక నిర్భాగ్య స్త్రీ ఆకలితో అలమటిస్తోంది. విశ్వేశ్వరుడి కోసం తెచ్చిన పండ్లు ఆవిడకి ఇచ్చి తినిపించాడు. వీళ్ళందరినీ కరుణించు స్వామీ. అని భగవంతుణ్ణి ప్రార్థిస్తూ ఆలయంలోకి వచ్చి స్వామిని దర్శించాడు. తిరిగి వెళ్ళబోతున్నాడు. అప్పుడు అక్కడ ఉన్నవారు బంగారు పళ్ళెం గురించి చెప్పారు. ఇదేదో చాలా వింతగా ఉంది. చూద్దాం అని అటువైపు వెళ్ళాడు. దూరంగా నుంచుని చూస్తున్నాడు. అప్పుడు ఆలయ పూజారి వచ్చి 'ఓ పెద్దాయనా ! నువ్వు మహాభక్తుడివి. నిరంతరం క్రమం తప్పకుండా ఆలయానికి వస్తావు. స్వామిని సేవిస్తావు. నువ్వు కూడా ప్రయత్నించు. నీ భక్తి ఏపాటిదో తెలిసిపోతుంది' అన్నాడు కొంచెం హేళనగా. మిగిలిన వారంతా గొంతు కలిపారు. సరే తప్పు లేదు. ఆ పెద్దాయన వచ్చి బంగారు పళ్ళాన్ని పట్టుకున్నాడు. ఆశ్చర్యం. మహదాశ్చర్యం. ఇంతవరకు ఎవరు ముట్టుకున్నా మట్టిమూకుడుగా మారిపోయిన ఆ పళ్ళెం ఇప్పుడు అలా మారలేదు. ఇంకా ఎక్కువ కాంతితో ప్రకాశిస్తోంది. అందరూ నోళ్ళు తెల్లబెట్టారు. జనంలో నుంచి ఒకరు చప్పట్లు కొట్టారు. ఇంకేముంది జనమంతా చప్పట్లు. పెద్దపెద్దగా కేకలు. హర్షధ్వానాలు. ఈ పెద్దాయన నిజంగానే మహాభక్తుడు అన్నారు.

ఆ మహాభక్తుడు ఆ బంగారు పళ్ళేన్ని అమ్మి వచ్చిన దాంతో అక్కడ ఆలయం దగ్గర బిచ్చగాళ్ళందరికీ దానం చేశాడు.

**నిజమైన భక్తి అంటే భగవంతుడికి పూజలు చేయటం కొబ్బరికాయలు కొట్టటం కాదు. మానవసేవే మాధవసేవ అని గుర్తించి సాటిమనిషిని కష్టాల్లో ఆదుకోవాలి. సాయం చెయ్యాలి.** అలాంటివాడే భగవంతుడికి ప్రీతిపాత్రుడు.

## 9. మహామోహము

మోహము అంటే కోరిక. మహామోహము – విపరీతమైన కోరిక. ఈ రకమైన కోరిక సామాన్యంగా అందరికీ ఉంటుంది. కొందరికి ధనం సంపాదించాలనే కోరిక. ఎంత సంపాదించినా ఆ కోరిక తీరదు. సంపాదన కోసం ఎన్ని అడ్డదార్లైనా త్రొక్కుతారు. ఏ గడ్డైనా కరుస్తారు. కొందరికి పదవులు సంపాదించాలని కోరిక.

ఇలా ఒక్కొక్కరికి ఒక్కొక్క రకమైన కోరిక ఉంటుంది. ఆ కోరిక అనంతమైనది. కోరిక తీర్చటానికి ప్రయత్నం చేసిన కొద్దీ అది ఇంకా ఇంకా పెరుగుతూనే ఉంటుంది కాని తగ్గదు. అందుకే దీన్ని మహామోహము అంటారు. భగవంతుణ్ణి చేరటానికి ఈ మహామోహము చాలా అడ్డంగా ఉంటుంది. దీన్ని జయించిన వాడే భగవంతుణ్ణి చేరగలుగుతాడు.

శ్రీకృష్ణుడు సాందీపుని దగ్గర విద్యాభ్యాసం చేస్తున్న రోజులో కుచేలుడు కూడా అక్కడే విద్య నభ్యసించాడు. కృష్ణుడు కుచేలుడు చాలా మంచి స్నేహితులైనారు. ఎక్కడికి వెళ్ళినా ఇద్దరూ కలిసి వెళ్ళేవారు. ఏ పని చేసినా ఇద్దరూ కలిసే చసేవారు. విద్యాభ్యాసం పూర్తయింది. వీరిద్దరూ ఎవరిదారిన వారు వెళ్ళిపోయారు. కృష్ణుడు రాజు కాబట్టి సకలైశ్వర్యాలతోను తులతూగుతున్నాడు. కుచేలుడు వివాహం చేసుకున్నాడు. పదిమంది సంతానం. వీరిని పోషించటానికి అతడి వద్ద సరిపోయే ధనం లేదు. అందుచేత ఉపాదానం చేసిన సంసారాన్ని నెట్టుకువస్తున్నాడు. బాల్యమిత్రుడైన కృష్ణుణ్ణి కలిస్తే తన బాధలు తీరతాయి. కాని కృష్ణుడి దగ్గరకు వెళ్ళటానికి మనసు అంగీకరించలేదు. దాంతో కటిక దరిద్రాన్ని అనుభవిస్తున్నాడు.

భగవంతుణ్ణి చేరాలంటే విపరీతమైన భక్తి, ప్రపత్తి ఉండాలి. ఆయన్ను చేరాలనే కోరిక, పట్టుదల ఉండాలి. లేకపోతే సాధ్యంకాదు. శ్రీకృష్ణుడు బాల్యమిత్రుడైనప్పటికీ, అతని దగ్గరకు వెళ్ళలేకపోయాడు. అతణ్ణి చేరలేకపోయాడు కుచేలుడు. భగవంతుణ్ణి చేరటము అంటే సాయుజ్యం పొందటమే. కాబట్టి పరమేశ్వరుణ్ణి చేరాలంటే అహంకార మమకారాలను పూర్తిగా జయించాలి.

ఒకసారి రుక్మిణీదేవి శ్రీకృష్ణుణ్ణి అడుగుతుంది స్వామీ ! కుచేలుడు నీకు ఆప్తమిత్రుడు కదా ? అతడు కడు దారిద్ర్యంతో బాధపడుతున్నాడు. అతణ్ణి కనికరించి నీ దగ్గరకు రప్పించుకోకూడదా?" అని. దానికి శ్రీకృష్ణుడు "రుక్మిణీ ! అతడు జీవితంలో అన్నింటినీ గెలిచాడు. కాని మహామోహాన్ని కూడా గెలవాలి. దాన్ని గెలిస్తేనే గాని నన్ను చేరలేడు. అదిగో మహామోహం వస్తోంది చూడు" అంటాడు.

ఆ సమయంలో భిక్షాటన చేస్తున్నాడు కుచేలుడు. ఆ మార్గం గుండా ఒక పల్లకిని బోయీలు మోసుకు వెడుతున్నారు. అదంతా చాలా అట్టహాసంగా ఉంది. పల్లకిలోని వ్యక్తి ఎవరో అధికారి అయి ఉంటాడు పల్లకి సాగిపోతోంది. జనులు ప్రక్కకి తప్పుకుని పల్లకికి త్రోవనిస్తున్నారు. కుచేలుడు కూడా అలాగే ప్రక్కకు తప్పుకుని

నిలబడ్డాడు. పల్లకి కుచేలుణ్ణి దాటి ముందుకు వెళ్ళింది. కొద్ది దూరం వెళ్ళగానే పల్లకి ఆగిపోయింది. అందులో ఉన్న పెద్దాయన క్రిందికి దిగి గబగబా కుచేలుడి వద్దకు వచ్చి మిత్రమా ! అంటూ పలకరించి ఒక్కసారిగా కౌగలించుకున్నాడు. ఇద్దరి కళ్ళ వెంబడి ఆనంద భాష్పాలు రాలినాయి. 'ఎంత కాలమైంది నిన్ను చూసి' అని ఇద్దరూ పరస్పరం పలకరించుకున్నారు. వారిద్దరూ బాల్యస్నేహితులు. కుచేలుడితో పాటే ఇతడు కూడా సాందీపుడి దగ్గర విద్యాభ్యాసం చేశాడు. ఆ తరువాత అక్కడ ఉన్న రాజు గార్ని ఆశ్రయించాడు. ఆ రాజు కవి పండిత పోషకుడు. దాంతో మంచి ఆదరణ లబించింది. జీవితం ధనధాన్యాలతో భోగభాగ్యాలతో సుఖంగా వెళ్ళిపోతోంది రాజు తలచుకుంటే కానిది ఏముంది? అష్టైశ్వర్యాలు అనుభవిస్తున్నాడు.

కుచేలుడి యొక్క దీనస్థితి చూసి అతడు చాలా బాధపడ్డాడు. 'నాతో పాటు మా రాజుగారి దగ్గరకు రా. ఆయన నిన్ను చాలా బాగా గౌరవిస్తాడు. నువ్వు నీ భార్యా పిల్లలతో సుఖంగా జీవించవచ్చు' అన్నాడు. అతడు చెప్పింది నిజమే. రాజుగారిని ఆశ్రయిస్తే సమస్త సుఖాలు కలుగుతాయి. కాని తనకు కావలసింది అది కాదు. తనకు పరమపదం కావాలి. భగవత్సన్నిధిని చేరాలి. తుచ్ఛమైన, క్షణభంగురమైన లౌకిక సుఖాలు తనకు అవసరం లేదు. అందుకే వెంటనే మిత్రుడు చేసిన ప్రతిపాదనను సున్నితంగా తిరస్కరించాడు కుచేలుడు.

ఇదంతా గమనిస్తూనే ఉన్న శ్రీకృష్ణుడు, రుక్మిణితో ఇప్పుడు అంటాడు 'అదిగో కుచేలుడు మహామోహాన్ని గెలిచాడు. ఇక నా దగ్గరకు చేరతాడు' అని. ఇల్లు చేరిన కుచేలుడితో అతని భార్య 'శ్రీకృష్ణుడు నీకు బాల్యస్నేహితుడు కదా? ఒకసారి అతణ్ణి దర్శిస్తే మన దరిద్రం తీరిపోతుందేమో' అంది. ఆ మరునాడే కుచేలుడు పరమాత్ముడి దగ్గరకు చేరాడు.

పరమపదము అన్నా పరమాత్ముడు అన్నా రెండూ ఒకటే. పరమాత్ముడు ఉండే చోటే పరమపదము. పరమపదంలోనే పరమాత్మ ఉంటాడు. ఆయన్ను చేరటం అంటే అదే సాయుజ్యము, అదే కైవల్యము. అక్కడికి చేరాలి అంటే అరిషడ్వర్గాలు, అహంకార మమకారాలు, రాగద్వేషాలు ఏవీ ఉండరాదు. అన్నింటినీ వదిలెయ్యాలి. తాను మాత్రమే 'కేవలుడు'గా మిగలాలి. అటువంటి వాడు మాత్రమే పరమాత్మని చేరతాడు. పరమపదం చేరటానికి స్త్రీ, పురుష, జాతి, మత, కులభేదాలు ఏవీలేవు. కేవలము నేనే పరమేశ్వరుణ్ణి. **జగత్తులోని జీవులన్నీ పరమేశ్వర స్వరూపమే. అని నమ్మిన వాడికి మాత్రమే పరమపదం లభిస్తుంది.**

# 10. దుష్టసాంగత్యం

లోకంలో అందరికీ ధనం కావాలి. ధనం అవసరం లేనివారు ఎవరూ ఉండరు. అరణ్యాలలో తపస్సు చేసుకునే ఋషీశ్వరులకు, మునీశ్వరులకు కూడా ధనం కావాలి. యజ్ఞయాగాలు నిర్వహించాలంటే ధనం కావాలి. దానధర్మాలు చెయ్యాలి అంటే ధనం కావాలి. ఏ వస్తువు కొనాలన్నా ధనం కావాలి. ఏ పని చెయ్యాలన్నా ధనం కావాలి. అందుకే **ధనమూలమిదంజగత్** అన్నారు. ఈ ధనాన్ని ఎలా సంపాదించాలి? అంటే కేవలము ధర్మమార్గంలోనే ధనార్జన చెయ్యాలి. అధర్మ మార్గంలో సంపాదించినది అశుద్ధంతో సమానం. అంతేకాదు పాపహేతువు కూడా. అధర్మంగా సంపాదించిన ధనం అనేక ఇబ్బందులు, చిక్కులు తెచ్చిపెడుతుంది. మనశ్శాంతి లేకుండా చేస్తుంది.

సంపాదించిన ధనాన్ని ఏం చెయ్యాలనేది ఇంకొక ప్రశ్న. సంపాదించిన దాన్ని నువ్వు తిను. పదిమందికి సహాయపడు. అది నిజమైన తృప్తిని ఆనందాన్ని ఇస్తుంది. మనస్ఫూర్తిగా మనం చేసిన సహాయాన్ని అవతలి వ్యక్తి తప్పకుండా గుర్తుంచుకుంటాడు. చిన్న ఉదాహరణ చూడండి. చాలారోజుల క్రితం ఒకసారి నేను మా ఇంటి వాకిట్లో నుంచుని ఎవరితోనో మాట్లాడుతున్నాను. అటువైపుగా వెడుతున్న ఒక స్త్రీ 55 సం॥ ఉంటాయి. కాలికి ఏదో తగిలి క్రింద పడిపోయింది. నేను వెంటనే వెళ్ళి 'అయ్యో అమ్మా' పడ్డావా' అంటూ ఆమెను లేవదీశాను. కాలికి చిన్నదెబ్బ తగిలింది. నడవలేక పోతోంది. ఆమె ఎవరో కూడా నాకు తెలియదు. నాలుగైదుసార్లు మాత్రం చూశాను. ప్రక్కనే ఆర్.యం.పి. డాక్టరుగారుంటే, ఆయన దగ్గరకు తీసుకువెళ్ళాను. ఏవో మందులు వ్రాసి 'ఇవి వాడండి. నొప్పి తగ్గిపోతుంది' అన్నారు. మందులు కొనటానికి ఆమె దగ్గర డబ్బులున్నట్లు లేవు. ముఖం అదోలా పెట్టింది. నాకు పరిస్థితి అర్థమయింది. జేబులోంచి రూ. 50/- తీసి ఇచ్చి మందులు కొనుక్కో అమ్మా అన్నాను. నమస్కారం చేసి వెళ్ళిపోయింది.

ఇది జరిగి చాలా రోజులయింది. కనిపించినప్పుడల్లా 'నమస్కారం బాబూ' అంటుంది. ఇది మామూలే అనుకున్నాను పెద్దగా పట్టించుకోలేదు. ఇవాళ్ళ ఉదయం నడకకు అని బయల్దేరాను. మా సందు చివరి రిక్షా ఆగి ఉంది. అందులో కూర్చొని ఉంది ఆమె. ఎక్కడికో వెడుతోంది. నన్ను చూసి మళ్ళీ 'నమస్కారం బాబూ' అంది నేను తలవంచుకునే నమస్కారం అన్నాను. మళ్ళీ ఆవిడే. మిమ్మల్ని నేను జీవితాంతం

గుర్తు పెట్టుకుంటాను బాబూ' అంది. నాకు ఆశ్చర్యం వేసి 'ఎందుకమ్మా?' అన్నాను. 'ఆ రోజు నేను పడిపోతే లేవదీసి డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళి, మందులు కొనుక్కోటానికి డబ్బులు కూడా ఇచ్చారు బాబూ. నేను ఎలా మరిచిపోగలను?' అంది. నేను చేసింది చాలా చిన్నపని. అతిచిన్నదైన పని. కాని ఆవిడ ఆ మాట అనేప్పటికి నా మనసంతా అదోలా అయిపోయింది. మనం చేసిన సహాయం చిన్నదే కావచ్చు. కాని దాన్ని అవతలి వారు జీవితాంతం గుర్తు పెట్టుకుంటారు. ఆవిడ ఆ ఆ మాటలు అన్నప్పుడు నాలో కలిగిన అనుభూతి మాటలకు అందేది కాదు.

సంపాదించిన ధనాన్ని విలాసాలకు, జల్సాలకు ఉపయోగించరాదు. ఇది అధర్మం. కష్టపడకుండా అనైతిక మార్గంలో సంపాదించిన వాడే ఆ పని చెయ్యగలుగుతాడు. అలా గడిపేవాడి జీవితం సర్వనాశనం అయిపోతుంది. అతడి పిల్లలు వృద్ధిలోకి రారు. వారుకూడా అధర్మ మార్గంలో జీవించటానికి, అక్రమ సంపాదనకు అలవాటు పడతారు. నీతి నియమాలు తప్పుతారు. సమాజంలో నీతి నియమాలు తప్పి చరించే వారి స్థితి ఇప్పుడు బాగానే కనిపించవచ్చు. కాని భవిష్యత్తు పూర్తిగా అంధకారమవుతుంది. అటువంటి వారి పిల్లలవల్లే తల్లితండ్రులకు ముప్పు కలుగుతుంది. సమాజంలో మనం చూస్తూనే ఉంటాం. ఆస్తి కోసం తల్లితండ్రుల్ని హింసించే వాళ్ళు, వారిని చంపేసే వాళ్ళు కూడా ఉన్నారు. ఇదంతా ఎందుకు జరుగుతుందంటే, దుష్టజన సాంగత్యం వల్ల. తల్లితండ్రులకు నీతి నియమాలుండక పోతే, పిల్లలకు కూడా ఉండవు. దాంతో విలాసవంతమైన, జల్సా జీవితానికి అలవాటు పడతారు. డబ్బుల కోసం హత్యలు, మానభంగాలు కూడా చేస్తారు. చివరకి తల్లితండ్రుల్ని  కూడా హతమారుస్తారు.

కాబట్టి చెడు సహవాసాలు, దుష్టసాంగత్యం అనేది ఏ మాత్రం పనికి రాదు. ఆ దుర్మార్గుడితో నాకు పెద్దగా పరిచయం లేదు. అప్పుడప్పుడు మాట్లాడుతుంటాను. అంతే అనకూడదు. ఎందుకంటే విషాన్ని ఒక క్షణంపాటు నోట్లో వేసుకున్నా ప్రమాదం వాటిల్లుతుంది. ప్రాణాలు పోతాయి. దీనికి ఒక చిన్న ఉదాహరణ చూడండి.

పూర్వకాలంలో చక్రవేణుడు అనే ఒకరాజు ఉండేవాడు. అతడు వేదవేదాంగ విదుడు. పరమ ధర్మాత్ముడు, ప్రజలను కన్నబిడ్డలలాగా పాలించేవాడు. సదాచార సంపన్నుడు, దయామయుడు, మహాజ్ఞాని. కోశాగారంలోని ద్రవ్యాన్ని తన కోసం

వాడుకోవటం నేరము, అధర్మము అని భావించే వ్యక్తి. దినవారీ ఖర్చులకు భార్యతో సహా వెళ్ళి పొలంపనులు చేసి సంపాదించుకునేవాడు. అధికార సమావేశాలలో తప్ప రాజులు ధరించే నగలు కూడా వాడేవాడు కాదు. రాణి గారికి కూడా ఏ రకమైన ఆభరణాలు లేవు. కేవలము సామాన్య స్త్రీలాగా ఉండేది.

ఒకసారి రాజ్యంలో ఒకపెద్ద ఉత్సవం జరిగింది. అప్పుడు ధనికులైన వ్యాపారుల భార్యలందరూ రాణిగారిని సందర్శించారు. ఆమె ఏ రకమైన ఆభరణాలు లేకుండా సాదాసీదాగా ఉండటం చూసి, మీరు కూడా మంచి మంచి ఆభరణాలు ధరిస్తే బాగుంటుంది అన్నారు. ఆ మాటలు రాణిమీద బాగా పనిచేశాయి. తనకు కూడా విలువైన ఆభరణాలు కావాలని రాజుగారిని అడిగింది. బాగా ఆలోచించాడు రాజు. తాను రాజద్రవ్యాన్ని వాడుకోడు. కాని తాను సామ్రాట్టు. కాబట్టి రాజుల నుంచి పన్ను వసూలు చెయ్యచ్చు. అలా చెయ్యటం ధర్మమే. ఇలా ఆలోచించి మంత్రిగారికి కబురు చేసి రాక్షస రాజైన రావణబ్రహ్మ దగ్గరకు వెళ్ళి రెండు మణుగులు బంగారం పన్నుగా చెల్లించమని నా ఆజ్ఞగా తెలిపి, దాన్ని తీసుకురా. అన్నాడు.

మంత్రి రావణి దగ్గరకు వెళ్ళి, తమ రాజుగారి ఆజ్ఞను చెప్పి, పన్ను చెల్లించ మన్నాడు. రావణుడు పరిహాసం చేసి మంత్రిని పంపేసి, జరిగిన విషయమంతా భార్యయైన మండోదరికి వివరించాడు. జరిగిన విషయం వినగానే మండోదరి 'పొరపాటు చేశారు స్వామి! మంత్రిగారికి బంగారం ఇచ్చి పంపాల్సింది' అన్నది. ఎందుకని అని ప్రశ్నించాడు రావణుడు. దీనికి సమాధానం ప్రత్యక్షంగా రేపు చూపుతాను అన్నది మండోదరి.

ఆ మరునాడు ఉదయం మండోదరి యథాప్రకారం పావురాలకి గింజలు వేసింది. అవి తింటున్నాయి. 'రావణుడి మీద ఆన. మీరు గింజలు తినకండి' అన్నది. ఆమాట లెక్క చెయ్యకుండా గింజలు తింటున్నాయి పావురాలు. 'చక్రవేణుడిపై ఆన గింజలు తినకండి' అంది. గింజలు తినటం మానేసి ఎగిరిపోయినాయి పావురాలు. అందులో ఒక చెవిటి పావురం ఉంది. దానికి ఈ మాటలు వినబడక గింజలు తిన్నది. మరుక్షణంలో అది కాస్తా చచ్చి నేలమీద పడింది. 'చక్రవేణుని మీద ఆనను ఉపసంహరిస్తున్నాను. వచ్చి గింజలు తినండి అన్నది మండోదరి. పావురాలు తిరిగి వచ్చి గింజలు తిన్నాయి. ఇదంతా చూసిన రావణుడు అహంకారంతో గేలి చేశాడు.

చక్వవేణుని మంత్రి సముద్రతీరానికి వచ్చి ఇసుకతో లంకానగరం నమూనా తయారుచేశాడు. ఇప్పుడు రావణుడి దగ్గరకు వెళ్ళి 'నీకు ఒక వినోదం చూపిస్తాను రా! అని తీసుకువచ్చి 'చక్వవేణ మహారాజుపై ఆన' అంటూ లంకా నగర నమూనాలో తూర్పు వైపున ఉన్న బురుజులు ప్రాకారాలు పడగొట్టేశాడు. లంకా నగరంలోని తూర్పువైపు కట్టడాలన్నీ మరుక్షణంలో కూలిపోయినాయి. హతాశుడయ్యాడు రావణుడు. ఇంతలో 'చక్వవేణ మహారాజు మీద ఆన' అంటూ పడమర వైపు కట్టడాలను పడగొట్టాడు. లంకా నగరంలోని పడమటి వైపు కట్టడాలు కూలిపోయాయి. దాంతో భయపడిపోయిన రావణుడు చక్వవేణుడు అడిగిన బంగారం ఇచ్చి అతడి మంత్రిని పంపేశాడు.

బంగారాన్ని చక్వవేణుడికిచ్చి జరిగిన సంగతంతా వివరించాడు మంత్రి. ఆశ్చర్యపోయింది రాణి. పవిత్రమైన జీవనం యొక్క మహిమ ఆమెకు అర్థమయింది. మంత్రిగారు తెచ్చిన బంగారం తనకు వద్దన్నది. దాంతో చక్వవేణుడు ఆ బంగారాన్ని తిరిగి రావణుడికి పంపేశాడు.

చక్వవేణ మహారాజు ధర్మబద్ధంగా పవిత్రమైన జీవనం సాగిస్తున్నాడు. కాని కేవలము లౌకికంగా ఆలోచించే ధనిక స్త్రీల సాంగత్యం అదికూడా కొద్ది కాలం. దీనివల్లనే రాణి యొక్క మనసు కలుషితమై పోయింది. జీవితంలో ఎప్పుడూ దుష్టసాంగత్యం పనికి రాదు. అది తక్కువ కాలమైనా సరే. ఉల్లిపాయ తినేటప్పుడు **పాయతిన్నాకంపే గడ్డతిన్నా కంపే.** కాబట్టి **ఎల్లవేళలా దుష్టులకు, దుర్మార్గానికి దూరంగా ఉంటూ, నీతి నియమాలతో ధర్మబద్ధంగా జీవించటం చాలా మంచిది.**

## 11. మోక్షం కావాలి

మనం దేవాలయానికి వెళ్ళినప్పుడు, ఆలయంలో బయట ఉన్న కోనేరు లేదా పంపు దగ్గర కాళ్ళు కడుక్కుని, గుడిచుట్టూ ప్రదక్షిణ చేసి, ధ్వజస్తంభానికి నమస్కారం చేసి, ఆ తరువాత ఆలయంలో ప్రవేశించి ప్రధాన ద్వారానికి నమస్కరించి, అక్కడ ఉన్న గుమ్మాన్ని తొక్కకుండా దానికి కూడా నమస్కరించి నందీశ్వరుడి తోక నిమిరి, నందికొమ్ముల మధ్య నుంచి గర్భాలయంలో ఉన్న స్వామిని దర్శించాలి. ఆ తరువాత స్వామివారిని కళ్ళు మూసుకుని చిత్తశుద్ధితో లోకమంతా సుభిక్షంగా ఉండాలి. నాతోపాటుగా నా చుట్టూ నివశించే వారంతా కూడా సుఖంగా ఉండాలి. అని

ప్రార్థించి అప్పుడు నీకు సంబంధించిన బాధలు, బరువులు స్వామికి విన్నవించి, వాటిని తీర్చమని వేడుకోవాలి. అంతేకాని ఆలయంలోకి వెళ్ళగానే ముందు లోపలికి వెళ్ళిపోయి స్వామికి నమస్కరించరాదు. ముందుగా ఆయన యొక్క ఉపాంగ దేవతలకు, అంగ దేవతలకు నమస్కరించి తరువాతనే స్వామికి నమస్కరించాలి.

స్వామికి నమస్కరించేటప్పుడు కూడా స్వార్థచింతన ఉండకుండా ఉండటం మంచిది. ఒకవేళ ఉన్నా అది తక్కువ స్థాయిలోనే ఉండాలి. స్వామీ ! లోకంలో అందరితోపాటు నేను కూడా బాగుండాలి అని అడగాలి. అందుకే **మాంరక్షంతు, లోకాస్సమస్తా సుఖినోభవన్తు** నన్ను రక్షించు. లోకాలన్నీ చల్లగా ఉండేట్లు చూడు. ఇలాగే ఉండాలి భక్తుని కోరిక, అంతేకాని నేను ఒక్కణ్ణే బాగుండాలి. నా చుట్టుప్రక్కల వాళ్ళంతా మట్టి కొట్టుకుపోవాలి అని ఎప్పుడూ కోరరాదు.

ఇక్కడ ఒక చిన్నవిషయం. అందరికీ తెలిసిందే. అయినా సరే మళ్ళీ గుర్తు చేసుకుంటున్నాం.

పూర్వకాలంలో ఒక తండ్రికి ఇద్దరు కుమారులు. తండ్రి ఆస్థిని ఇద్దరికీ సమానంగా పంచి మరణించాడు. ఇద్దరు కుమారులలోను పెద్దవాడు స్వార్థపరుడు. రెండవవాడు మంచివాడు. ఉన్న దాంట్లోనే దానధర్మాలు చేస్తుంటాడు. దాంతో చుట్టుప్రక్కల వారందరూ రెండవ వాణ్ణి గొప్పగా చెప్పుకుంటున్నారు. అది భరించలేకపోయాడు పెద్దవాడు. భగవంతుణ్ణి గురించి తపస్సు చేశాడు. భగవంతుడు ప్రత్యక్షమయ్యాడు. ఆయనకు పెద్దవాడి సంగతి బాగా తెలుసు. అందుకని భక్తా 'నీకేం కావాలో కోరుకో. అయితే నీకు వచ్చిన దానికన్న నీ తమ్ముడికి రెట్టింపు వస్తుంది' అన్నాడు. బాగా ఆలోచించాడు పెద్దవాడు.

నాకు ఒక కన్ను పోవాలి అన్నాడు. సరే అన్నాడు భగవంతుడు. అతడికి ఒక కన్ను పోయింది. తమ్ముడికి రెండు కళ్ళూ పోయినాయి.

నాకు ఒక కాలు పోవాలి అన్నాడు. తమ్ముడికి రెండు కాళ్ళు పోయినాయి.

నాకు ఒక చెయ్యి పోవాలి అన్నాడు. తమ్ముడికి రెండు చేతులూ పోయినాయి.

దాంతో తమ్ముడు అక్కడ ఉండలేకపోయాడు. అతని పిల్లలు అతణ్ణి తమతో తీసుకువెళ్ళిపోయారు. అన్నగారు ఒంటరివాడై పోయాడు. అసలే అవిటివాడు. అందులో ఒంటరి. మంచి లక్షణాలు లేవు. దిక్కు మొక్కు లేదు. నా అనే వాళ్ళులేరు. అదును చూసి చుట్టుప్రక్కల వాళ్ళు దాడిచేసి ఉన్న సంపద అంతా కొల్లగొట్టేశారు. తినటానికిలేక వీధులపాలయ్యాడు పెద్దవాడు.

కాబట్టి ఎప్పుడూ స్వార్థచింతన పనికి రాదు. అది మనకే హాని చేస్తుంది.

ఈ కారణంచేతనే ఆలయంలో భగవంతుణ్ణి దర్శించినప్పుడు

**అనాయాసేన మరణం వినాదైన్యేన జీవితం ।**

**దేహాంతే తవ సాన్నిధ్యం దేహిమే పరమేశ్వరం ॥**

అని ప్రార్థించాలి. ఈ మాటకు అర్థం ఏమిటో చూడండి.

**అనాయాసేన మరణం**–ఏ నొప్పి, బాధ, కష్టము లేకుండా మరణం ప్రాప్తించాలి. **మాహాత్ముల పాపపుణ్యంబులు మరణకాలంబునన్ దెలియు** అన్నారు. పుణ్యం చేసుకున్న వాడు సుఖంగా మరణిస్తాడు. అదే పాపి మంచాన పడి తీసుకు తీసుకు ఛస్తాడు. 'స్వామీ ! నేను చేసిన మంచి చెడులు నాకు తెలియవు. కాబట్టి నాకు సుఖమరణాన్ని అనుగ్రహించు.

**వినాదైన్యేన జీవితం** – జీవితంలో దుర్భరమైన స్థితి ఏమిటి అంటే దేహి అని ఇంకొకరిని యాచించటం. మనం యాచించినప్పుడు ధర్మప్రభువులు దానం చేస్తారు. కాని వారు లేదంటారు. కొందరు ఛీ కొడతారు. కసురుకుంటారు. చాలా అవమానకరంగా ఉంటుంది. అందుకే ఎవరిమీదా ఆధారపడకుండా ఎవరి ముందు చెయ్యి చాచకుండా, ఎవరినీ ఏదీ అడగకుండా, ఎవరి వద్దా అవమానం పొందకుండా ఉండే జీవితం ప్రసాదించు.

**దేహాంతే తవసాన్నిధ్యం** – అంత్య కాలంలో నీ దర్శనం కావాలి. నీ సాన్నిధ్యం కావాలి. మానవుడు చివరి క్షణాలలో దేన్నైతే ధరిస్తాడో, దేన్నైతే భావన చేస్తాడో, మరుజన్మలో దాన్నే పొందుతాడు. కాబట్టి అంత్య కాలంలో పరమేశ్వర దర్శనం కావాలి అంటే మరుజన్మ అనేది లేకుండా ఉండాలి. నాకు ముక్తిని ప్రసాదించు.

ఓ పరమేశ్వరా! వీటిని నాకు ప్రసాదించవలసింది అని భగవంతుణ్ణి ప్రార్థించాలి.

మానవుడి అంతిమ లక్ష్యం ఏమంటే మోక్షం. చతుర్విధ పురుషార్థాలలో ముఖ్యమైనది, అసలు కావలసినది, పురుషార్థము అని చెప్పబడేది మోక్షం. కాబట్టి ఓ పరమేశ్వరా ! మరణానంతరము నాకు మోక్షాన్ని ప్రసాదించు. ధనధన్యాలు, భోగభాగ్యాలు ఇవన్నీ అశాశ్వతమైనవి. **భార్యా పిల్లలు ఋణానుబంధంతో వచ్చినవారు. ఋణం తీరగానే వీరంతా వెళ్ళిపోతారు.** కడదాకా మనతో ఎవరూ రారు. అందుకే ఓ దేవా ! నాకు మోక్షం ప్రసాదించవలసింది అని ప్రార్థించాలి.

# 12. సాధు స్వభావము

మనుషుల్లో సాధు స్వభావులు, క్రూరస్వభావులు రెండు రకాల వారు ఉంటారు. సాధు స్వభావం గలవారు పదిమందికి తమవల్ల మేలు జరగాలని ఆలోచిస్తుంటారు. అందరికీ చేతనైనంత సహాయం చేస్తుంటారు. దాంతో ప్రజలకు కూడా ప్రేమ, అభిమానము కలుగుతాయి. అలాంటివారిని జనులు అభిమానిస్తారు గౌరవిస్తారు. వారికోసం ఏం చెయ్యటానికైనా వెనకాడరు. అదే క్రూర స్వభావుల యందు అయిష్టత, కోపము ఉంటాయి. వారి క్రూరత్వాన్ని బట్టి వారిని ద్వేషించటం కూడా జరుగుతుంది. ఏదైనా ఒక ప్రమాదం జరిగింద అనుకోండి. అందులో గాయపడ్డది సాధుస్వభావులైతే అక్కడున్న వారు వెంటనే స్పందిస్తారు. రోడ్డుమీద ఒక ప్రమాదం జరిగింది అందులో ఒక ఆవుదూడ గాయపడిందనుకోండి. అక్కడున్న పదిమంది ప్రోగయి దానికి సపర్యలు చేస్తారు. అదే ఒక త్రాచుపాము ప్రమాదవశాత్తు లారీ క్రింద పడింది అనుకోండి. దానికి ఎవరూ సపర్యలు చెయ్యరు. పైగా అది కొన ఊపిరితో ఉంటే, ఇంకో రెడు దెబ్బలు వేసి చచ్చింతరువాత అవతల పారేస్తారు. ఇక్కడ ఒక చిన్న ఉదాహరణ.

ఒక ఆవు అడవిలో గడ్డి మేస్తోంది. ఆ అడవిలో ఒక పులి తిరుగుతోందన్న విషయం ఆవుకు తెలియదు. ఆ పులి అప్పటికే కొన్ని పశువులను చంపేసింది. ఇప్పుడు గడ్డి మేస్తున్న ఆవు పులిని చూసింది. ఆ పులి ఆవును చంపటానికి మీదకి దూకపోతున్నది. ఆవు పరుగెట్టటం మొదలెట్టింది. పులి ఆవును తరుముతోంది. అలా కొంచెం దూరం వెళ్ళేసరికి నీటితో నిండిన చెరువులాంటి ప్రదేశం వచ్చింది. ఆవు అందులోకి దిగేసింది. పులి ఆవును వెంబడిస్తూ, తనుకూడా అందులోకి దిగింది. విచిత్రం ఏమంటే అది అది నీటితో నిండిన చెరువు కాదు. బురదగుంట. బాగా చిక్కగా ఉన్న బురద. ఊబిలాంటిదన్న మాట. భయంతో ఆవు కొంతదూరం లోపలికి వెళ్ళింది. కాని ఇక వెళ్ళలేకపోయింది. బురదలో కూరుకుపోయింది. వెనకాలే వచ్చిన పులి కూడా ఆవుకు నాలుగైదు అడుగుల దూరంలో బురదలో దిగిపోయింది. మొత్తం మీద రెండూ బురదలో చిక్కుకుని కదల్లేని స్థితిలోనే ఉన్నాయి. పులి ఆవు మీద పంజా విసరటానికి ప్రయత్నించింది. కాని సాధ్యం కాలా. అప్పుడు పులి ఆవుని చూసి "ఇప్పుడు నీ ఎముకలు విరిచి కరకరా నమిలెయ్యాలని ఉంది' అన్నది. ఆ మాటలు విన్న ఆవు 'నీకు యజమాని ఎవరైనా ఉన్నారా?' అంది. దాంతో పులికి విపరీతమైన కోపం వచ్చింది. "ఈ అడవికి యజమానిని నేనే.

నాకు యజమాని ఎవరుంటారు?' అంది గర్వంగా. ఆవు నవ్వి. 'ఈ అడవికి నువ్వే రాజువు నిజమే. కాని ఇప్పుడు చూడు. నిన్ను నువ్వే రక్షించుకోలేని పరిస్థితిలో ఉన్నావు కదా?' అంది.

పులి హేళనగా నవ్వి. 'నీ పరిస్థితి అంతే కదా? నువ్వు కూడా బురదలో కూరుకుపోయి ఉన్నావు. తిండి నీరు లేక ఆకలితో మాడి ఛస్తావు' అంది కోపంగా.

'నేను చావను' అంది ఆవు.

ఆశ్చర్యపోయింది పులి. 'ఈ అడవికి రాజైన నేనే బురదలోంచి బయటకు రాలేకపోతున్నాను. నువ్వు సాధుజంతువువు. నిన్నెవరు రక్షిస్తారు' అంది. అప్పుడు ఆవు. "నువ్వు చెప్పింది నిజమే. నేను సాధు జంతువునే. నన్ను నేను రక్షించుకోలేను. నా సాధుత్వమే నన్ను రక్షిస్తుంది. నాకు యజమాని ఉన్నాడు. చీకటి పడేవేళకి నేను ఇంటికి రాకపోతే నన్ను వెతుక్కుంటూ అతడు వస్తాడు. ఈ బురదలో చూస్తాడు. ఎలాగో ఒకలాగా నన్ను బయటకు తీసే ప్రయత్నం చేస్తాడు. అతడివల్ల కాకపోతే మిగిలిన గ్రామస్తుల సాయంతోనైనా నన్ను రక్షిస్తాడు. ఇప్పటిదాకా నాలుగైదు పశువుల్ని చంపేశావు నువ్వు. ఆ విషయం నీ వల్ల నష్టపోయిన రైతులందరికీ తెలుసు. కాబట్టి వారు గనక నిన్ను ఈ స్థితిలో చూస్తే మాత్రం ప్రాణాలతో వదలరు. కాబట్టి తీవ్రమైన ప్రయత్నం చేసి, బురద నుంచి బయటపడి ప్రాణాలు దక్కించుకో" అంది. పులి ఎంత ప్రయత్నించినా బురద నుంచి బయటకు రాలేకపోయింది.

చీకటి పడుతోంది. అడవికి వెళ్ళిన ఆవు ఇంకా తిరిగి రాలేదు. కంగారు పడుతూ ఆవు యజమాని ఆవును వెతుక్కుంటూ అడవిలోకి వెళ్ళాడు. మసకచీకట్లో ఆవుయొక్క పరిస్థితి చూసి, గ్రామంలోని మిగిలిన రైతుల సాయంతో కష్టపడి ఆవుని రక్షించారు. ఊళ్ళో నుంచి వచ్చిన రైతులు, వాళ్ళ చేతుల్లో కర్రలు చూసేసరికి పులి బెదిరిపోయి ఇంకా ముందుకు వెళ్ళి బురదలో పీకలదాకా దిగిపోయింది. పాపం పులిని కూడా రక్షిద్దామని రైతులు ప్రయత్నం చేశారు కాని, వాళ్ళు తనను చంపేస్తారేమో నని భయపడి పులి మరీ లోపలికి వెళ్ళి, పూర్తిగా బురదలో మునిగిపోయి చచ్చిపోయింది.

సాధుజంతువైన ఆవును దాని సాధుత్వమే రక్షించింది. కాగా, క్రూరజంతువైన పులిని దాని క్రూరత్వమే చంపేసింది.

ఆవు సాధుజంతువు. కాబట్టే రైతులంతా అధికశ్రమకు ఓర్చి ఆవును రక్షించారు. లోకంలో క్రూరస్వభావులది, దుర్మార్గులది, దుష్టులది పైచేయిగా కనిపించినప్పటికీ, తాత్కాలికంగా వారిదే విజయం అయినప్పటికీ, అంతిమ విజయం సాధుస్వభావానిదే. సత్వగుణానిదే. అందుచేత **తాత్కాలిక ప్రయోజనాలు ఆశించి చెడ్డపనులు చెయ్యకుండా సాధు స్వభావాన్ని, సత్వగుణాన్ని అలవరచుకుని, పదిమందికి మేలు చేస్తూ మంచి వాడనిపించుకోవటము ఉత్తమము.**

## 13. మంత్ర ప్రభావం

ప్రతిరోజూ తెల్లవారేసరికి భజనలు, భక్తి కీర్తనలు, భక్తి పాటలతో దేవాలయాల్లో మైకులు హోరెత్తించేస్తుంటాయి. ఓం నమశ్శివాయ, ఓం నమో నారాయణాయ, ఇలా ఏదో ఒక దేవత పేరుతో పాటలు, పద్యాలు, భజనలు వినిపిస్తాయి. కొంతమంది వీటిని స్వాగతిస్తే, కొంతమంది ప్రొద్దున్నే నిద్రపోకుండా ఏమిటీ గోల. అని తిట్టుకుంటుంటారు. పుణ్యక్షేత్రాలకు వెళ్ళినప్పుడు అక్కడ ఆ దేవత పేరు మైకులో నిరవధికంగా వినిపిస్తుంటుంది. తిరుపతిలో ఓం నమో వేంకటేశాయ అని, దుర్గగుడిలో దుం దుర్గాయై నమః అని శ్రీశైలంలో ఓం నమశ్శివాయ అని. క్షేత్రాలు కాబట్టి అక్కడ ఇది సహజం. కాని జనావాసాల మధ్య ఉన్న ఆలయాలలో కూడా ఇలాగే ఉండాలా? ప్రతిరోజు నిద్ర పోనీకుండా ఎందుకీ గోల?

ఎక్కడైనా ఇలాగే ఉండాలి. ఏ మతమైనా, ఏ ధర్మమైనా ఉదయం పూట ప్రతివారు తప్పనిసరిగా దైవాన్ని స్మరించాలి. దైవానికి చాలాగొప్పశక్తి ఉంది. చరాచర జగత్తును నడిపించేది దైవమే. ఇక్కడ ఒక చిన్న కథ చూడండి.

పూర్వకాలంలో ఒక యోగి దేశాటన చేస్తున్నాడు. ఎక్కడికి వెళ్ళినా, ఎవరిని చూసినా అందరి నోటా ఒకటే మాట **'ఓం నమశ్శివాయ'** ఏ పని చేస్తున్నా, తింటున్నా, తిరుగుతున్నా, పడుకున్నా అందరికీ ఇదేమాట. ఇదే నామం. ఇదే మంత్రం. అసంకల్పంగా అందరూ ఈ మంత్రాన్నే జపిస్తున్నారు. చూసి చూసి విసుగొచ్చింది యోగికి. ఏమిటీ గోల? ఎప్పుడూ ఒకటే మాట. ఈ మంత్రానికి ఇంత శక్తి ఉన్నదా? చూద్దాం. అనుకుని సరాసరి కైలాసానికి వెళ్ళాడు. ఈశ్వరుడు సభ తీర్చి ఉన్నాడు. ఆయన నమస్కరించి తనకున్న సందేహాన్ని బయట పెట్టాడు యోగి "స్వామీ ! భూలోకంలో ఎవర్ని చూసినా **ఓం నమశ్శివాయ** మంత్రజపాన్నే చేస్తున్నారు. ఎప్పుడు

పడితే అప్పుడు వేళాపాళా లేకుండా, పరిసరాలను గమనించకుండా ఇదే మంత్రాన్ని జపిస్తున్నారు. ఏమిటిదంతా? మంత్రం అంత ప్రభావవంతమైనదా?" అన్నాడు.

ఓం నమశ్శివాయ అన్న శివుడు చిరునవ్వు నవ్వి ప్రక్కకు చూశాడు. ఒక కీటకం పరుగు పెడుతోంది. యోగిని పిలిచి ఆ కీటకం చెవిలో ఓం నమశ్శివాయ అనమన్నాడు. మాట విన్న మరుక్షణమే కీటకం కాస్తా చచ్చిఊరుకుంది, కంగారు పడ్డాడు యోగి. 'ఇదేమిటి స్వామీ? మంత్రం చెవిలో చెప్పగానే కీటకం కాస్తా మరణించింది' అన్నాడు. ఆ విషయాన్ని పట్టించుకోకుండా అక్కడ ఎగురుకున్న ఒక సీతాకోక చిలుకను చూపించి దాని చెవులో ఈ మంత్రం చెప్పమన్నాడు. అది చాలా అందంగా ఉంది. దాని చెవిలో ఈ మంత్రం చెప్పమన్నాడు. అది చాలా అందంగా ఉంది. దాని చెవిలో మంత్రం చెప్పాడు యోగి. మరుక్షణంలో అది కాస్తా చచ్చి నేలమీద పడింది. మళ్ళీ కంగారు పడ్డాడు యోగి. ఇదేమిటి స్వామీ ? అన్నాడు శివుడు పట్టించుకోలా. అక్కడకి ఒక జింకపిల్ల వచ్చింది. చాలా చక్కగా ఛంగ్ ఛంగ్‌న గంతులు వేస్తోంది. దాని చెవులో ఈ మంత్రం చెప్పు అన్నాడు ఈశ్వరుడు. జింక దగ్గరకు వెళ్ళి దాని చెవిలో మంత్రం చెప్పాడు యోగి. వెంటనే జింక కాస్తా చచ్చిపోయింది. యోగి గుండె గుభేల్‌మంది. మంత్రం చెప్పగానే ఇవన్నీ ఒక దానివెనక ఒకటి చచ్చిపోతున్నాయి. కారణం ఏమిటి? అని ఆలోచిస్తున్నాడు.

ఆ సమయంలో నవజాత శిశువు ఆశీస్సుల కోసం వస్తున్నాడు వెళ్ళి అతడి చెవిలో ఈ మంత్రం చెప్పు అన్నాడు శివుడు. "నేను వెళ్ళను మంత్రం చెప్పను. నేను మంత్రం చెప్పిన ప్రతివారు మరుక్షణంలో మరణిస్తున్నారు" అన్నాడు యోగి.

ఫరవాలేదు. ధైర్యంగా వెళ్ళి ఆ పిల్లవాడు చెవిలో ఈ మంత్రం చెప్పు అన్నాడు శివుడు. భయపడుతూ నెమ్మదిగా శిశువు దగ్గరకు వెళ్ళాడు. అతడి చెవిలో మంత్రం చెప్పాడు. మరుక్షణంలో ఆ పిల్లవాడు లేచి కూర్చున్నాడు. అమితాశ్చర్యం పొందాడు యోగి. ఇందాకటి దాకా కీటకము, సీతాకోకచిలుక, జింక మంత్రం చెప్పగానే చచ్చిపోయాయి. ఇప్పుడు ఈ పసివాడు లేచి కూర్చున్నాడు. దీనికి కారణం ఏమిటి? అదే మాట ఈశ్వరుణ్ణి అడిగాడు.

శివుడు చిద్విలాసంగా పసివాడి వైపు చూశాడు. పసివాడు మాట్లాడుతున్నాడు. 'ఓ యోగీశ్వరా ! నేను కీటకంగా ఉన్నప్పుడు నా చెవిలో ఈ మంత్రం చెప్పావు. అప్పుడు నేను కీటకంగా దేహం చాలించి అందమైన సీతాకోకచిలుక నయ్యాను.

సీతాకోకచిలుకగా ఉన్నప్పుడు మళ్ళీ మంత్రం చెప్పావు. ఆ దేహాన్ని ఒదిలి నేను అందమైన జింక నయ్యాను. జింకగా ఉన్నప్పుడు మంత్రం చెప్పావు. అప్పుడు నేను మనిషి నయ్యాను. ఓ యోగీశ్వరా ! ఇప్పుడు నా చెవిలో ఈ మంత్రం చెబితే నేను దివ్యత్వం పొందుతాను అన్నాడు.

మంత్రం యొక్క మాహాత్మ్యము యోగికి పూర్తిగా తెలిసింది. ఈశ్వరుడి పాదాల మీద పడి క్షమాపణలు అడిగాడు.

మంత్ర ప్రభావం చూడండి. ఎప్పుడు ఎలా జపించినా దివ్యత్వాన్ని ప్రసాదిస్తుంది. మంత్రం మిమ్మల్ని బలంగా పట్టుకుని మోక్షం వైపు నడిపిస్తుంది. మంత్రం ఏదైనా ఒకటే. అది శైవం కావచ్చు. శాక్తేయం కావచ్చు. వైష్ణవం కావచ్చు. ఇతర మతాల మంత్రలు కూడా కావచ్చు. **మంత్రాన్ని జపిస్తే దివ్యశక్తులు వస్తాయి.**

## 14. బంధం - అనుబంధం

సామాన్యంగా మనం ఈ రెండు పదాలు కలిపి వాడేస్తుంటాము. ఎక్కువ మంది దృష్టిలో ఈ రెండింటికీ అర్థం ఒకటే కాని బంధం అంటే – ముడి. మన మధ్యన ఉన్న బాంధవ్యం, మన మధ్యన ఉన్న సంబంధం. అనుబంధం అంటే ప్రేమ, అనురాగము, ఆప్యాయతలతో కూడిన కూడిన బంధం.

తండ్రి కొడుకు, అన్నా చెల్లి, అక్కా తమ్ముడు, భార్యా భర్త వీరి మధ్యన ఉన్నది బంధం. అది చుట్టరికము. వాళ్ళిద్దరి మధ్య ఉన్న ప్రేమ, అభిమానం, ఆప్యాయతలను అనుబంధం అంటారు. అనుబంధమనేది చుట్టరికం ఉంటేనే రావాలని ఏమీలేదు. ఇద్దరు స్నేహితుల మధ్య కూడా ఈ అనుబంధం ఉండచ్చు.

ప్రస్తుతము సమాజంలో బంధాలు ఉంటున్నాయి. కాని అనుబంధాలు ఉండటం లేదు. ఉదాహరణకి ఒక తల్లిబిడ్డలే. ఒక కుటుంబ సభ్యులే అవటానికి అన్నదమ్ములు, అక్క చెల్లెళ్ళు చెప్పుకోటానికి వారి మధ్యన చుట్టరికం అనే త్రాడు ఉంది. కాని అది బలంగా లేదు. వారి మధ్య అనుబంధం లేదు. సంవత్సరానికి ఒకసారి కూడా వారు కలవరు. పలకరించుకోరు. మాట్లాడుకోరు. ఒకవేళ ఎప్పుడైనా కలిసినా ఏదో మొక్కుబడిగా మాట్లాడతారే తప్ప వారి మాటల్లోను, చేతల్లోను ఆప్యాయత, అభిమానం కనిపించవు. ప్రస్తుత కాలంలో అనుబంధాలు తగ్గిపోవటానికి కారణాలు అనేకం. ఎవరి జీవితం వారిది. ఎవరి ఉద్యోగం, ఎవరి సంపాదన వారిది. వారి

పనులకే సమయం సరిపోదు. ఇంక మిగిలిన వారిని గురించి ఎక్కడ పట్టించుకుంటారు? దీనికి తోడు తాము గొప్పవారము అనే ఇగో. దీన్నే అహంకారము అంటారు. మీ గొప్పతనాన్ని అహంకారాన్ని ఎక్కడ? ఎవరి దగ్గర చూపిస్తున్నారు? కనిపెంచిన తల్లితండ్రుల దగ్గరా? మీతో పాటుగానే పెరిగిన తోబుట్టువుల దగ్గరా? మీ జీవితాన్ని పంచుకున్న భాగస్వామి దగ్గరా? మనిషికి అహంకారం లేకుండా ఉండటం చాలా మంచిది. ఒకవేళ ఉన్నా దాన్ని 'నా' అనుకున్న వారి దగ్గర ప్రదర్శిస్తే ఎలా? దీంతోనే అనుబంధాలు, ఆప్యాయతలు బాగా తగ్గిపోతున్నాయి. కేవలము పేరుకు మాత్రమే మిగులుతున్నాయి.

ఒకసారి వివేకానందుడి అమెరికాలోని న్యూయార్కు పర్యటనలో ఒక విలేఖరి వచ్చి స్వామీ ! బంధాలు, అనుబంధాలు. ఈ రెండింటినీ కాస్త వివరించి చెబుతారా? అని అడిగాడు. ఆ ప్రాంతంలో ఆ సమయంలో వివేకానందుడు **'మానవ సంబంధాలు'** అనే విషయం మీద ఉపన్యాసాలిస్తున్నాడు. ఈ సందర్భంగా పత్రికావిలేఖరి వివేకానందుణ్ణి ఇంటర్వ్యూ చెయ్యటానికి వచ్చి ఈ ప్రశ్న అడిగాడు. వాళ్ళిద్దరి మధ్యనా సంభాషణ సాగుతోంది.

వివేకానందుడు – మీరు న్యూయార్కులో ఉంటారా? అని అడిగాడు.

అవును అన్నాడు విలేఖరి.

మీ ఇంట్లో ఎంతమంది ఉంటారు? మళ్ళీ అడిగాడు వివేకానందుడు. ఇది అవసరం లేని ప్రశ్న. బంధాలు – అనుబంధాలు వివరించమని అడిగాను. దానికీ, మీరు అడిగిన దానికి సంబంధం ఏమిటి? పైగా అది నాస్వంత విషయం. అవసరం లేని విషయాలు మాట్లాడుతున్నారు. ఈ మాటలు పైకే మాట్లాడాలనుకున్నాడు. కాని లోపలే అనుకున్నాడు. ఇష్టం లేకుండానే సమాధానం చెప్పాడు. అమ్మ చనిపోయింది. నాన్న ఉన్నారు, ముగ్గురు సోదరులు, ఒక సోదరి ఉన్నారు. అందరికీ వివాహం అయిపోయింది. ఎవరి బ్రతుకులు వాళ్ళు బ్రతుకుతున్నారు అన్నాడు.

వివేకానందుడు చిరునవ్వు నవ్వి 'మీ నాన్నగారితో మీరు మాట్లాడుతుంటారా? అని అడిగాడు. విలేఖరి చాలా అసహనంగా చూశాడు. ఆ ప్రశ్న చాలా ఇబ్బందిగా అనిపించింది. మళ్ళీ వివేకానందుడే అడిగాడు. 'నాన్నగారితో మాట్లాడి ఎన్నాళ్ళయింది?' అని. 'నెలరోజులవుతోంది' సమాధానం చెప్పాడు విలేఖరి. మీ అన్నదమ్ముల్ని, సోదరిని కలిపి మాట్లాడుతుంటారా? సమాధానం చెప్పలేదు విలేఖరి.

వాళ్ళతో మాట్లాడి చాలాకాలమయింది అని తెలుస్తోంది. రెండు సంవత్సరాలయింది. అది కూడా క్రిస్మస్ సందర్భంగా కలిశాము' అన్నాడు విలేఖరి.

బాగుంది ఆ సమయంలో అందరూ కలిసి ఎంత కాలం గడిపారు? అడిగాడు వివేకానందుడు.

'మహా అయితే మూడు రోజులు' అన్నాడు విలేఖరి తలదించుకునే.

మీరు మీ తండ్రి గారితో ఎంతసేపు గడిపారు? అడిగాడు వివేకానందుడు.

విలేఖరి నోట్లోంచి మాట రాలేదు. కంగారు కంగారుగా తలవంచుకుని, కాగితం మీద ఏదో వ్రాస్తున్నట్లుగా నటిస్తున్నాడు.

మీరందరూ కలిసి అల్పాహారం తీసుకున్నారా? భోజనాలు చేశారా? నాన్నా! అమ్మ పోయిన తరువాత నువ్వు ఎలా ఉన్నావని అడిగారా? ఒంటరితనం నిన్ను బాధించటం లేదా? అని అడిగారా? ఆ బాధలో నుంచి బయటకు రావటానికి నువ్వు ఏం చేస్తున్నావు? కాలం ఎలా గడుస్తోంది?" అనే విషయాలు మీ నాన్నగారిని అడిగారా? అన్నాడు వివేకానందుడు.

విలేఖరిలో అంతర్మథనం జరుగుతోంది. తాను తప్పు చేస్తున్నాననే భావన కలుగుతోంది. చెప్పలేని బాధ కళ్ళు వెంబడి నీళ్ళ రూపంలో బయటకు వస్తోంది. గమనించాడు వివేకానందుడు. విలేఖరి భుజంమీద చెయ్యి వేసి సముదాయిస్తున్నాడు.

బాధ పడకు. విచారించకు. నాకు తెలియకుండానే నీ మనసును గాయపరిస్తే క్షమించు. మిమ్మల్ని ఇబ్బంది పెట్టటానికి నేను ఈ ప్రశ్నలు వెయ్యలేదు. మీరు అడిగిన ప్రశ్న 'బంధాలు–అనుబంధాలు' వివరించటానికే ఈ ప్రశ్నలు వేశాను. మీ తండ్రిగారితో మీకు బంధం ఉంది. కాని అనుబంధం లేదు. **అనుబంధము అనేది హృదయాల మధ్య ఏర్పడేది.** అనుబంధము అంటే ప్రేమగా, అభిమానంగా, మనస్ఫూర్తిగా కలిసి కూచోవటం, తినటం, త్రాగటం, మాట్లాడటం. మీకు మీ అన్నదమ్ములతోను, సోదరితోను బంధం ఉంది. కాని అనుబంధం లేదు. ఉన్నది కేవలము బంధమే. ఆత్మీయమైన అనుబంధం కాదు అన్నాడు. విలేఖరి మౌనంగా ధన్యవాదాలర్పించి వివేకానందుడి దగ్గర శెలవు తీసుకున్నాడు.

మనుషుల మధ్య బంధం (బాంధవ్యం) ఉన్నదని చెప్పుకోవటం కాదు. ఆత్మీయమైన అనుబంధాన్ని ఏర్పరచుకోవాలి. అంటే ప్రతిరోజు కాకపోయినా

అవకాశం వచ్చినప్పుడల్లా వినియోగించుకోవాలి. **బంధుమిత్రుల్ని, నా అనుకున్న వారిని కలవాలి. వారితో ఆప్యాయంగా మాట్లాడాలి. వారి కష్టసుఖాలు పంచుకోవాలి. కలిసి తినాలి, తిరగాలి. వారితో కలిసి కాలం గడపాలి. ఇవన్నీ మనస్ఫూర్తిగా చేస్తే బంధం బలపడి అనుబంధాలు పెరుగుతాయి.** ప్రేమ పూర్వకమైన వాతావరణం ఏర్పడి సుఖశాంతులకు దారి తీస్తుంది.

## 15. పిత్రుదేవతల ఆహారం కాకి ముట్టుకుంటే వారికి చేరుతుందా?

చనిపోయిన మన పూర్వీకులందరూ పిత్రుదేవతలుగా పిలువబడతారు. ఆబ్దీకం పెట్టేటప్పుడు తండ్రి, తాత, ముత్తాత, వీరు ముగ్గురికీ పిండాలు పెడతారు. అలాగే తల్లి, నాయనమ్మ, ఆవిడ అత్తగారు వీరు ముగ్గురు. వీరు వరుసగా వసురూపం, రుద్రరూపం, ఆదిత్యరూపాలలో అర్చించబడతారు. వంశంలో ఎవరైనా పోతే, వారు వచ్చి ఈ క్రమంలో చేరతారు. పైన ఉన్నవారు పైకి వెళ్ళిపోతారు. ఇలా జరుగుతుంది. అయితే ఎవరైనా మరణించినప్పుడు పదవరోజున పిండ ప్రదానం చేస్తారు. అంటే పిండాలు కలిపి ఆరుబయట పెడతారు. అక్కడ తిరిగే కాకులు వచ్చి ఆ పిండాలు తింటాయి. అలా కాకులు పిండాలను తింటే, ఆ ఆహారము పిత్రుదేవతలకు చేరుతుంది అని మన నమ్మకం. కాకిని పిత్రుదేవతా స్వరూపంగా భావిస్తాము. ఒకవేళ మనం పెట్టిన పిండాలు కాకులు తినకపోతే, చనిపోయిన జీవికి ఏవో తీరని కోరికలున్నాయని, వాటిని తీరుస్తామని నమస్కారం చేస్తే అప్పుడు కాకులు పిండాలు తింటాయి. ఇది అందరికీ తెలిసిన విషయమే.

పిండం పెట్టినప్పుడు కాకులు అక్కడే చెట్ల మీద కూర్చుని ఉంటాయి. కాని తినటానికి రావు. ఒకవేళ వచ్చినా, ఆ పిండం చుట్టూ తిరుగుతాయి. అంతేకాని దాన్ని మాత్రం ముట్టుకోవు. కా కా అని అరుస్తూ లేచి వెళ్ళిపోతాయి. కర్త మనస్ఫూర్తిగా నమస్కారం చేస్తే అప్పుడు వచ్చి తింటాయి. చూట్టానికి ఇదంతా విచిత్రంగా ఉంటుంది. కాని యధార్థ సత్యం. ఇక్కడ మన నమ్మకం ఏమంటే చనిపోయిన వ్యక్తి కాకిరూపంలో వచ్చి ఆహారం తీసుకుంటాడు. అలాగే తద్దినాలు పెట్టేటప్పుడు అన్నము నువ్వులు కలిపి ఒకచిన్న ముద్దు చేసి దాన్ని కాకులకు పెడతాం. దాన్ని వికిరి పిండము అంటారు. ఈ రకంగా మనం పెట్టే పిండాలు కాకులు తింటే అవి పిత్రుదేవతలకు చేరతాయి. కాకి పిత్రుదేవతా స్వరూపము అని

నమ్మకం. ఇక్కడ అనుమానం ఏమంటే ఇది కేవలము నమ్మకమేనా? ఏదైనా ఆధారం ఉన్నదా? ఇది మూఢనమ్మకం కాదు. ప్రామాణికత ఉన్నది. దీనికి సంబంధించి రామాయణంలోని ఉత్తరకాండలో ఒక కథ ఉంది.

రావణబ్రహ్మ తన అన్నగారైన కుబేరుణ్ణి ఓడించి అతని దగ్గర ఉన్న పుష్పక విమానాన్ని లాక్కుని దానిమీద ఎక్కి విహరిస్తూ **'ఉశారబీజము'** అనే దేశాన్ని చేరాడు. ఆ దేశాన్ని మరుత్తు అనే రాజు పాలిస్తున్నాడు. అతడు వేదవేదాంగవిదుడు. అన్ని శాస్త్రాలు చదివిన పండితుడు. ఆయన ఒక యజ్ఞం చేస్తున్నాడు. ఆ యజ్ఞానికి దేవతలు కూడా వచ్చారు. ఈ సమయంలో రావణుడు అక్కడకు వచ్చాడు. అది గమనించిన దేవతలు పశువులుగాను, పక్షులుగాను తమ రూపాలు మార్చుకున్నారు. ఇంద్రుడు నెమలి అయినాడు. యముడు కాకిగా, వరుణుడు హంసగా, కుబేరుడు తొండగా మారిపోయి అక్కడి నుంచి తప్పించుకున్నారు. రావణుడు యజ్ఞశాలలో ప్రవేశించి మరుత్తు దగ్గరకు వెళ్ళి 'రాజా! నేను కుబేరుణ్ణి ఓడించి పుష్పక విమానం తీసుకున్నాను. నువ్వు కూడా నాతో యుద్ధం చెయ్యి' అన్నాడు. మరుత్తు యుద్ధానికి సన్నద్ధమవుతున్నాడు. ఆ యజ్ఞాన్ని బృహస్పతి సోదరుడైన సంవర్తకుడు చేయిస్తున్నాడు. 'ఇది దేవతల ప్రీతికోసం చేస్తున్న యాగము. మధ్యలో లేచి వెళ్ళరాదు' అని చెప్పాడు. దాంతో మరుత్తు రావణుడితో యుద్ధానికి వెళ్ళకుండా ఆగిపోయాడు. మరుత్తు యుద్ధాని రావటానికి భయపడుతున్నాడు అని నిర్ణయించుకుని, అక్కడ ఉన్న ఋషీశ్వరులను కొంతమందిని సంహరించి వెళ్ళిపోయాడు రావణుడు. రావణుడు వెళ్ళిపోయిన తరువాత ఇంద్రాది దేవతలు ఆ రూపాలు వదిలి తమ తమ రూపాలు ధరించారు. అప్పుడు ఇంద్రుడు నెమలికి 'మీకు సర్పజాతి వల్ల భయం ఉండదు, నెమలి పింఛానికి వేయి కనులుంటాయి' అని వరమిచ్చాడు. అప్పటి నుంచి నెమలి పింఛం అందంగా కనిపిస్తోంది. యమధర్మరాజు కాకితో "ఓ వాయసమా ! నీ రూపం ధరించి నేను హాయిగా ఉన్నాను. నీకు ఏ రోగాలు రాకుండా వరమిస్తున్నాను. యమలోకం చేరిన వారందరూ ఆకలి దప్పికలతో అలమటిస్తుంటారు. భూలోకంలో వారి సంతతి ఆహారం ఇచ్చి నిన్ను తృప్తి పరిస్తేనే ఇక్కడ వారి ఆకలి దప్పికలు తీరతాయి." అని కాకికి వరమిచ్చాడు. అప్పటి నుంచి కాకి పిత్రుదేవతలకు ప్రతీకగా మారిపోయింది. ఈ కారణంతోనే 'మనం పెట్టిన పిండాన్ని కాకులు తినాలి' అని జనులు కోరతారు.

తద్దినం నాడు పెట్టే వికిరి పిండానికి, తద్దినం పెట్టబడిన వారికి సంబంధం లేదు. ఆ వంశంలో మరణించిన వారిని ఉద్దేశించి పెట్టబడిందది. వికిరి పిండాన్ని పెట్టేటప్పుడు 'ఆ పిండం తద్దినం పెడుతున్న కర్త కులంలోని అగ్ని దగ్ధులు, అనగ్ని దగ్ధుల్ని మాత్రమే ఉద్దేశించినది' అనే అర్థం వచ్చే మంత్రాన్ని కూడా చెబుతారు? అయితే వికిరిపిండం మన వంశస్తులకే కాదు, మన దగ్గర పనిచేసిన భృత్యులకు కూడా వర్తిస్తుంది అని శాస్త్రకారులు ఈ మంత్రానికి భాష్యం చెబుతున్నారు. కులమతాలతో సంబంధం లేకుండా, సేవకులను కూడా మనతో సమానంగా చూడాలి అని చెప్పింది హైందవ సంప్రదాయం.

ఒకవేళ మనం పెట్టిన పిండాన్ని కాకి ముట్టుకోకపోతే ఏం చెయ్యాలి?

**ఇదం పిండం గృధ్ధ వాయస జలచర ముఖేన ప్రేత భుజ్యతాం**

ఒకవేళ ఈ పిండాన్ని కాకులు తినకపోతే గ్రద్దలకు గాని, జలచరాలకు గాని వేయచ్చు. అంటే పిండాన్ని నీటిలో కలిపెయ్యవచ్చును.

ఒక చిన్న సంఘటన. ఒకాయన మరణించాడు. ఆయన పిల్లలు కర్మకాండ చేస్తూ పిండాలు పెట్టారు. కాకులు వచ్చాయి గాని, చూసి వెళ్ళిపోయినాయి. ముట్టుకోలా. చాలాసేపు చూశారు. నమస్కారాలు చేశారు. కాని ఉపయోగం లేకపోయింది. ఇప్పుడు ఏం చేద్దాం అని పురోహితుణ్ణి అడిగారు. పైన చెప్పిన సూత్రం చెప్పి, ఆ పిండాన్ని నీటిలో కలిపెయ్యండి అన్నారాయన. పిల్లలు ఆ పని చెయ్యబోతున్నారు. ఇంతలో అక్కడ ఉన్న ఒక పెద్దావిడ' అలా చెయ్యటానికి వీలులేదు. కాకులు వచ్చి తినేదాకా ఆగాల్సిందే' అన్నది. అంతా ఆగిపోయారు.

అంటే **మన సంప్రదాయంలో పిండాన్ని కాకి తింటేనే అది పిత్రు దేవతలకు చేరుతుందనే** విషయం ఎంత బలంగా నాటుకుపోయిందో చూడండి.

## 16. విశ్వాసం

చాలామంది అనేక విషయాలు చెబుతుంటారు. కాని వారు చెప్పిన దానిమీద వారికే నమ్మకం ఉండదు. అలాంటప్పుడు ఆ విషయాలు చెప్పి ఉపయోగంలేదు. ఏదైనా ఒక విషయాన్ని గురించి చెప్పేటప్పుడు దాన్ని స్వయంగా ఆచరించి, ఫలితాన్ని అనుభవించి, ఆ తరువాతనే దాన్ని ఆచరించమని మిగిలిన వారికి చెప్పాలి. కేవలం శాస్త్రాలు చదివినంత మాత్రాన సరిపోదు. వాటిమీద విశ్వాసము, భక్తి ఉండాలి.

తన మాటలమీద తనకు నమ్మకం ఉంటేనే ఇతరులకు చెప్పాలి. దీనికి ఒక చిన్న ఉదాహరణ చూడండి.

కొంత కాలం క్రితం ఒక గ్రామంలో గొప్ప పండితుడుండేవాడు. అతడింటికి ప్రతిరోజు ఉదయాన ఒక పాలమనిషి వచ్చి పాలు పోసి వెడుతుండేది. ఒకరోజున ఆ మనిషి చాలా ఆలస్యంగా వచ్చింది. పండితుడికి చాలా కోపం వచ్చింది. ఇంత ఆలస్యం అయింది ఎందుకని? అని పాలమ్మిని అడిగాడు. 'బాబూ! నేను ఉండేది నదికి ఆవలివైపు నేను రావాలంటే నదిని దాటాలి. ప్రతిరోజు తెల్లవారుఝామునే పడవ వాడు వచ్చి నన్ను నది దాటిస్తాడు. కాని ఇవాళ్ళ అతడు వచ్చేసరికి ఆలస్యం అయింది. అందుకని నేను రావటం కూడా ఆలస్యమయింది' అన్నది. ఆ మాటలు విన్న పండితుడు ఏం చెప్పాలో తెలియక" నదిని దాటాలంటే పడవ కావాలా? హరి నామస్మరణ చేస్తూ నదిని దాటెయ్యచ్చు. హరి నామస్మరణతో సంసార సాగరాన్నే దాటగలిగినప్పుడు ఈ నదిని దాటలేమా?" అన్నాడు. పాలమ్మికి పండితుడి పట్ల అత్యంత భక్తి, గౌరవము ఉన్నాయి. ఆమె దృష్టిలో పండితుడు భగవత్స్వరూపుడు. కాబట్టి అతడు చెప్పిన మాటలు శిలాశాసనాలుగా భావించింది.

మరునాడు ఉదయ పాలమ్మి రోజూకన్న ఇంకా బాగా ముందుగానే వచ్చేసింది. పాలమ్మి అంత త్వరగా వచ్చినందుకు ఆశ్చర్యపోయాడు పండితుడు. దాంతో ఇవాళ్ళ ఇంత త్వరగా ఎలా రాగలిగావు? అని అడిగాడు పాలమ్మిని. 'బాబూ ! నిన్నటి రోజున మీరు చెప్పినట్లుగానే పడవ వాడికోసం ఎదురు చూడకుండా హరినామస్మరణ చేస్తూ నదిని దాటేశాను' అంది పాలమ్మి. పండితుడు అమితాశ్చర్యపోయాడు. నోట మాట రాలేదు. కొయ్యబారిపోయాడు. ఆమె చెప్పిన మాటలు నమ్మలేదు. తనేదో మాట వరుసకి చెప్పాడు. అంతేగాని అది ఎలా జరుగుతుంది. పాలమ్మి ఏదో దాస్తోంది. ఆమెను పరీక్షించాలి అనుకున్నాడు. ఆమెతోపాటు నది దగ్గరకు వెళ్ళి పడవ లేకుండా నది దాటి చూపించు అన్నాడు. హరినామస్మరణ చేస్తూ పాలమ్మి నది దాటి వెళ్ళిపోయింది.

పండితుడికి నమ్మకం కుదరలేదు. తనుకూడా నదిలో దిగి నడవటం ప్రారంభించాడు హరినామ స్మరణ చేస్తూ. కాని తన బట్టలు తడిసిపోతాయని భయపడుతున్నాడు. వాటిని సర్దుకుంటున్నాడు. అతని ధ్యాస భగవంతుని మీద కన్న తన బట్టలమీదే ఉన్నది. తన మాటలమీద తనకే నమ్మకం లేదు. అతని

మాటలను విశ్వసించిన పాలమ్మి హరినామస్మరణ చేస్తూ నదిని దాటింది. ఆ మాటలు చెప్పిన పండితుడు మాత్రం హరినామ స్మరణతో నది దాటలేకపోయాడు.

ఇంకొక చిన్న ఉదాహరణ చూడండి. పూర్వకాలంలో ఒక దేవాలయంలో హరిదాసు గారు 'కృష్ణలీలలు' హరికథ చెబుతున్నారు. కథ మంచి రసకందాయంలో ఉంది. భక్తులంతా తన్మయులై వింటున్నారు. దాసుగారు చెబుతున్నారు. "తూర్పు తెల్లవారబోతోంది. వ్రేపల్లెలోని ప్రజలు పాలు తీసుకుని ఆవులను అడవికి వదిలేశారు. ఆవులు గుంపులు గుంపులుగా వస్తున్నాయి. వాటికి రక్షకులుగా ఇద్దరు పిల్లలు వస్తున్నారు. అందులో ఒకడికి 14 సంవత్సరాలు. ఇంకొకడికి 12 సంవత్సరాలు. మొదటివాడు ఎర్రగా ఉంటే, రెండవ వాడు నల్లగా ఉన్నాడు. వారి వంటిమీద అనేకానేకమైన బంగారు ఆభరణాలు. మణిమాణిక్యాలు పొదిగినవి. కళ్ళు మిరుమిట్లు గొలిపే కాంతులు వెదజల్లుతున్నాయి. వారే బలరామకృష్ణులు."

దాసుగారు కథ చెప్పుకుపోతున్నారు. ఆ ఊరిలో ఒక దొంగవాడున్నాడు. వాడు రాత్రి దొంగతనానికి బయల్దేరాడు. ఇంకా బాగా ప్రొద్దుపోలేదు కాబట్టి కాలక్షేపం కోసం అతను కూడా వచ్చి జనంలో చివరగా కూచున్నాడు. దాసుగారు చెప్పే మాటలు అత్యంత శ్రద్ధతో విన్నాడు. అప్పుడు వాడికి అనిపించింది. ఈ రకంగా చిల్లర దొంగతనాలు ఎన్ని చేస్తాం? తెల్లవారుకుండగానే ఆ బాలకులిద్దరూ ఆవులు కాయటానికి వస్తారు కదా? వారిని దోచుకుంటే సరిపోతుంది. ఇక ఎక్కడా దొంగతనం చెయ్యనవసరం లేదు అని.

రాత్రి ప్రొద్దుపోయింది కాబట్టి దాసుగారు కథ అక్కడ ఆపేశారు. జనం అందరూ వెళ్ళిపోయారు. ఈ దొంగవాడు కూడా వారితో బాటు వెళ్ళిపోయి ఇందాక దాసుగారు, ఆ పిల్లలు గోవులు తోలుకుని వస్తారని చెప్పిన ప్రదేశానికి వెళ్ళి, దారి ప్రక్కనే ఉన్న చెట్టు ఎక్కి ఎప్పుడు తెల్లవారుతుందా? అని ఎదురు చూడసాగాడు. రాత్రంతా అక్కడే జాగారం చేశాడు. క్రమేణా రాత్రి గడిచింది. తెల్లవారబోతున్నది. ఇక ఆ పిల్లలు ఇద్దరూ వస్తారు. వారిని దోచుకోవాలి అని ఆత్రుతగా ఎదురు చూస్తున్నాడు. ఇంతలో దూరంగా ఆవుల అరుపులు వినిపించాయి. గోధూళి ఆకాశాన్ని కప్పేస్తోంది. తెల్లవారుతోంది అదిగో బాలకులు ఆవుల్ని తోలుకుని వస్తున్నారు. ఎదురు చూస్తున్నాడు దొంగవాడు. ఆవులు రానే వచ్చాయి. దొంగవాడు కూర్చున్న చెట్టు క్రిందగా వెళ్ళిపోతున్నాయి. దొంగవాడు చాలా జాగ్రత్తగా చూస్తున్నాడు.

ఆవుల వెనకాలే దాసుగారు చెప్పిన బాలకులు ఇద్దరూ వస్తున్నారు. వారిద్దరూ అచ్చు దాసుగారు చెప్పినట్లే ఉన్నారు. ఆ ఇద్దరూ చెట్టు దగ్గరకు రాగానే దొంగవాడు ఒక్కసారిగా చెట్టు మించి దూకేసి వాళ్ళిద్దర్నీ పట్టుకున్నాడు. ఆ ఇద్దరిలోను రెండవ వాడు నల్లగా ఉన్నాడు, వాడు దొంగని అమితంగా ఆకర్షించాడు. వారి శరీరం మీద ఉన్న ఆభరణాలు తళతళా మెరుస్తున్నాయి. దొంగవాడు తన్మయుడై పోయాడు. ఆ రెండవ వాణ్ణి చూస్తూ అలాగే ఉండిపోయాడు. వారిద్దరూ వెళ్ళిపోయారు గోవులతో సహా. ఈలోగా తేరుకున్న దొంగకు ఎవరూ కనిపించలేరు, 'సరే రేపు వద్దాం' అనుకుని ఇంటికి వెళ్ళిపోయాడు.

ఆ రోజు రాత్రి మళ్ళీ హరికథకు వెళ్ళాడు దొంగవాడు. నిన్నటిరోజున ఆపిన దగ్గర నుంచి కథ చెబుతున్నాడు దాసుగారు. ఆ బాలకుల వంటిమీద ఉన్న ఆభరణాలను వర్ణిస్తున్నాడు. **కస్తూరీతిలకం లలాటఫలకే, వక్షస్థలే కౌస్తుభం** అంటూ ఆభరణాలను, కృష్ణుడిని వర్ణిస్తున్నాడు దాసుగారు. వెంటనే దొంగవాడు లేచి 'చిన్నవాడి మెడలో ఉన్న పట్టెడ మీరు చెప్పలేదు' అన్నాడు. కథ ఆపేశాడు దాసుగారు. అందరూ దొంగవాడి వైపు చూశారు ఆశ్చర్యంగా? విషయం ఏమిటి. అని అడిగాడు దాసుగారు. అప్పుడు చెప్పాడు దొంగవాడు 'మీరు వారి ఒంటిమీద ఆభరణాలన్నీ చెప్పారు. కాని చిన్నవాడి మెడలో ఉన్న పట్టెడ చెప్పలేదు' అన్నాడు దొంగ.

అతడి మెడలో పట్టెడ ఉందని నీకెలా తెలుసు? నువ్వేమైనా చూశావా? అడిగాడు దాసుగారు కొంచెం హేళనగా. అవును. చూశాను. వారిద్దరూ అచ్చు మీరు చెప్పినట్లుగానే ఉన్నారు. అందులో చిన్నవాణ్ణి చూస్తే చాలా ముచ్చట వేసింది. వారిని దోచుకోవాలని వెళ్ళిన నేను దొంగతనం చెయ్యకుండా అలా చూస్తూ ఉండిపోయాను' అన్నాడు దొంగ తన్మయత్వంతో.

దాసుగారికి కనువిప్పు కలిగింది. 'ఇంత కాలంగా కథలు చెబుతున్నాను. వారి దర్శన భాగ్యం నాకు ఎప్పుడూ కలగలేదు. నువ్వు అదృష్టవంతుడవు. నీ జన్మ ధన్యమైంది' అన్నాడు.

ఇక్కడ చూడండి. విషయాలన్నీ చెప్పిన దాసుగారికి దైవదర్శనం కలగలేదు. వాటిని విని, గ్రుడ్డిగా నమ్మిన దొంగవాడికి దర్శనమైంది.

అందుకే **శాస్త్రాలు చదవటం కాదు. వాటి మీద నమ్మకం, విశ్వాసం, గౌరవం, భక్తి ఉండాలి.**

# 17. ఋణానుబంధం

**ఋణానుబంధరూపేణా పశుపత్ని సుతాదయా**

మనం ఋణం ఉన్నవారు లేదా మనకి ఋణం ఉన్నవారు ఆ బాకీ తీర్చుకోవటం కోసం భార్య, పిల్లలు, పశువులుగా జన్మిస్తారు అనేది సామెత.

జీవితంలో అనుభవించే ప్రతిదీ మనం కష్టపడి సంపాదించుకోవలసిందే. అలా కాకుండా ఇతరులు ఇచ్చినవి గాని, బలవంతంగా ఇతరుల దగ్గర నుంచి లాక్కుని గాని మనం అనుభవిస్తే, అది ఋణం అవుతుంది. అంటే ఆ మేరకు వారికి బాకీపడతామన్న మాట. ఆ బాకీని ఇప్పుడు కాకపోతే తరువాత ఇంకొక జన్మలో నైనా సరే తీర్చాల్సిందే. కొన్నిసార్లు వీధి కుక్కలు మన వాకిట్లోనే పడుకుంటాయి. వాటికి ఎప్పుడూ మనం ఏమీ పెట్టం అయినా సరే. ఏమిటి ఈ వెధవ కుక్కలు? అని వాటిని కొడతాం కూడా. అయినా సరే అవి ఎక్కడికీ పోవు. తాత్కాలికంగా అవతలకి పోయినా మళ్ళీ వచ్చి ఇక్కడే పడుకుంటాయి. ఏ జన్మలో ఋణమో ఇలా మనింటికి కాపలా కాస్తాయి. ఒక్కోసారి మనమే ఓ బొచ్చుకుక్కని తెచ్చి పెంచుకుంటాం. ప్రతిరోజూ దానికి స్నానం చేయిస్తాం. దువ్వెనతో దాని వళ్ళంతా దువ్వుతాం. అన్నం కలిపి గిన్నెలో పెట్టి బ్రతిమిలాడి తినిస్తాం. దాన్ని వళ్ళో కూచోబెట్టుకుని మురిసిపోతాం. మనతోపాటు షికారుకు తీసుకు వెడతాం. మనం బయట నుంచి రాగానే ఆ కుక్క వచ్చి కారెక్కుతుంది. అలా దాన్ని ఒకసారి తిప్పి తీసుకురావాలి. లేకపోతే అలుగుతుంది. పడుకునేందుకు దానికి ప్రత్యేకమైన పరుపు. మనతోపాటుగా అదికూడా సోఫాలోనే కూచుంటుంది. అదంతా దాని భోగం. ఏనాడో దానికి ఋణపడి ఉన్నాం. ఇలా తీర్చుకుంటున్నాం.

పూర్వకాలంలో ఒక పండితుడు ఉండేవాడు. లేక లేక అతనికి ఒక కుమారుడు కలిగాడు. వాడికి మాటలు రావు. కాళ్ళు చేతులు పని చెయ్యవు. కదల్లేడు. మంచం మీద నుంచి లేవలేడు, పిచ్చిచూపులు చూస్తుంటాడు. ఆకలి వేస్తోంది తినాలి అని కూడా తెలియదు. పెడితే తింటాడు. అతణ్ణి చూసి జాలిపడాలో, ఏడవాలో తెలియదు. ఒక్కగానొక్క కొడుకు. ఎందరో వైద్యుల్ని సంప్రదించాడు పండితుడు. తీర్థాలు సేవించాడు. క్షేత్రాలు దర్శించాడు. ఏమీ ఉపయోగం లేదు. మన దరిద్రం మనతోనే ఉంది.

ఇలా ఉండగా ఒకరోజున ఆ ఊరికి ఒక స్వామిజీ వచ్చాడు. ఆయన దైవాంశ సంభూతుడని, త్రికాలజ్ఞాని అని అందరూ చెప్పుకుంటున్నారు. ఆయన దగ్గరకు వెడితే ఏదైనా తరుణోపాయం దొరుకుతుందేమో అని స్వామిజీని దర్శించాడు పండితుడు. ఈయన పాండిత్యానికి చాలా మెచ్చుకున్నాడు స్వామి. ఉచిత రీతిన సత్కారం కూడా చేశాడు. ఇప్పుడు పండితుడు తన కుమారుడి ప్రస్తావన తెచ్చాడు. ఉన్నది ఉన్నట్లుగా చెప్పాడు. అలా చెబుతుంటే ఆయన కళ్ళ వెంబడి అశ్రువులు ధారలు కట్టినాయి. అంతా విన్నాడు. 'స్వామిజీ. ఇప్పుడు చెప్పాడు.

"నాయనా ! పూర్వజన్మలో కూడా నువ్వు గొప్ప పండితుడివి. దూరప్రాంతాల నుంచి కూడా పండితులు నీ కోసం వచ్చేవారు. రాజుగారి ఆ స్థానంలో చర్చలు జరుగుతుండేవి. క్షణం తీరిక లేకుండా తిరుగుతుండే వాడివి. ఊరూ వాడా నీ పేరు మారుమ్రోగి పోయేది. ఏ విషయమైనా సరే నువు చెబితే దానికి తిరుగులేదు.

ఇంట్లో నీ భార్య పిల్లలతో పాటు నీ తండ్రి కూడా ఉన్నాడు. ఆయన పెద్దవాడైనాడు. వయసు పై బడ్డది. మంచంలో పడ్డాడు. కదల్లేడు. మాట్లాడలేడు. అన్నీ మంచంలోనే. ఆయనకు నీతో మాట్లాడాలని ఉండేది. కాని నీకు ఆయనతో మాట్లాడే తీరిక లేదు. ఆయన్ని పలకరించటం కాదుకదా, కనీసం కంటితో చూసే వాడివి కూడా కాదు. పూర్తిగా నిర్లక్ష్యం చేశావు. ఆయన నీ కోసం అలా ఎదురుచూసి, చూసి నిన్నే తలచుకుంటూ ప్రాణాలు వదిలాడు.

ఈ జన్మలో ఆయనే నీకుమారుడిగా, మందబుద్ధితో, అవయవలోపంతో జన్మించాడు. గతజన్మలో నీ తండ్రి ఋణం సరిగా తీర్చుకోక పోవటం వల్లనే ఇప్పుడు నీ కుమారుడి రూపంలో ఉన్న ఆయనకు సేవలు చేస్తున్నావు. ఋణం తీరేదాకా ఇలా చెయ్యాల్సిందే తప్పదు" అన్నాడు.

పని వత్తిడిలో మనవారిని నిర్లక్ష్యం చేసినా, చేయవలసిన పని సక్రమంగా చెయ్యకపోయినా, అయాచితంగా వచ్చినవి వాడుకున్నా, ఇవన్నీ బాకీలే అవుతాయి. వీటిని వడ్డీతో సహా తీర్చాల్సిందే. మనకి బలం ఉన్నదని, కాలం కలిసి వచ్చిందని, అధికారం ఉన్నదని బలహీనుల్ని, అమాయకుల్ని మోసం చేస్తుంటాం. వాళ్ళ ఇళ్ళు, ఆస్తులు కబ్జా చేస్తాం. వారు నిలువ నీడ లేకుండా అలో లక్ష్మణా అని వీధిన పడి ఏడుస్తుంటారు. అయినా సరే. మన మనసు కరగదు. ఇక్కడ ఒక్క మాట గుర్తుంచుకోండి. **చేసుకున్న వారికి చేసుకున్నంత మహాదేవ.** ఎవరు చేసినది వారు

అనుభవించాల్సిందే. ఋణం తీరిపోయిన మరుక్షణంలోనే ఈ బంధాలు సమసిపోతాయి.

పూర్వ కాలంలో ఒక యోగీశ్వరుడు అరణ్యంలో చెట్టు క్రింద కూచుని తపస్సు చేసుకుంటుండే వాడు. అక్కడికి కొంచెం దూరంలో నది ఉంది. ప్రతిరోజు మూడు పూటలా నదికి వెళ్ళి స్నానం చేసి వచ్చేవాడు. ఎండాకాలం వచ్చింది. ఎండలు బాగా మండుతున్నాయి. మిట్టమధ్యాహ్నం అంత దూరం నడిచి నదికి వెళ్ళటం చాలా కష్టంగా ఉంది. కాళ్ళు కాలిపోతున్నాయి.

ఒక రోజున యోగి సమాధిలోంచి లేచి నదికి వెడదామని బయల్దేరేసరికి, ఆశ్రమం వాకిట్లో క్రొత్త చెప్పులజత కనిపించింది. తమ ఎండలో నడిచి వెళ్ళలేక పోతున్నాడు. కాళ్ళు కాలిపోతున్నాయని ఎవరో చెప్పులు తెచ్చి అక్కడ పెట్టి వెళ్ళిపోయారు. ఎండ బాగా ఉంది. ఇంకేమీ ఆలోచించకుండా ఆ చెప్పులు వేసుకుని నదీ స్నానానికి వెళ్ళాడు స్వామి. ప్రతిరోజూ ఆ చెప్పులు అలాగే వాడుకున్నాడు. అవసాన కాలం సమీపించింది. నిజంగా అయితే అతడు మోక్షం పొందవలసిన వాడు. కాని ఇతరులు ఇచ్చిన చెప్పుల వాడుకోవటం వల్ల వారికి బాకీ పడిపోయాడు. ఆ బాకీ తీరితే కాని అతడికి మోక్షం రాదు. మరుజన్మలో ఒక చర్మకారుడి ఇంట్లో జన్మిస్తాడు. ఆ చర్మకారుడే గతంలో స్వామికి చెప్పులు ఇచ్చినవాడు. పిల్లవాడు అద్భుతమైన లక్షణాలతో ఉన్నాడు. ఒక రోజున ఒక పండితుడు పిల్లవాణ్ణి చూసి "ఇతడు చాలా గొప్ప జాతకుడు. అయితే మీకు చాలా తక్కువ ఋణపడి ఉన్నాడు. వాడి చేతినుంచి మీరు ఎప్పుడూ పైసా కూడా తీసుకోవద్దు. ఒకవేళ మీరు ఏమైనా గనక వాడిదగ్గర నుంచి తీసుకుంటే ఆ మరుక్షణంలోనే అతని ఋణం తీరిపోతుంది. అతడు మరణిస్తాడు" అని చెప్పాడు. అప్పటి నుంచి పండితుడి మాటలు పాటిస్తూ పిల్లవాణ్ణి జాగ్రత్తగా పెంచారు తల్లితండ్రులు. పిల్లవాడికి గతజన్మ గుర్తున్నది. కాబట్టి తన ఋణం తీర్చుకోటానికి ప్రయత్నం చేస్తూనే ఉన్నాడు.

రోజులు గడుస్తున్నాయి. పిల్లవాడు పెరిగి పెద్దయ్యాడు, తండ్రి కుమారుణ్ణి రాజుగారి దగ్గరకు తీసుకువెళ్ళి ఏదైనా ఉద్యోగం ఇప్పించండి అని అడిగాడు. రాజుగారు ఆలోచించి రాత్రుళ్ళు గస్తీ తిరిగే ఉద్యోగం ఇచ్చారు అంటే ఘూర్కా చేసే పని అన్నమాట. రాత్రుళ్ళు ఊరిలో గస్తీ తిరుగుతూ ప్రజలు జాగ్రత్తగా ఉండండి అని ఝూము ఝూముకీ వారిని మేల్కొల్పుతూ ఉండాలి. ఉద్యోగంలో చేరాడు

పిల్లవాడు. ఆ రాత్రి గస్తీ తిరుగుతున్నాడు. మొదటి ఝాము పూర్తయింది. ఇప్పుడు ప్రజలను జాగ్రత్తగా ఉండమని హెచ్చరిస్తూ

**మాతానాస్తి పితానాస్తి నాస్తి బంధు సహోదరః**
**అర్థం నాస్తి గృహంనాస్తి తస్మాత్ జాగ్రత జాగ్రతః ॥**

తల్లి లేదు. తండ్రి లేదు. బంధువులు లేరు. ధనం లేదు. ఇల్లు లేదు. ఇవన్నీ మిధ్య. ఓ మానవుడా మేలుకో సావధానుడవై ఉండు.

రెండవ ఝాము పూర్తయింది.

**జన్మదుఃఖ జరాదుఃఖం జాయాదుఃఖం పునః పునః**
**సంసారసాగం దుఃఖం తస్మాత్ జాగ్రత జాగ్రత ॥**

ఈ జన్మ, ముసలితనము, భార్య, సంసారం ఇవన్నీ దుఃఖపూరితాలు. కాబట్టి ఓ మానవుడా ! మేలుకో సావధానంగా ఉండు.

మూడవ ఝాము పూర్తయింది.

**కామశ్చ క్రోధశ్చ లోభశ్చ దేహేతిష్ఠతి తస్కరాః**
**జ్ఞానరత్నాపహారాయ తస్మాత్ జాగ్రత జాగ్రత ॥**

మనలో ఉన్న జ్ఞానాన్ని దొంగిలించటానికి కామక్రోధాది అరిషడ్వర్గాలనే దొంగలు దాగి ఉన్నారు. కాబట్టి ఓ మానవుడా ! మేలుకో సావధానుడవై ఉండు,

నాల్గవ ఝాము పూర్తయింది.

**ఆశయా బధ్యతే జంతుః కర్మణా బహుచింతయా**
**ఆయుక్షీణం నజానాతి తస్మాత్ జాగ్రత జాగ్రత ॥**

మానవులు ఎప్పుడూ ఏదో చెయ్యాలనే ఆలోచిస్తుంటారు. కాని తరిగిపోతున్న ఆయుష్షును గురించి ఆలోచించరు. కాబట్టి ఓ మానవుడా ! మేలుకో సావధానుడై ఉండు.

ఆ రోజు రాజుగారికి నిద్ర పట్టలేదు. అంతఃపురం పైన రాత్రంతా తిరుగుతూనే ఉన్నాడు. గస్తీ తిరిగే కాపలాదారు చెప్పే విషయాలను విన్నాడు. ఇతడు సామాన్యుడు కాదు. అనే విషయం తెలుసుకున్నాడు.

తెల్లవారగానే ఒక వెండి పళ్ళెంలో బంగారు నాణాలు పోసి అతడి ఇంటికి తీసుకువెళ్ళాడు. అతడి తల్లితండ్రుల్ని కలిసి 'రాత్రి మీ కుమారుడు చెప్పిన మాటలన్నీ

విన్నాను. అతడు సామాన్యుడు కాదు. కారణజన్ముడు, ఎంతిచ్చినా, ఏమిచ్చినా అతడి ఋణం తీర్చుకోలేము అంటూ బంగారు నాణాలు గల వెండి పళ్ళాన్ని ఆ పిల్లవాడికి అందించాడు. పిల్లవాడు దాన్ని తల్లికి అందజేశాడు. రాజుగారి సత్కారం అనే ఆనందంలో అన్నీ మరిచిపోయి ఆ కానుకలు స్వీకరించింది తల్లి. యోగి ఋణ విముక్తుడైనాడు. వెంటనే పిల్లవాడు మరణించాడు.

భార్యా, పుత్రులు, బంధువులు, స్నేహితులు, పశువులు, పక్షులు అన్నీ ఋణం వల్ల ఏర్పడినవే. **జీవితంలో బంధాలన్నీ ఋణానుబంధాలే. ఋణం తీరిన మరుక్షణంలో వారు నిష్క్రమిస్తారు. ఎవరూ మిగలరు.**

## 18. గోమాత

హిందువులకు ఆవు పరమ పవిత్రమైనది. అటువంటి గోవు పుట్టుకను ఒకసారి చూద్దాం. శతపథ బ్రాహ్మణంలో గోవు పుట్టుకను గురించి చెప్పటం జరిగింది. ప్రజాపతులలో అగ్రగణ్యుడు దక్షప్రజాపతి అతడు ప్రాణులను సృష్టించిన తరువాత అమృతాన్ని త్రాగి ప్రసన్నమైనాడు. ఆ సమయంలో ఆయన శ్వాస నుంచి సుగంధము వెలువడి లోకమంతా ప్రసరించింది. ఆ శ్వాస నుంచి ఒక గోవు జన్మించింది. సుగంధము నుంచి జన్మించింది కాబట్టి దానికి 'సురభి' అని నామకరణం చేశాడు ప్రజాపతి. ఈ సురభి నుంచి అనేక ఆవులు జన్మించాయి. గో వంశానికి జనని సురభి.

ఋగ్వేదంలో గోవును గురించి చెప్పారు. గోవును గురించి ప్రత్యేకంగా ఒక సూక్తం కూడా ఉంది. ఋగ్వేదం ప్రకారము గోవు రుద్రులకు-తల్లి. వసువులకు-పుత్రిక. ఆదిత్యులకు - సోదరి.

అయితే గోవు పట్టుకను గురించి ఇంకొక రకంగా చెప్పబడింది. దేవదానవులు క్షీరసాగర మథనం చేస్తుండగా సముద్రము నుంచి కపిలవర్ణం గల గోవు బయటకు వచ్చింది సముద్రపు అలల మీద నెమ్మదిగా నడిచి వస్తున్న గోవును చూసి దేవతలు హర్షధ్యానాలు చేశారు. పుష్పవృష్టి కురిపించారు. ఆ గోవే సురభి. ఈ సురభి వల్లనే గోసంతతి వ్యాప్తి చెందింది. సురభి రోమకూపాల నుంచి కొన్నివేల ఆవులు, ఆ బోతులు జన్మించాయి. గోవు పృథివీ రూపం. గోవునందు చతుర్దశ భువనాలు ఉన్నాయని చెబుతోంది వేదం.

క్షీరసాగరమథనం జరిగినప్పుడు ఐదు గోవులు ఆవిర్భవించాయంటోంది భవిష్య పురాణం. అవి 1.నంది 2.సుభద్ర 3.సురభి 4.సుశీల 5.బహుళ. వీటిని కామధేనువులు అంటారు. ఆ గోవులు నలుపు, ఎరుపు, తెలుపు, పింగళవర్ణము, ధూమ్ర వర్ణాలలో ఉన్నాయి అని చెబుతోంది స్కాంద పురాణం. గో అనే శబ్దానికి బాణము, స్వర్గము, వాక్కు, పశువు, దిక్కు, వజ్రాయుధము, నేత్రము, కిరణము, భూమి అంటూ అనేక అర్థాలున్నాయి. గోవు లక్ష్మీ స్వరూపం. భగవానుడు నేనే గోవును అని చెప్పాడు గీతలో. దేవతలందరూ గోవునందే ఉన్నారు అని చెబుతున్నాయి పురాణాలు.

సురభి తీవ్రమైన తపస్సు చేసింది. ఆ తపస్సుకు మెచ్చి బ్రహ్మ సురభికి అమరత్వాన్ని ప్రసాదించాడు. అందుకే గోవు పేరుతో ప్రత్యేకంగా ఒక లోకం ఏర్పడింది. అదే గోలోకం. అక్కడ రాధాకృష్ణులు ఉంటారు.

ఆవు చాలా పవిత్రమైంది. తనను తాకిన వారందరినీ పవిత్రులుగా చేస్తుంది. గోవును తాకినవాడు గోవుకు నమస్కరించిన వాడు సర్వపాపాల నుంచి విముక్తుడౌతాడని పురాణాలు చెబుతున్నాయి.

గోమయంలో – లక్ష్మీదేవి.

గోమూత్రంలో – గంగాదేవి ఉన్నారు. ఈ రెండింటితోను నేల పరిశుభ్రమవుతుంది. సైన్సు ప్రకారం చూస్తే క్రిమికీటకాలు వీటివల్ల నశిస్తాయి. గోమయంతో భస్మము తయారుచేసి వంటికి రాచుకుంటారు. ఇలా భస్మ తయారీ విధానమంతా భస్మజాబాలోపనిషత్తులో చెప్పబడింది. ఆ భస్మమే విభూతి.

ప్రతిరోజు ఆవులకు నీరు పెట్టి మేత వేసిన వాడికి అశ్వమేధ యాగం చేసిన ఫలితం వస్తుంది. గోవు వివిధ రూపాలలో అనేకమంది ఆకలిని తీరుస్తుంది. గోవును వధించిన చోట అరాచకం పెరిగిపోతుంది. ప్రతిరోజు కొంత సమయం గోశాలలో గడిపితే శ్వాసపరమైన అనారోగ్యం తగ్గుతుంది.

తల్లి పాల తరువాత అంత విశేషమైనవి ఆవుపాలు. అందుకే తల్లిలేని పిల్లలకి ఆవుపాలు పడతారు. ఆవుపాలు శరీరానికి వీర్యపుష్టి, దేహపుష్టి కలుగచేస్తాయి. ఆకలి దప్పికలను నివారిస్తాయి.

వాతము, క్షయ, రక్త పైత్యము, వాతపైత్యము మొదలైన రోగాలను నివారిస్తుంది. ఆకలి పెంచుతుంది. ఏదైనా ప్రమాదంలో గాయపడిన వారు ఆవుపాలు త్రాగితే

త్వరగా కోలుకుంటారు. ఆవుపాల వల్ల శరీరంలో ధాతువృద్ధి కలుగుతుంది. బుద్ధి బలం పెరుగుతుంది. ఆవుపాలు ముఖానికి రాచి మర్దన చేస్తే, ముఖం కాంతివంత మవుతుంది. రాత్రి నిద్రపోయేముంది వేడి ఆవుపాలు త్రాగితే మంచి నిద్ర పడుతుంది. ఆవుపాలలో పటికబెల్లం, ఆవునెయ్యి, లక్కపొడి కలిపి త్రాగితే విరిగిన ఎముకలు అతుక్కుంటాయి. ఆవుపాలలో మిరియాల పొడి, పటిక బెల్లం పొడి కలిపి త్రాగితే కఫం తగ్గుతుంది.

ఆవుపాలలో కండచక్కెరపొడి కలిపి త్రాగితే పాండురోగము, క్షయరోగము తగ్గుతాయి. కాచిన ఆవుపాలలో పటిక బెల్లం పొడి కలిపి త్రాగితే ఎక్కిళ్ళు తగ్గుతాయి.

ఆవుపాలలో దూదిని తడిపి, దానిపైన పటికపొడి చల్లి, ఆ దూదిని కళ్ళమీద వేసి కడితే కళ్ళవాపులు, మంటలు తగ్గుతాయి.

ఆవుపాలలో నల్లజీడిగింజల నూనె కలిపి తాగితే గుండె జబ్బు తగ్గుతుంది.

**ఒక్క ఆవుపాలే కాదు. ఆవులోని ప్రతి అణువు వైద్యపరంగా పని చేస్తుంది. ఆవులు ఉన్నచోట అంటురోగాలు రావు. బ్యాక్టీరియా నశిస్తుంది. ఇన్ని రకాలు ఉపయోగాలున్నాయి. కాబట్టే హిందువులకు ఆవు పరమపవిత్రమైనది. అందుకే గోవుని పూజించాలి కాని చంపరాదు.**

## 19. సంతానం

మనకు పుట్టే పిల్లలనే సంతానం అంటారు. వీరు మగ కావచ్చు. ఆడ కావచ్చు. కానీ నీకు ఎవరు కావాలి? అని అడిగితే సామాన్యంగా పుత్ర సంతానమే కావాలి. అనటం జరుగుతుంది. లోకంలో స్త్రీ సంతానం కన్న పుత్ర సంతానం మీదనే మక్కువ ఎక్కువ. దీనికి కారణం పుత్రసంతానం లేని వారికి ఊర్ధ్వలోకాలు లేవు అన్నారు. పూర్వకాలంలో మృకండమహర్షి మిగిలిన ఋషీశ్వరులతో కలిసి బ్రహ్మ లోకానికి వెళ్ళాడు. ఆయనకు సంతానం లేదు. ఆ కారణం చేత ద్వారపాలకులు మృకండమహర్షిని లోపలకు రానివ్వలేదు. దాంతో ఆయన హిమాలయాలకు వెళ్ళి, శివుణ్ణి గురించి ఘోరమైన తపస్సు చేసి, మార్కండేయుణ్ణి కుమారుడుగా పొందాడు. అగస్త్యమహర్షి వివాహం చేసుకోకుండా అడవుల వెంబడి తిరుగుతున్నాడు. ఆ సమయంలో ఒక మఱ్ఱిచెట్టుకు కొంతమంది తలక్రిందులుగా వ్రేలాడుతూ కనిపించారు. వారి దగ్గరకు వెళ్ళి, 'అయ్యా ! మీరెవరు? ఎందుకు ఇలా

వ్రేలాడుతున్నారు?' అని అడిగాడు మహర్షి. దానికి వారు 'మా వంశంలో ఒకడు వివాహం చేసుకోకుండా ఉండిపోయాడు. మేమంతా అతని పిత్రుదేవతలము. అతడు వివాహం చేసుకుని సంతానవంతుడైతేనే మాకు విముక్తి కలుగుతుంది' అన్నారు. ఆ మాటలు విన్న మహర్షికి చాలా బాధ కలిగింది. ఏమైనా సరే వీరిని విముక్తులుగా చెయ్యాలి అనుకుని 'ఓ మహానుభావులారా ! అతడెవరో చెప్పండి నేను పోయి, అతడికి నచ్చచెప్పి, వివాహం చేసుకునేట్లు చేస్తాను' అన్నాడు. దానికి సమాధానంగా పిత్రుదేవతలు "నాయనా ! అతడెవరే కాదు నువ్వే. నువ్వు వివాహం చేసుకుని సంతానవంతుడవైతేనే గాని, మాకు ఈ బాధలు తప్పవు' అన్నారు. అప్పుడు అగస్త్యుడు లోపాముద్రను వివాహం చేసుకున్నాడని పురాణాలు చెబుతున్నాయి. పుత్రులు లేనివారు పున్నామనరకానికి పోతారు. సంతానంలేనివారు ఉత్తమ లోకాలకు వెళ్ళరు అని గట్టిగా చెప్పాయి పురాణాలు, ధర్మశాస్త్రాలు.

సంతాని లేని వారికి ఉత్తమ లోకాలకు పోరు. మోక్షం పొందరు అనే మాట నిజమేనా? అంటే కాదనే చెప్పాలి. ఎందుకంటే వివాహం కూడా చేసుకొని శుకమహర్షి మోక్షం పొందాడు. నూర్గురు మగపిల్లల్ని కన్న ధృతరాష్ట్రుడికి, చివరకు నీళ్ళు వదిలే దిక్కుకూడా లేకుండా పోయింది. మరైతే **అపుత్రశ్చగతిర్నాస్తి** అని ఎందుకన్నారు? అంటే పుత్ర సంతానంవల్ల వంశాభివృద్ధి (ఇంటిపేరు) జరుగుతుంది కాబట్టి. మనవారు ప్రతి విషయాన్ని ఇంకొక దానితో ముడివేసి చెప్పారు.

ఈ రకంగా పుత్రసంతానానికే ప్రాముఖ్యత ఇవ్వబడింది. దీనికి కారణం పుత్రులవల్ల వంశాభివృద్ధి జరగటమే. అయితే స్త్రీ సంతానానికి ప్రాముఖ్యత లేదా? అని అనుమానం వస్తుంది. మన దేశంలోనే కేరళ, అస్సాము వంటి కొన్ని ప్రాంతాలలో స్త్రీలకే ప్రాధాన్యత ఉంది. అక్కడ ఉండేవి మాత్రీయ కుటుంబాలు. మన ప్రాంతాలలో కుటుంబానికి తండ్రి పెద్ద. మనది పురుషాధిక్య ప్రాంతం. అక్కడ కుటుంబానికి తల్లిపెద్ద. ఆ ప్రాంతంలో స్త్రీకి ఆధిక్యత ఉన్నది. వంశాభివృద్ధి కూడా ఆడపిల్లల వల్లనే జరుగుతుంది. మొత్తం మీద సంతానం వల్లనే వంశాభివృద్ధి జరుగుతుంది.

సంతానం రెండు రకాలుగా ఉంటుంది. 1. ధర్మసంతానం 2. కామసంతానం

ధర్మబద్ధంగా నాకు మంచి సంతానం కావాలి అని గనక సంసారం చేస్తే, వారికి కలిగేది ధర్మసంతానం. ఇలాంటి వారు జీవితంలో ధర్మము, నీతి, నియమాలు కలిగి ఉంటారు. ఉన్నత శిఖరాలు కూడా అధిరోహిస్తారు. నాకు తెలిసి ఒక స్కూలు

టీచరు వివాహమైన తరువాత సంతానం పొందటానికి మంచి ముహూర్తం చూసుకుని ఒక పిల్లవాణ్ణి కన్నాడు. వాళ్ళది సామాన్య కుటుంబం. కాని తరువాత కాలంలో కుమారుడు మూడు కంపెనీలకు డైరెక్టరు, ఒక కంపెనీకి మేనేజింగ్ డైరెక్టరు అయ్యాడు. ధర్మంగా జన్మించిన వారు అణకువ, వినయ విధేయతలు కలిగి ఉంటారు. జీవితంలో ఏదైనా సాధిస్తారు. పురాణాలలో కూడా చూడండి. రాక్షస సంహారం చెయ్యటానికి ఒక మంచి కుమారుడు కావాలి అని అదితి కశ్యప ప్రజాపతిని అడిగితే, పాలకవ్రతం చెయ్యమంటాడు ప్రజాపతి. ఆ తరువాత ఆమెకు కలిగిన సంతానమే వామనుడు. దశరథుడు పుత్రకామేష్ఠి చేసిన తరువాత కలిగినవాడు రాముడు.

రెండవది కామసంతానం. తల్లితండ్రులు కేవలము కోరికలు తీర్చుకోవటానికి సంసారం చేసినప్పుడు కలిగే సంతానమే కామసంతానం. ఇటువంటి వారికి జీవితంలో వినయం, విధేయత, క్రమశిక్షణ అనేవి అసలు కనిపించవు. బస్సులమీద రాళ్ళు రువ్వేవాళ్ళు, రైళ్ళు తగలబెట్టే వాళ్ళు, ఉగ్రవాదులు, దొంగలు, దోపిడీదార్లు అంతా ఈ కోవకే చెందుతారు. వీరికి ఏం చెయ్యాలో తెలియదు. కాని ఏదో చెయ్యాలనే తపన మాత్రం ఉంటుంది. అందుకే విధ్వంసకరమైన పనులు చేస్తుంటారు.

మనకు సంతానంగా ఎవరు జన్మిస్తారు? అంటే రెండు రకాల వారున్నారు. 1.గతజన్మలలో మనం ఋణపడిన వారు 2. మనకి ఋణపడిన వారు

**1. మనం ఋణపడిన వారు :** ఎవరి దగ్గరో అప్పు తీసుకున్నాం. వివిధ కారణాల వల్ల వారి అప్పు తీర్చకుండా ఎగ్గొట్టాము. అధికారం ఉన్నది కదా అని ప్రక్కవారి ఆస్థులు కబ్జా చేశాం. బలమున్నది కదా అని ఎదుటి వ్యక్తిని తన్ని, బలవంతంగా ఆస్థులు కాజేశాము. అతడి శ్రమని దోచుకున్నాం. అంతదాకా ఎందుకు దూడకు పాలు వదలకుండా ఆవుదగ్గర పాలన్నీ పితుకి అమ్మేసుకున్నాం. వృద్ధాప్యంలో తల్లితండ్రులను ఈసడించుకున్నాం. వారిని సరిగా చూడలేదు. వీరందరికీ మనం ఋణపడి ఉంటాం. ఆ ఋణం తీర్చుకోవటానికే వీరిని సంతానంగా పొందుతాం.

**2. మనకి ఋణపడిన వారు :** జీవితంలో కొన్ని మంచి పనులు చేస్తాం. పేదపిల్లలకు చదువు చెప్పిస్తాం. వారికి పుస్తకాలు, బట్టలు కొనిపెడతాం. అన్న సత్రాలు కట్టిస్తాం. ఊరిలో తిరిగే ఆవులకు గడ్డి వేస్తాం. కష్టాల్లో ఉన్నవారికి సాయం చేస్తాం. వీరందరూ వివిధ రూపాలలో మనకు ఋణపడి ఉంటారు. ఆ రుణం తీర్చుకోటానికి ఈ జన్మలో పశువులుగా, పక్షులుగా, కుక్కలుగా, సంతానంగా మన ఇంట్లో జన్మిస్తారు.

మనకు సేవచేసి మనఋణం తీర్చుకుంటారు. ఇప్పుడు మనకు సంతానంగా ఎవరెవరు జన్మిస్తారో చూద్దాం.

మనం బాకీ ఉన్నవాళ్ళు ఆ బాకీ వసూలు చేసుకోవటానికి మనకి సంతానంగా జన్మిస్తారు లేదా మనకి బాకీ ఉన్నవాళ్ళు ఆ బాకీ తీర్చటానికి మనకి సంతానంగా జన్మిస్తారు. మొత్తం మీద ఏదో ఒక ఋణానుబంధం ఉన్నవారే మన సంతానంగా జన్మిస్తారు.

**1. ఋణానుబంధం :** గతజన్మలో ఎవరినో మోసం చేసి వారి ధనాన్ని అపహరించి, వారిని నానాహింసలు పెట్టాము. ఈ జన్మలో వారు మనకు సంతానంగా జన్మిస్తారు. పేరు తెలియని రోగంతో బాధ పడుతుంటారు. వారిని చూసి ఏడుస్తూ, వారికి వైద్యం చేయిస్తాం. వాళ్ళని తీసుకుని రకరకాల ప్రదేశాలకి తిరుగుతాం. ఇలా వారి బాకీ పూర్తయ్యేదాకా ఉండి చివరకు వారు నిష్క్రమిస్తారు. కొంతమంది చూడండి పిల్లలు పుట్టగానే వారికి ఏదో ఒక లోపం ఉంటుంది. దానికోసం డాక్టర్ల చుట్టూ తిరుగుతారు. డబ్బును మంచి నీళ్ళలాగా ఖర్చు చేస్తారు. ఇదంతా వారికి మనం ఉన్న బాకీనే. ఆ బాకీ తీరిపోయిన తరువాత వారు మరణిస్తారు. గతజన్మలో తల్లితండ్రులను సరిగా చూడకపోతే, ఆ కోపంతో వారు మన సంతానంగా జన్మిస్తారు. వ్యాధిగ్రస్తులవుతారు. గతంలో చేసిన బాకీ తీరేదాకా మనల్ని బాధ పెడతారు.

**2. శత్రువులు :** గతజన్మలో శత్రువులు. అప్పుడు మనది పై చెయ్యి. దాంతో వారు మనల్ని ఏమీ చెయ్యలేకపోయారు. ఈ జన్మలో మన సంతానంగా జన్మిస్తారు. పుట్టినప్పటి నుంచీ వీరితో ప్రతిదీ ఒక సమస్యే. పెద్దయిన తరువాత ఏదో విషయంలో తల్లితండ్రులతో గొడవ పడుతూనే ఉంటారు. ప్రతిదానికీ తల్లితండ్రులతో కొట్లాడతారు. తల్లితండ్రులను ఏడిపించి వాళ్ళు ఆనందిస్తుంటారు.

**3. తటస్థులు :** గతజన్మలో వీరికి మనతో పెద్దగా సంబంధం లేదు. కాని వారికి బాకీ ఉన్నాం. ఇలాంటివారు మనకు సంతానంగా జన్మిస్తారు. తల్లితండ్రులను పట్టించుకోరు. పెళ్ళి చేసుకుని వెళ్ళిపోతారు. తల్లితండ్రులు బ్రతికి ఉన్నారో లేదో కూడా ఆలోచించరు.

**4. సేవాతత్పరులు :** గతజన్మలో మనం ఎవరికైనా బాగా సేవ, సహాయము చేసి ఉంటే, ఆ ఋణాన్ని తీర్చుకోటానికి ఈ జన్మలో మన సంతానంగా జన్మిస్తారు. ఇలాటివారు తల్లితండ్రులకు బాగా సేవలు చేస్తారు.

ఇదంతా కేవలం సంతానానికే కాదు. మిగిలిన బాంధవ్యాలకు కూడా వర్తిస్తుంది. ఈ విషయాలు దృష్టిలో పెట్టుకుని **ఎప్పుడూ మంచి పనులు చెయ్యటానికే ప్రయత్నించండి. చెడు పనులు చెయ్యకండి ఇతరులకు హాని కలిగించకండి. మనం చేసిన కర్మను మనమే అనుభవించాలి.**

## ౨౦. 'అహం' వదిలితే దేవుడు

ప్రతివారికి వచ్చే అనుమానం ఒకటే. అసలు పరమేశ్వరుడనే వాడున్నాడా? ఉంటే ఎక్కడ ఉన్నాడు? ఎందుకు కనిపించడు? అందరినీ ఇదే ప్రశ్న ఇదే అనుమానం పట్టి పీడిస్తుంటుంది. నేను ఇంత కాలంగా పూజలు, వ్రతాలు, జపతపాలు, హోమాలు, భజనలు అన్నీ చేస్తున్నాను. యోగసాధన చేస్తున్నాను. ప్రాణాయామం చేస్తున్నాను. కఠోరమైన నియమనిష్ఠలు పాటిస్తున్నాను. నిరంతరము భగవంతుణ్ణే స్మరిస్తున్నాను. మరి నాకు ఆ భగవంతుడు ఎప్పుడూ కనిపించలేదు. అందుకే ఈ అనుమానం. అసలు భగవంతుడు ఉన్నాడా? లేకపోతే ఉన్నాడు అని చెబుతున్నారా? నిజంగా ఉంటే ఎందుకు కనిపించడు?

దీనికి సమాధానం చాలా చిన్నది. అందరికీ తెలిసిందే. పరమేశ్వరుడు సర్వాంతర్యామి. **'ఇందు గలడందులేడను సందేహము వలదు' ఎందెందు వెతకి చూచిన అందందేగలడు.** అన్నాడు ప్రహ్లాదుడు. అది నిజం. అనుభవైకవేద్యం. ప్రతిరోజు నువ్వు చేసే పూజలు పునస్కారాలు అందుకుంటూనే ఉన్నాడు. సర్వదా నిన్ను రక్షిస్తూనే ఉన్నాడు. అయితే ఆయన ఎక్కడ ఉన్నాడు? అనే ప్రశ్నకి సమాధానం చూడండి. ఆయన ఎక్కడో లేడు. నీలోనే ఉన్నాడు. నువ్వే పరమేశ్వర స్వరూపానివి. నీకన్న వేరుగా ఎక్కడా లేడు భగవంతుడు. **దేహోదేవాలయ ప్రోక్తో జీవోదేవస్సనాతనః** అంటోంది ఉపనిషత్తు. దేహమే దేవాలయం. అందులో ఉన్న జీవుడే పరమాత్మ. ఆ విషయం నువ్వు గ్రహించలేకపోతున్నావు. అంతే. ఇక్కడ ఒక చిన్న ఉదాహరణ చూడండి.

ఒక గ్రామంలో ఒక ధనికుడున్నాడు. అతడికి లేకలేక ఒక కుమారుడు కలిగాడు. ఒక్కడే కుమారుడు కాబట్టి అల్లారుముద్దుగా పెంచాడు. కాలంతో పాటుగా పిల్లవాడు పెరిగి పెద్దయినాడు. పిల్లవాడితోపాటుగా అతడిలోని దుర్లక్షణాలు కూడా బాగా

పెరిగిపోయినాయి. సకల గుణాభిరాముడయినాడు. లేని అలవాటు లేదు. త్రాగుడు, జూదం, వ్యభిచారం, వీటన్నింటికి డబ్బు తగలేస్తున్నాడు.

కొడుకుని మంచి మార్గంలో పెట్టటానికి విశ్వప్రయత్నం చేశాడు తండ్రి కుదరలేదు. ఇక లాభం లేదు. ఏదో ఒకటి చెయ్యాలని ఆలోచించాడు. కొడుకు దీనస్థితిలో అడుక్కు తినరాదనే తలంపుతో తనకున్న ఆస్థులు చాలావరకు అమ్మి బంగారంగా మార్చి, ఎవరికీ తెలియకుండా ఒక అర్ధరాత్రి ఆ బంగారాన్ని ఒక బిందెలో పెట్టి, నట్టింట్లో పాతిపెట్టి, అనుమానం రాకుండా పైన రాళ్ళు పరిచాడు. మిగిలిన ఆస్థులు ఏవీ కొడుకు అమ్ముకోటానికి వీలులేకుండా కట్టుదిట్టమైన ఏర్పాటు చేశాడు. ఈ విషయం తాను మరణించే ముందు కొడుక్కు చెపుదామనుకున్నాడు. కాని ఒకరోజు రాత్రి గుండెపోటు వచ్చి హటాత్తుగా చనిపోయాడు. తాను దాచిన నిధిరహస్యం కొడుక్కి చెప్పకుండానే పోయాడు. తండ్రికి అంత్యక్రియలు పూర్తి చేశాడు కొడుకు. ఇప్పుడు చేతిలో చిల్లిగవ్వ కూడా లేదు. దాంతో దొరికిన చోటల్లా అప్పు చేశాడు. ఇతనికి బాగా ఆస్థి ఉన్నది ఫరవాలేదనే భరోసాతో అప్పులిచ్చారు. కాని ఆస్థి ఏమీ లేదని తెలిసే సరికి అప్పు తీర్చమని వత్తిడి చెయ్యటం మొదలు పెట్టారు. కొత్తగా అప్పు ఇచ్చేవాళ్ళు లేరు. పాతబాకీలు తీర్చమంటున్నారు. ఏం చెయ్యటానికి పాలుపోవటం లేదు. రోజు గడవటం కష్టమై పోతోంది. చివరకు అందర్నీ యాచించే స్థితికి చేరాడు. తండ్రి ఏ పరిస్థితి అయితే తన కొడుక్కు రాకూడదనుకున్నాడో, ఆ స్థితి వచ్చింది.

ఒకరోజున తన తండ్రికి ప్రాణమిత్రుడు ఒకడు ఇతణ్ణి కలిసి "మీ నాన్న ఆస్థినంతా అమ్మి, బంగారంగా మార్చి మీ ఇంట్లో ఎక్కడో దాచిపెడతానని చెప్పాడు. ఆ విషయం నీకు చెప్పలేదా?" అన్నాడు. చెప్పలేదు అన్నాడు కొడుకు "అయితే మీ ఇంట్లో చాలా జాగ్రత్తగా తవ్వి చూద్దాం. ఒకవేళ ఆ బంగారం బిందె గనక దొరికితే నీ దరిద్రం తీరిపోతుంది. నువ్వు హాయిగా జీవించవచ్చు" అన్నాడు. ఇద్దరూ కలిసి ఇంటికి వచ్చి, నేలంతా జాగ్రత్తగా తవ్విచూశారు. ఇంటి మధ్య భాగంలో బంగారం దాచిన బిందె దొరికింది. దాంతో గతంలో తాను చేసిన అప్పులు తీర్చి సుఖంగా జీవించాడు. దరిద్రుడు కాస్తా మళ్ళీ కోటీశ్వరుడైనాడు.

ఇక్కడ చాలా జాగ్రత్తగా చూడండి. ఇప్పుడు అతడు కోటీశ్వరుడుగా మారలేదు. అప్పుడూ, ఇప్పుడూ, ఎప్పుడూ అతడు కోటీశ్వరుడే. కాకపోతే నిధి విషయం

తెలియనంత వరకు దరిద్రుడుగా జీవించాడు. నిధి విషయం తెలియగానే, దాన్ని తవ్వి తీసుకుని కోటీశ్వరుడైనాడు.

అలాగే మన దగ్గర కూడా ఆత్మ అనే నిధి ఉంది. అది నీలోనే ఉంది. దాన్ని తెలుసుకోలేక, దేహమే నేను అని భావించి, కష్టాలు, దుఃఖాలు అనుభవిస్తున్నాం. ఎప్పుడైతే సద్గురువు లభించి, నీ ఆత్మని గురించి వివరిస్తాడో, అప్పుడు ఆత్మను గురించి తెలుసుకుని ఆత్మగా ఉండిపోతాం. నేనే పరమేశ్వరుణ్ణి అనే విషయం తెలుసుకుంటాం.

కోట్లకొద్దీ నిధి ఉండి కూడా, ఆ విషయం తెలియక కష్టాలు అనుభవించిన కోటీశ్వరుని కుమారుడు లాగా, భగవంతుడనే నిధిని మనలోనే ఉంచుకుని, దాన్ని తెలుసుకోలేక దుఃఖాలు అనుభవిస్తున్నాం. నేనే పరమేశ్వరుణ్ణి అనే విషయం తెలుసుకుంటే బ్రహ్మానందాన్ని అనుభవిస్తాం.

ఇంకొక చిన్న ఉదాహరణ చూడండి. సూఫీ మతస్థులు ఒక కథ చెబుతారు.

ఒక వ్యక్తి భగవంతుడి ఆఫీసుకు వెళ్ళి తలుపు తట్టాడు. లోపల నుంచి 'ఎవరది?' అనే ప్రశ్న వచ్చింది. 'నేనే' అన్నాడు బయటి వ్యక్తి.

'ఏం కావాలి?' మళ్ళీ ప్రశ్న.

'నేను లోపలకి రావాలి' బయట వ్యక్తి సమాధానం.

'భగవంతుని ఆఫీసులో నీకు, నాకు ఇద్దరికి చోటులేదు. ద్వైతానికి ఇక్కడ స్థానం లేదు.' లోపల నుంచి సమాధానం.

బయటి వ్యక్తి కొద్దిసేపు ఆగి మళ్ళీ తలుపుతట్టాడు. లోపల నుంచి మళ్ళీ. అదే ప్రశ్న 'ఎవరది?'

'నీవే' బయటి వ్యక్తి సమాధానం.

నేను నువ్వు అయ్యేప్పటికి తలుపు తెరుచుకుంది. అహంకారం పోతే, నేను అనే అజ్ఞానం నశిస్తే, మిగిలేది అంతా పరమాత్మే.

ఆభరణం తన ఉనికి పూర్తిగా వదులుకుంటేనే బంగారం అవుతుంది. మట్టిపాత్ర తన ఉనికని పూర్తిగా వదులుకుంటేనే మట్టి అవుతుంది. విత్తనం తన ఉనికిని పూర్తిగా వదులుకుంటేనే వృక్షమవుతుంది. అలాగే **మనిషి నేను అనే అహం వదులుకుంటేనే పరమాత్మ అవుతాడు.**

కాబట్టి దేవుడు ఎక్కడ ఉన్నాడు అంటే **అహం వదిలిన వాడే దేవుడు.**

# 21. సద్గురువు

**గుకారో అంధకారశ్చ, రుకారశ్చ తన్ని రోధకః**

నీలో ఉన్న అజ్ఞానము అనే అంధకారాన్ని తొలగించేవాడే గురువు.

స్కాందపురాణంలో పార్వతీదేవి గురువు అంటే ఎవరు? అతనికి ఉండవలసిన లక్షణాలేమిటి? వివరించండి అని పరమేశ్వరుణ్ణి అడుగుతుంది. దానికి సమాధానంగా పరమేశ్వరుడు గురుగీతను వివరిస్తాడు.

**గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః**

**గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురువే నమః**

ఈ శ్లోకం గురుగీతలోది. స్కూల్లో చేరిన దగ్గర నుంచీ పిల్లలకు మనం ఈ శ్లోకాన్ని చెబుతూనే ఉంటాం. కాని దీని అర్థం చాలా తక్కువమందికి మాత్రమే తెలుసు. ఇప్పుడు ఆ శ్లోకానికి అర్థం చూద్దాం. గురువు–బ్రహ్మ. గురువు–విష్ణువు. గురువు–రుద్రుడు. గురువే సాక్షాత్తు పరమేశ్వరుడు. అటువంటి గురువుకు నమస్కరిస్తున్నాను. అని దాని అర్థం. దీన్ని కొంచెం వివరంగా చూద్దాం.

**1. గురుర్బ్రహ్మ :** గురువు బ్రహ్మ ఎలా అవుతాడు? ఇక్కడ బ్రహ్మ అంటే చతుర్ముఖ బ్రహ్మ. అతడు సృష్టికర్త. మరి గురువు దేన్ని సృష్టి చేస్తున్నాడు? అంటే శిష్యుడి మదిలో జ్ఞానబీజాన్ని నాటుతున్నాడు. ఈ విధంగా గురువు సృష్టికర్త అయిన బ్రహ్మ అవుతున్నాడు.

**2. గురుర్విష్ణుః :**గురువు విష్ణువెలా అవుతాడు? విష్ణువు స్థితికారకుడు. లోకాలన్నింటినీ పెంచి పోషించే వాడు. మరి గురువు ఏం చేస్తాడు అంటే శిష్యుడి మదిలో ఉన్న జ్ఞానబీజాన్ని పెంచి పెద్ద చేస్తాడు పోషిస్తాడు. అందుకే ఆయన విష్ణుస్వరూపుడు.

**3. గురుర్దేవో మహేశ్వరః :** ఇక్కడ మహేశ్వరుడు అనే శబ్దానికి త్రిమూర్తులలో చివరి వాడైన రుద్రుడు అని అర్థం. రుద్రుడు లయకారకుడు. మరి గురువు దేన్ని లయం చేస్తాడు అంటే శిష్యుడి మదిలో పేరుకుపోయిన అజ్ఞానాన్ని లయం చేస్తాడు. అందుకే ఆయన రుద్రుడైనాడు.

**4. గురుస్సాక్షాత్ పరబ్రహ్మ :** పరబ్రహ్మ అంటే పరమేశ్వరుడు. మోక్షప్రదాత. దేవతలెంతమందైనా ఉండచ్చు. కాని మోక్షాన్ని ప్రసాదించగలిగిన వాడు పరమేశ్వరుడే.

మరి గురువు పరమేశ్వరుడెలా అయినాడు? అంటే శిష్యుడి మదిలోని అజ్ఞానాన్ని నాశనంచేసి, జ్ఞానాన్నినింపి, తద్వారా మోక్షమార్గం చూపుతాడు. అందుకే గురువు సాక్షాత్తు పరమేశ్వరుడు అంటున్నాం.

లోకంలో గురువు కన్న గొప్పవారెవరూ లేరు. గురువు తలచుకుంటే ఏదైనా చెయ్యగలడు. పరమేశ్వరుడు కోపిస్తే గురువు రక్షిస్తాడు. కాని గురువు కోపిస్తే రక్షించే – వారెవరూ ఉండరు. సాక్షాత్తు పరమేశ్వరుడు కూడా ఏమీ చెయ్యలేడు. కర్ణుడు చూడండి. గురువును మోసం చేసి విలువిద్య నభ్యసించాడు. దానివల్ల జరిగిందేమిటి? గురుకోపానికి, శాపానికి గురి అయ్యాడు. అవసరమైనప్పుడు విద్య అక్కరకు రాలేదు. ప్రాణాలు కోల్పోయాడు.

గురువుకు తెలియనిది లేదు. కొంతమంది అనుకుంటారు. మా గురువుగారికి మంత్రం జపం చెయ్యటం తప్ప ఇంకేమీ తెలియదు అని. అది చాలా తప్పు. గురువు అంటే గురుమండలం. అక్కడ అనేకమంది సిద్ధపురుషులుంటారు. నీ అనుమానాలు వారు తీరుస్తారు. మీరు సరిగా జపం చేస్తే గురుమండలం అంతా ప్రత్యక్షమవుతుంది. నువు చెయ్యవలసిన మంచి పనులు వారు దగ్గరుండి మరీ చేయిస్తారు. ఇది అనుభవైక వేద్యం. గురుమండలాన్ని నేను ప్రత్యక్షంగా చూశాను. నేను ఏమీ చదువుకోలేదు. నాకు ఏమీ తెలియదు. అటువంటి నేను 48 పుస్తకాలు వ్రాశానంటే, రెండు వేల గంటలు పైగా ఉపన్యాసాలు చెప్పానంటే, వీటన్నింటికీ మించి వేదభాష్యము, శ్రీవిద్యాపరంగా బ్రహ్మసూత్ర భాష్యము వ్రాశానంటే ఇదంతా గురువుల మాహాత్మ్యమే కాని వేరు కాదు.రాయితో కూడా రాగాలు పలికించగల సమర్థుడు గురువు.

ఒకసారి ఒక వ్యక్తి నా దగ్గరకు వచ్చి 'పంచదశి మహామంత్రానికి అర్థం చెప్పండి' అన్నాడు. 'మీ గురువుగార్ని అడగచ్చు కదా?' అన్నాను. మా గురువు గారికి ఏమీ తెలియదు. రెండు సంవత్సరాల నుండి ఆయనకు ఊడిగం చేస్తున్నాను. మంత్రానికి ఇంతవరకు అర్థం చెప్పలేదు. అసలు ఆయనకి తెలిస్తే కదా నాకు చెప్పటానికి?' అన్నాడు.

నిజానికి అతడి గురువు చాలా గొప్పవాడు. ఆయనకు చాలామంది శిష్యులు ఉన్నారు. వేదం చదువుకున్నాడు అనేక యాగాలు చేశాడు. పండితుడు అని పేరున్న వాడు. ఇతడికి మంత్రార్థం చెప్పలేదు అంటే అది తెలుసుకునే సమయం ఇతడికి

ఇంకా రాలేదన్న మాట. ఏది ఏమైనా అతడి భావన తప్పు. 'వెళ్ళి మీ గురువుగారినే అడుగు' అని చెప్పి పంపేశాను. ఒక రకంగా ఇది గురుధిక్కారం. గురువును ధిక్కరించిన వాడు నాశనమై పోతాడు. వారికి పుట్టగతులుండవు. గురువు తలచుకుంటే నిన్ను బొందితో కైలాసానికి పంపగలడు. అయితే నీకు సద్గురువు దొరకాలి. మోక్షమార్గాన్ని చూపగలిగేవాడు నీకు లభించాలి. అది నీ పూర్వజన్మల సుకృతం మీద ఆధారపడి ఉంటుంది. సమయం వస్తే శిష్యుణ్ణి వెతుక్కుంటూ గురువే వస్తాడు.

గురువును ఎంచుకునేటప్పుడు, ఆయన్న గురించి బాగా తెలుసుకోవాలి. అప్పుడే ఆయన్న ఆశ్రయించాలి. లోకంలో విషయం తెలియని వారు చాలా మంది వేషధారణతో గొప్ప గురువులుగా చెలామణి అయిపోతున్నారు. అందుకే పూర్తిగా పరీక్షించిన తరువాతే అతణ్ణి గురువుగా స్వీకరించాలి. సద్గురువు నిన్ను రక్షిస్తాడు. ఉద్ధరిస్తాడు.

ఒకసారి రామకృష్ణ పరమహంస శిష్యుడితో కలిసి ఆలయానికి పెడుతున్నాడు త్రోవలో ఒక బురదపాము బోదురు కప్పను పట్టుకుంది. కప్ప అరుస్తోంది. గురుశిష్యు లిద్దరూ దాని ప్రక్కఉంచే వెళ్ళిపోయారు. ఆలయంలో అర్చనపూర్తి చేసుకుని తిరిగి రావటానికి గంట పైగా సమయం పట్టింది రామకృష్ణ పరమహంసకి. తిరిగి వస్తున్నప్పుడు శిష్యుడు రామకృష్ణుణ్ణి గురువుగారి గొప్పతనం ఏమిటి? ఆయన ఎలా ఉండాలి అని అడిగాడు. రామకృష్ణుడు చెబుతున్నాడు.

మనం ఎన్నుకునేటప్పుడే మంచి గురువుని చూసి ఎన్నుకోవాలి. అతడు అరిషడ్వర్గాలను జయించిన వాడై ఉండాలి. శాస్త్రపరిజ్ఞానం అనుభవ పూర్వకంగా కలవాడై ఉండాలి. అప్పుడే అతడు నిన్ను ఉద్ధరించగలడు అని చెబుతూ పాము కప్పను పట్టుకున్న చోటుకు వచ్చారు. ఇంకా ఆ పాము కప్పను పట్టుకునే ఉంది. కప్ప అరుస్తూనే ఉంది. ఇప్పుడు రామకృష్ణుడు ఆ పామును శిష్యుడికి చూపించి సమర్థుడు కాని గురువు ఇలానే ఉంటాడు. ఆ పామును చూడు. దానికి ఉన్న కొద్దిపాటి విషంతో కప్ప చావదు. పోనీ మింగేద్దామంటే కప్ప చాలా పెద్దదిగా ఉంది. మింగటానికి పాము నోరు సరిపోదు. అదే త్రాచు పామైనట్లైతే ఈ పాటికి ఎప్పుడో కప్ప చచ్చిపోయి ఉండేది. అలాగే సమర్థుడైన గురువైతే నీకు మోక్షమార్గం చూపగలుగుతాడు. నిన్ను ఉద్ధరిస్తాడు' అని చెబుతాడు.

కాబట్టి విషయం తెలుసుకోవాలనే తపన మీకున్నట్లైతే **సమర్థుడైన గురువును వెతుక్కోండి అంతేకాని ఆడంబరాలు, ఆహార్యము చూసి మోసపోవద్దు.**

# 22. భగవంతుడికి పక్షపాతం ఉండదు

ప్రతిరోజు మనం చేసే పనినే **'కర్మ'** అంటారు. ఈ పనివల్ల కొంతమందికి చెడు జరగవచ్చు. కొంతమందికి మంచి జరగవచ్చు. ఒక దుర్మార్గుడు ఉన్నాడు. అతడు ఒక దోపిడీ చేసి, అడ్డు వచ్చిన వారిని హత్య చేశాడు. తాను దోచుకున్న సంపదను తనవారందరికీ పంచిపెట్టాడు. దీనివల్ల తన వారందరూ సంతోషించారు. ఆనందించారు. ఆ ధనంతో సుఖపడ్డారు. కాబట్టి ఇది మంచి పనేకదా? అనచ్చు. ఎవరో కొంతమంది ఆనందించినంత మాత్రం చేత అది మంచిపనికాదు. సామాజిక న్యాయం అనేది ఒకటుంటుంది. మనం చేసే పనివల్ల సమాజంలో ఎక్కువమంది లబ్ధి పొందాలి. సమాజం బాగుపడాలి. ధర్మ సంస్థాపన జరగాలి. ఇటువంటి సమయంలో ధర్మాన్ని నిలబెట్టటం కోసం ఒక అధర్మం చేసినా తప్పులేదు అంటోంది శాస్త్రం.

రామాయణంలో వాలికి వరబలం ఉన్నది. అతని ఎదురుగా నుంచుని యుద్ధంచేసి ఎవరూ అతన్ని గెలవలేరు. దీంతో అతణ్ణి చెట్టు చాటునుంచి సంహరించ వలసి వచ్చింది. అలాగే మహాభారతంలో కర్ణుడు చాలా గొప్పవాడు. కాని అధర్మ పక్షాన నుంచున్నాడు. అభిమన్యుణ్ణి చంపటంలో పాలుపంచుకున్నాడు. అందుకే కురుక్షేత్ర సంగ్రామంలో అతడు విరథుడైనా, నిరాయుధుడైనా అతణ్ణి సంహరించక తప్పలేదు. ఇలాంటివి అనేక ఉదాహరణలు. ధర్మాన్ని రక్షించటానికి ఒక్కోసారి అధర్మాన్ని కూడా ఆయుధంగా వాడుకోవలసి వస్తుంది. ఇక్కడ ధర్మము, ధర్మసూక్ష్మము రెండుంటాయి. ధర్మము అనేది చాలామందికి తెలుస్తుంది. కాని ధర్మసూక్ష్మాన్ని తెలుసుకోవటం మాత్రం చాలా కష్టం. వీటిని అనుసరించే మానవుడికి కర్మ ఫలితాన్నిస్తుంటాడు భగవంతుడు. చూసేవాళ్ళకు మంచి వాళ్ళకు, భగవంతుణ్ణి నమ్మిన వాళ్ళకే కష్టాలు వస్తాయి అనిపిస్తుంది. అది నిజంకాదు. పూర్వజన్మలో వారు చేసిన కర్మని పట్టే ఫలితం వస్తుంది.

పూర్వకాలంలో ఒక సామాన్య వ్యక్తి. అతడికి ఆస్తిపాస్తులు ఏవీలేవు. రెక్కాడితేనే కాని డొక్కాడదు. ప్రతిరోజు శరీరశ్రమ (కూలీ, నాలీ) చేస్తేనే పొట్ట నిండుతుంది. ఒకరోజున రోజంతా శ్రమ పడి పనిచేశాడు. బాగా అలిసిపోయాడు. ప్రతిరోజు ఇలాగే ఉంటోంది. పోనీ పని మానేద్దామంటే జీవితం గడిచే మార్గం లేదు. ఏం చెయ్యాలి? జీవితం మీద విసుగొస్తోంది. ఇంటికి బయల్దేరిన అతడికి త్రోవలో

దేవాలయం కనపడింది. లోపలికి వెళ్ళి దేవుడికి నమస్కారం చేశాడు. భగవంతుడు చిద్విలాసంతో నవ్వుతున్నట్లుగా ఉంది. దాంతో పిచ్చికోపం వచ్చింది. తిక్కరేగి పోయింది. వెంటనే భగవంతుణ్ణి చూసి "నీకేం కదలకుండా కూచుని ప్రతిరోజు పూజలందుకుంటున్నావు. నేను చూడు రెక్కాడితే కాని డొక్కాడదు. నేనెంత కష్టపడుతున్నానో నీకు తెలుసా? ఒక్కరోజు నువు నా స్థానంలో ఉండి చూడు. కష్టమంటే ఏమిటో తెలుస్తుంది" అన్నాడు. సరేనన్నాడు భగవంతుడు. అయితే చిన్న అనుమానం వచ్చి 'మరినా పని ఎవరు చేస్తారు?' అన్నాడు 'నేను చేస్తాను. ఒకరోజు అంటే 24 గంటలపాటు మనిద్దరం మన మన స్థానాలు మార్చుకుందాం. ఈ ఒక్కరోజు నువ్వు మనిషిగా నా స్థానంలో ఉండి నా కష్టాలు అనుభవించు. నేను నీ స్థానంలో ఉంది పూజలందుకుంటాను' అన్నాడు మనిషి. సరే నన్నాడు దేవుడు. కాని ఒక చిన్న షరతు పెట్టాడు. ఓ మానవుడా ! నువు నా స్థానంలో కూచుని పూజలందుకుంటున్నప్పుడు ఎవరు వచ్చి ఏం చెప్పినా విని ఊరుకోవాలి. వాళ్ళ ప్రార్థనలకు ఏ మాత్రం చలించకూడదు అన్నాడు. సరేనన్నాడు మానవుడు. దేవుడు మానవుడు ఇద్దరూ తమ తమ స్థానాలు మారిపోయారు. సామాన్య మానవుడు అనూహ్యంగా దేవుడై పోయాడు. అలాగే మహిమాన్వితుడైన భగవంతుడు సామాన్యుడై కష్టాలనుభవిస్తున్నాడు.

తెల్లవారింది. గుళ్ళో దేవుడి స్థానంలో మనిషి ఉన్నాడు. కాసేపటికి ఒక ధనికుడు వచ్చాడు. "స్వామీ! క్రొత్త వ్యాపారం మొదలు పెడుతున్నాను. లాభాలు బాగా వచ్చేటట్టుగా అనుగ్రహించు" అంటూ ముందుకు వంగి దణ్ణం పెట్టాడు. జేబులో ఉన్న పర్సు జారి క్రిందపడి పోయింది. అతడు చూసుకోకుండానే వెళ్ళిపోయాడు ధనవంతుడు. "ఒరేయ్ ! పర్సు పడిపోయింది చూసుకో" పిలుద్దామనుకున్నాడు దేవుడి స్థానంలో ఉన్న సామాన్యుడు. కాని దేవుడు చెప్పిన మాట గుర్తుకు వచ్చి ఆగిపోయాడు.

కాసేపటికి ఒక పేదవాడొచ్చాడు. "స్వామీ ! నా దగ్గర ఒక్క రూపాయి మాత్రమే ఉంది. అది నీకు సమర్పిస్తున్నాను. నన్ను రక్షించు" అంటూ జేబులో ఉన్న ఒక్క రూపాయి స్వామివారి హుండీలో వేసి సాష్టాంగ ప్రణామం చేశాడు. అతడు కళ్ళు తెరిచేసరికి ఎదురుగా పర్సు. దాన్నిండా డబ్బులు. ఆనందంతో స్వామికి నమస్కరించాడు. కరుణించావా తండ్రీ ! అంటూ మళ్ళీ, మళ్ళీ నమస్కరించి ఆ పర్సు తీసుకుని వెళ్ళిపోయాడు.

'ఒరేయ్ ! ఆ పర్సు ఇంకొకడిది. నువ్వు దొంగతనం చేస్తున్నావు' అని అరవాలనిపించింది సామాన్యుడికి. కాని దేవుని మాటలు గుర్తొచ్చి ఆగిపోయాడు.

తరువాత ఇంకొక భక్తుడు వచ్చాడు. అతడు సముద్ర వ్యాపారం చేస్తాడు. మరునాడు ఓద మీద బయల్దేరుతున్నాయి. తనను చల్లగా చూడమని వేడుకోటానికి స్వామి దగ్గరకు వచ్చాడు.

అంతలోనే పర్సు పారేసుకున్న ధనికుడు పోలీసులతో సహా వచ్చి 'నా తరువాత వచ్చింది ఇతడే. కాబట్టి వీడే నా పర్సు దొంగిలించి ఉంటాడు పట్టుకోండి" అన్నాడు. పోలీసులు అతణ్ణి పట్టుకున్నారు.

గుళ్ళో దేవుడి ముందే అన్యాయం జరుగుతోంది. నిర్దోషిని శిక్షిస్తున్నారు. ఉండబట్టలేక పోయాడు దేవుడి రూపంలో ఉన్న సామాన్యుడు.

"ఆగండర్రా ! ఇతడు నిర్దోషి. అసలు దొంగ వేరే ఉన్నాడు. వాడు పర్సు తీసుకువెళ్ళాడు" అనేశాడు దేవుడి రూపంలో ఉన్న సామాన్యుడు.

సాక్షాత్తు దేవుడే సాక్ష్యం చెబుతుంటే ఇంక విచారణ ఎందుకు? అని నావికుణ్ణి వదిలేశారు పోలీసులు పేదవాణ్ణి పట్టుకున్నారు.

సాయంత్రానికి సామాన్యుడు దేవుడితో చేసుకున్న ఒప్పంద కాలం పూర్తయి పోయింది. దేవుడు, సామాన్యుడు తమ అసలు స్థానాల్లోకి వచ్చేశారు. ఇప్పుడు సామాన్యుడు దేవుడితో "చూశావా నేనెంత గొప్ప పని చేశానో? ఒక నిర్దోషికి శిక్ష పడకుండా కాపాడాను" అన్నాడు. "ఏం జరిగినా మాట్లాడద్దని చెప్పాను కదా ! ఎందుకలా చేశావు?" అన్నాడు దేవుడు.

'అదేవిటి? నేను చేసిన పనికి మెచ్చుకుంటావనుకుంటే నువ్విలా మాట్లాడుతున్నావు?' అన్నాడు సామాన్యుడు. అప్పుడు దేవుడు చెప్పాడు.

దనవంతుడు పరమ దుర్మార్గుడు. వాడి డబ్బు కొంత వరకైనా పేదవాడికి దక్కితే. ధనవంతుడికి కొంతైనా పుణ్యం వస్తుందని అలా చేశాను. అదే జరిగితే ఇటు పేదవాడి కష్టాలు తీరేవి. ధనవంతుడికి పుణ్యము వచ్చేది. ఇక నావికుడు రేపు సముద్రం మీద వెళ్ళబోతున్నాడు. దారిలో పెద్ద తుఫాను వచ్చి ఓడలోని వారందరూ చచ్చిపోతారు. వీణ్ణి పోలీసులు పట్టుకెడితే జైల్లో ఉండేవాడు. దాంతో బ్రతికిపోయే వాడు. ఇప్పుడు నువ్వు చేసిన పనివల్ల ధనికుడు దుర్మార్గాలు చేస్తూ ఉంటాడు. నావికుడు మరణిస్తాడు. పేదవాడి ఆకలి తీరలేదు" అన్నాడు.

ఎవరికి ఏది రావాలో, ఎవరిదగ్గర నుంచి ఏది పోవాలో భగవంతుడే నిర్ణయిస్తాడు. ఆ శక్తి ఆయనకే ఉంది. మనం చేసిన కర్మను బట్టే మన కోరికలు తీరటం జరుగుతుంది. కోరికలు తీర్చటంలో భగవంతుడికి ఏ రకమైన పక్షపాతం ఉండదు.

## 23. తస్మైశ్రీ గురవే నమః

**గుకారో అంధకారశ్చ రుకారశ్చ తన్నిరోధకః**

అంధకారాన్ని పోగొట్టేవాడే గురువు. అంధకారము అంటే అజ్ఞానము. మనిషిలో ఉన్న అజ్ఞానాన్ని తొలగించి జ్ఞానజ్యోతులు ప్రకాశింపచేసేవాడే గురువు.

అజ్ఞానమనేది ఏ విషయంలోనైనా కావచ్చు. జీవితంలో ఏ పని ఎలా చెయ్యాలో తెలియకపోవటం ఆ పని గురించి విషయ పరిజ్ఞానం లేకపోవటమే అజ్ఞానం. భగవంతుడి గురించి తెలియక పోవటం అజ్ఞానం. ఆయన మాహాత్మ్యం తెలియక పోవటం అజ్ఞానం. లౌకికమైన జీవనంలో కూరుకుపోవటం అజ్ఞానం. బంధాలు త్రెంచుకోలేకపోవటం అజ్ఞానం. ఈ రకమైన అజ్ఞానాన్ని పోగొట్టేవాడు. లౌకికమైన విషయాలలో విషయ పరిజ్ఞానాన్ని వివరించేవాడు. పారలౌకికంలో భవబంధాలను విడగొట్టేవాడు. సత్యము, నిత్యము, శాశ్వతమైన పరమేశ్వరుణ్ణి గురించి వివరించి, మోక్షమార్గాన్ని చూపేవాడు. అతడే గురువు. అందుకే

**గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।**<br>
**గురు స్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః ॥**

గురువు సృష్టికర్త అయిన బ్రహ్మ స్వరూపుడు. స్థితికారకుడైన విష్ణు స్వరూపుడు. లయకారకుడైన రుద్ర స్వరూపుడు. అంతేకాదు మోక్షాన్ని ప్రసాదించే పరమాత్మ స్వరూపుడు గురువు అంటోంది **గురుగీత.**

గురుగీత స్కాంద పురాణంలోని ఉత్తర ఖండంలో శివపార్వతుల సంవాదంగా చెప్పబడింది. ఇది మొత్తం 275 శ్లోకాలతో ఉంటుంది. ఇందులో నాలుగు అధ్యాయాలుంటాయి. దేశంలో ఉన్న మఠాధిపతులందరూ దరిదాపుగా గురుగీతను ఎవరికి వారు ముద్రించుకున్నారు. వీటిలో ఒక దానికి ఇంకొక దానికి పొంతన ఉండదు. గురుగీతలోని రెండవ అధ్యాయంలోని 22వ శ్లోకం దగ్గర నుంచి 49వ శ్లోకం దాకా **తస్మైశ్రీ గురవే నమః** అనే మకుటంతో 28 శ్లోకాలు ఉంటాయి. ఈ శ్లోకాలలో గురువు యొక్క మాహాత్మ్యాన్ని వివరిస్తాడు ఈశ్వరుడు. మఠాధిపతులందరూ

తప్పనిసరిగా ఈ 28 శ్లోకాలు తీసుకుని మిగిలినవి వారికి నచ్చిన వాటిని ముద్రించుకున్నారు.

రెండవ అధ్యాయంలోని 7వ శ్లోకంలో పార్వతీదేవి **కేనమార్గేణ భోస్వామిన్ దేహి బ్రహ్మమయో భవేత్**

స్వామి ! జీవుడు బ్రహ్మగా మారటానికి ఏ మార్గాన్ని అనుసరించాలో నాకు వివరించండి అని అడుగుతుంది. దానికి సమాధానంగా ఈశ్వరుడు గురుగీతను వివరిస్తాడు. పైన చెప్పిన **గురుర్బ్రహ్మ** అనే. గురుగీతలో 23వ శ్లోకం. చిన్నప్పటి నుంచి పిల్లలందరికీ ఈ శ్లోకం నేర్పిస్తాము కాని దీని పూర్తి అర్థం చాలామందికి తెలియదు. 21వ అధ్యాయంలో దీన్ని వివరించాం.

ఇలా గురువు యొక్క మాహాత్మ్యాన్ని వివరిస్తుంది గురుగీత. అందులోని ప్రతి శ్లోకము ఆణిముత్యమే. ఇప్పుడు గురువును గురించి మన మాటల్లో చెప్పుకుందాం.

గురువంటే సత్యం; గురువంటే నిత్యం, శాంతికి, సహనానికి ప్రతిరూపం. గురువంటే ధర్మం. గురువంటే సద్బోధ. గురువు ఎక్కడఉంటే అక్కడే సమస్త ఐశ్వర్యము ఉంటుంది. ధనధాన్యాలు, సుఖసంతోషాలు, భోగభాగ్యాలు ఇలా అష్టైశ్వర్యాలన్నీ గురువున్న చోటే ఉంటాయి. గురువు అంటే కంటికి కనిపించే దేవుడు. మన మధ్యలోనే తిరుగాడుతాడు. మనల్ని మంచి మార్గంలో నడిపించే మహామనిషి. గురువు పాదాలు పట్టుకుంటే ఈశ్వరుడి పాదాలు పట్టుకున్నట్లే. భగవంతుడు కోపిస్తే గురువు రక్షిస్తాడు. కాని గురువు కోపిస్తే భగవంతుడు కూడా రక్షించలేడు. వేదాలలో మహావాక్యాలు చెప్పబడ్డాయి. మహావాక్యాలు నాలుగు 1.ప్రజ్ఞానం బ్రహ్మ 2.అయమాత్మా బ్రహ్మ 3.అహంబ్రహ్మాస్మి 4.తత్త్వమసి. ఈనాలుగు మహవాక్యాల అర్థం ఒకటే. జీవుడే దేవుడు. నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని నాకు మించినది ఈ జగత్తులో ఇంకేదీ లేదు. ప్రాణమున్నవి ప్రాణం లేనివి, చలనమున్నవి, చలనంలేనివి అన్నీ ఆ పరమేశ్వరుడి ప్రతిరూపాలే. ఆ పరమేశ్వరుడే నేను.

మహావాక్యాలు నాల్గింటిలోను **తత్త్వమసి** అనే దానికి అర్థం తెలుసుకుంటే, మిగిలిన మహావాక్యాల అర్థం తేలికగా తెలుస్తుంది. తత్త్వమసి మహావాక్యం ఛాందోగ్యోపనిషత్తు లోది. ఉద్దాలకు బ్రహ్మవిద్యలో నిష్ణాతుడు. అతని కుమారుడు శ్వేతకేతువు. విద్యాభ్యాసం పూర్తి చేసుకుని ఇంటికి వచ్చాడు. అలా వచ్చిన కుమారుణ్ణి తండ్రి అయిన ఉద్దాలకుడు 'నాయనా శ్వేతకేతూ ! నీకు బ్రహ్మవిద్యను చెప్పారా

మీ గురువుగారు?' అని అడిగాడు. దానికి శ్వేతకేతువు 'బ్రహ్మవిద్యను నాకు మా గురువుగారు చెప్పలేదు. బహుశః ఆయనకు కూడా తెలియకపోయి ఉండచ్చు. తండ్రీ ఇప్పుడు నువ్వే ఆ బ్రహ్మవిద్యను నాకు వివరించవలసింది' అన్నాడు. ఉద్దాలకుడు చెప్పటం మొదలుపెట్టాడు.

శ్వేతకేతూ ! ఆకాశంలో సూర్యుడు లోకాలకు వెలుగులు నింపుతున్నాడు. అతడిలో ఏ తత్త్వమైతే ఉన్నదో అదే నీలోను ఉన్నది. ఆకాశంలో చంద్రుడు చల్లదనాన్ని ఇస్తున్నాడు. అతడిలో ఏ తత్త్వమున్నదో అదే నీలోను ఉన్నది. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, గ్రహాలు, నదులు, సముద్రాలు, పంచభూతాలు, తన్మాత్రలు, అడవులు, కొండలు, బండలు ఇలా జగత్తులో ఉన్న ప్రతి వస్తువునందు, ప్రతి ప్రాణి యందు ఉన్న తత్త్వమే నీలోనూ ఉన్నది. **తత్త్వమసి** అదే నువ్వు అంటాడు. నువ్వే పరమేశ్వరుడిని నువ్వే పరమాత్మవి లోకంలో ప్రాణమున్నవి ప్రాణంలేనివి, చలనమున్నవి చలనంలేనివి అన్నింటి యందు పరమేశ్వరుడున్నాడు. ఆ పరమేశ్వరుడు ఎవరో కాదు నువ్వే అని చెబుతాడు.

ఈ రకంగా **'నేను పరమేశ్వరుణ్ణి'** అనే మహావాక్యాన్ని వివరించి, నీకు స్వయంగా చూపి నిన్ను మోక్షమార్గం వైపు నడిపించే వాడే గురువు.

వివేకానందుడికి రామకృష్ణ పరమహంస లాగా సమర్థుడైన గురువు దొరకటం గతజన్మల పుణ్యఫలం. చాలామంది చెబుతుంటారు. 'మాకు మంచి గురువు దొరకాలి. ఇంతవరకు దొరకలేదు. సద్గురువు కోసం ఎదురు చూస్తున్నాం. వెతుకుతున్నాం' అని. గురువు కోసం మీరు వెతకవలసిన అవసరం లేదు. మీరు పరిణితి చెందితే గురువే మిమ్మల్ని వెతుక్కుంటూ వస్తాడు. మీకు సద్గురువు దొరకలేదంటే మీరింకా పరిణితి చెందలేదన్న మాట. ఈ లోకంలో కనిపించే జీవరాసి అంతా గురువులే. ఒక్కొక్క గురువు దగ్గర ఒక్కొక్క విషయం నేర్చుకుంటాం. రామకృష్ణ పరమహంస తనకు ఐదుగురు గురువులున్నారు అంటాడు. దత్తాత్రేయుడు యదుమహారాజుతో తనకు 24 మంది గురువులున్నారు అంటాడు. వీరిలో పింగళ అనే వేశ్యకూడా ఉంది. అలాగే రామకృష్ణ పరమహంస గురువులలో ఒక బెస్తవాడు, ఒక కొంగ ఉన్నారు. ఇలా లోకంలో ప్రతిదీ మనకు గురువే. కాకులు కావు కావు అని అరుస్తాయి. ఈ లోకంలో ఏవీ శాశ్వతం కావు. అనేదే దానర్థం. ఈ రకంగా మానవుడు ప్రకృతి నుంచే పాఠాలు నేర్చుకుంటాడు. మొదటి గురువు తల్లి. వివేకానందుడు పాఠశాలలో

చదివే రోజుల్లో ఒక గుర్రబ్బండిలో స్కూలుకు వెళ్ళేవాడు. బండి తోలటమంటే వివేకానందుడికి అత్యంత ఇష్టం. ఒకసారి క్లాసులో టీచరు అడిగింది 'పెద్దయిన తరువాత మీరు ఏం కావాలనుకుంటున్నారో చెప్పండి' అని దానికి పిల్లలు కొంతమంది డాక్టరు కావాలని, కొంతమంది ఇంజనీరు కావాలని ఇలా చెప్పారు. వివేకానందుడు మాత్రం 'నేను గుర్రం బండి తోలాలనుకుంటున్నాను' అన్నాడు. ఆ మాట విన్న పిల్లలు అందరూ ఘొల్లున నవ్వారు. ఇంటికి వెళ్ళిన తరువాత జరిగిన విషయం అంతా తల్లికి చెప్పాడు వివేకానందుడు. తల్లి అతడి మాటలు కాదనలేదు. అతణ్ణి దేవుడి మందిరం దగ్గరకు తీసుకువెళ్ళి ఒక ఫొటో చూపించింది. అందులో శ్రీకృష్ణపరమాత్ముడు రథం తోలుతున్నాడు. ఆ రథానికి నాలుగు గుర్రాలున్నాయి. అప్పుడు పిల్లవాడితో చెప్పింది. 'నాన్నా ! ఒక గుర్రం కాదు రా... నాలుగు గుర్రాలున్న రథాన్ని తోలాలి నువ్వు' అంది. ఆ మాటలు అతని మనసులో నాటుకుపోయాయి. తరువాత కాలంలో హిందూ ధర్మాన్ని గురించి దేశవిదేశాల్లో చాటి చెప్పాడు. ఆధ్యాత్మిక చక్రవర్తి అయినాడు.

ఈ రకంగా గురువు ప్రభావం మనమీద చాలా ఉంటుంది. తెలుసుకోవాలనే జిజ్ఞాస ఉండాలే గాని లోకంలో ప్రతిదీ మనకి గురూపదేశమే. మనల్ని సన్మార్గంలో నడిపించే వాడు, మనతో మంచి పనులు చేయించే వాడు, మోక్షమార్గాన్ని చూపే వాడు గురువు. అందుకే **తస్మై శ్రీ గురవే నమః**

అటువంటి గురువు మీద అత్యంతమైన భక్తి, శ్రద్ధ కలిగి ఉండాలి. గురుభక్తికి సాటి ఇంకొకటి లేదు.

పూర్వ కాలంలో ఒకసారి నారదుడికి గురుభక్తి యొక్క ప్రభావం తెలుసుకోవాలి అనిపించి, వసిష్ఠుల వారి దగ్గరకు వెళ్ళి గురుభక్తిని గురించి వివరించమని అడిగాడు. దానికి వసిష్ఠ మహర్షి 'గురుభక్తి ఎనలేనిది. లోకంలో గురుభక్తితో సమానమైనది ఇంకొకటి లేదు. గురువు అనుగ్రహం పొందిన వాడు దేన్నైనా పొందగలడు' అని చెప్పాడు. అప్పుడు నారదుడు కొంచెం గర్వంతో 'ఓ మహర్షీ ! నేను నిరంతరం హరి నామస్మరణ చేస్తుంటాను. అందులో 12 సంవత్సరాలు హరినామస్మరణ చేసిన ఫలం నీకు ధార పోస్తాను. నాకు కొంత గురుభక్తి ఫలాన్ని ఇవ్వు' అన్నాడు. ఆ మాటలు విన్న వసిష్ఠుడు 'ఒకరోజు గురుభక్తి ఫలాన్ని ఇస్తాను' అన్నాడు.

వసిష్ఠుని మాటలు విన్న నారదుడు ఆశ్చర్యపోయి గురుభక్తి అంత గొప్పదా? అని అడిగాడు. అవును కావాలంటే పరిక్ష చేసుకో. దీనికి న్యాయనిర్ణేతలు ముగ్గురే ఉన్నారు. 1) సూర్యుడు 2) వాయువు 3) ఆదిశేషుడు. వారిని అడిగి తెలుసుకో అన్నాడు వసిష్ఠుడు. సరేనని నారదుడు అక్కడి నుండి బయల్దేరి ముందుగా సూర్యుడి దగ్గరకు వెళ్ళి 'సూర్య దేవా ! నేను గురుభక్తి ఫలాన్ని పరిక్షించాలనుకుంటున్నాను. నువ్వు న్యాయనిర్ణేతగా రావాలి' అన్నాడు. దానికి సూర్యభగవానుడు 'నారదా ! నీ అంతటి వారు అడిగితే కాదంటానా? అలాగే వస్తాను. కాని నేను లేకపోతే లోకాలన్నీ చీకట్లో మునిగిపోతాయి. కాబట్టి ఇక్కడ నా బదులు ఎవరైనా పనిచేస్తే, నేను నీతో వస్తాను' అన్నాడు. సరేనని నారదుడు వాయువు దగ్గరకు వెళ్ళి న్యాయనిర్ణేతగా రమ్మని అడిగాడు. నా బదులుగా ఇంకెవరైనా పనులు చేస్తే నేను అలాగే వస్తాను' అన్నాడు వాయువు. తరువాత ఆదిశేషుడు కూడా ఇదే సమాధానం చెప్పాడు. ఇప్పుడు వీరి బదులుగా ఎవరిని పంపాలి అనే ఆలోచిస్తూ వసిష్ఠుడి దగ్గరకు వెళ్ళి అడిగాడు. అప్పుడు వసిష్టుడు ఆ పని నే చూసుకుంటాను అని చెప్పి తన దగ్గర ఉన్న ఒక రుద్రాక్షను సూర్యలోకానికి విసిరాడు. అది దేదీప్యమానంగా సూర్యునితో సమానమైన కాంతితో ప్రకాశించింది. తన దగ్గర ఉన్న విసనికర్రను వాయులోకం వైపుగా విసిరాడు. అది వాయుదేవునితో సమానంగా గాలులు వీచింది. చివరగా వసిష్ఠుడు తన కమండలంలోని వీటిని ఆదిశేషుని వైపు విసిరాడు. అది ఆదిశేషుడి లాగానే లోకాలన్నీ మోసింది.

ఈ దృశ్యాన్ని కళ్ళారా చూసిన నారదుడు అవాక్కైనాడు. గురు భక్తి ఫలాన్ని ప్రత్యక్షంగా చూశాడు. గురుభక్తి ఫలం అంత గొప్పది. అందుకే

*తస్మై శ్రీ గురవే నమః*

## 24. స్త్రీని గౌరవించండి

భారతదేశంలో స్త్రీకి చాలా గౌరవం ఉంది. సమాజంలో ఉన్నతమైన స్థానం ఉంది. వేదకాలం రెండు భాగాలుగా ఉంటుంది. 1. తొలివేదకాలము 2. మలివేద కాలము. తొలివేదకాలంలో స్త్రీకి చాలా ప్రాముఖ్యత ఉన్నది. ఏ పని చెయ్యాలన్నా, ప్రతిపనికి ఆమె సలహా సంప్రదింపులు ఉండేవి. రాజ్యపాలనలో కూడా స్త్రీకి ప్రముఖ స్థానం ఉండేది. రాజుగారు దేశానికి సంబంధించి ఏదైనా నిర్ణయం తీసుకోవాలంటే,

ఆ విషయాన్ని చర్చించటానికి ప్రత్యేకమైన నిర్ణయాత్మక సభ ఉండేది. అందులో మంత్రులు, సేనాధిపతి, సామంతులు, దండనాయకుల సభ్యులుగా ఉండేవారు. ఆ సభలో రాణిగారికి కూడా సభ్యత్వముండేది. అంటే ఏదైనా నిర్ణయం తీసుకునే ముందు రాణితో కూడా చర్చించాలి. ఆ నిర్ణయం ఆమెకు నచ్చకపోతే దాన్ని వీటో చేసే అధికారం కూడా ఆమెకు ఉన్నది. దీన్నిబట్టి స్త్రీకి ఎంత ప్రాముఖ్యత ఉన్నదో తెలుస్తోంది. ఆ రోజుల్లో స్త్రీలకు కూడా ఉపనయనం చేసి గురుకులానికి పంపేవారు. అయితే ఉపనయనం చెయ్యటానికి ప్రత్యేకమైన కల్పంగాని, మంత్రాలు గాని ఏవీ లేవు. ఉపనయనం చేసే పద్ధతి అందరికీ ఒకటిగానే ఉండేది. ఎక్కువ మంది స్త్రీలు వివిధ రకాల వంటలు, కుట్లు, అల్లికలు, పశుపోషణ, పిల్లల్ని పెంచే విధానం ఇటువంటి విషయాలే నేర్చుకునే వారు. కాని కొంతమంది మాత్రం ఉపనయనం చేసుకుని గురుకులాని వెళ్ళి వేదవేదాంగాలు, శాస్త్రాలు అభ్యసించే వారు. బృహదారణ్యకోపనిషత్తులో వీరి ప్రస్తావన కనిపిస్తుంది. గర్గుని యొక్క కుమార్తె గార్గేయి, జనక మహారాజు మంత్రియైన మైత్రేయుని కుమార్తె మైత్రేయి వంటి వారు ఈ కోవకు చెందిన వారే.

వేద మంత్రాలను కొంతమంది మహర్షులు సమాధి స్థితిలో ఉండి దర్శించారు. అలా దర్శించిన వారిలో కొంతమంది స్త్రీలు కూడా ఉన్నారు. వారు

శుక్రాచార్యుని తల్లి భృగుమహర్షి భార్య – ఉశన

భరద్వాజుని కుమార్తె – శిరింభిర

దక్ష ప్రజాపతి కుమార్తెలు – మేధ, కద్రువ

త్వష్ట ప్రజాపతి కుమార్తెలు – త్వాష్ట్రులు

ఇలా మనకు తెలిసినంత వరకు 25 మంది పైగా స్త్రీ వేదమంత్రాలను దర్శించారు. అంటే ఆ రోజుల్లో పురుషులతో పాటుగా స్త్రీలు కూడా తపస్సు చేసి సమాధి స్థితిలో ఉండేవారన్న మాట. అంతదాకా ఎందుకు? హిమవంతుని కుమార్తె హైమవతి శివుణ్ణి గురించి తపస్సు చేసింది కదా?

ఆ రోజుల్లో బాల్య వివాహాలు లేవు. యుక్తవయస్సు వచ్చిన కన్యకు మాత్రమే వివాహం చేసేవారు. వివాహమైన తరువాత స్త్రీ అత్తవారింటికి మకుటంలేని మహారాణి. ఆ కాలంలో స్త్రీని ఇంటికి దీపం, కంటికి వెలుగు అనే వారు. ఇంట్లో

అన్ని అధికారాలు ఆమెవే. స్త్రీకి అన్ని హక్కులు ఉండేవి. సభలలో, వేదాంత చర్చలలో, కూడా వారు పాల్గొనే వారు. ఈ రకంగా తొలి వేదకాలంలో స్త్రీకి చాలా గౌరవం ఉండేది.

తరువాత మలివేదకాలంలో కొంతమంది స్వార్థపరుల కారణంగా పురుషాధిక్యత పెరిగిపోయింది. కాలక్రమేణా వందసంవత్సరాల క్రితం వరకు స్త్రీని బానిసగా, పురుషుడికి సుఖాన్నిచ్చే సాధనంగా, పిల్లల్నికనే యంత్రంగా చూశారు.

మనం గుర్తించాల్సిన విషయం ఏమంటే స్త్రీ బానిస కాదు. ఆట వస్తువు కాదు. స్త్రీ అంటే–అందులో మన తల్లి, చెల్లి కూడా ఉన్నారన్న మాట గుర్తుంచుకోవాలి.

**యత్ర నార్యేషు పూజ్యంతే, రమంతే తత్ర దేవతాః**

స్త్రీలు ఎక్కడైతే పూజించబడతారో, గౌరవించబడతారో, స్త్రీలకు ఎక్కడైతే ప్రాధాన్యత ఉంటుందో, అక్కడ దేవతలు సంతోషంగా ఆటలు ఆడతారు. ఇంటికి దీపం ఇల్లాలు. కలకంఠికంట కన్నీరొలికిన గరళమై పోవును అమృతము, ఈ మాటలు అక్షర సత్యాలు. ఏ ఇంట్లో స్త్రీ సుఖంగా ఉంటుందో, ఆ యిల్లు స్వర్గసీమ. ఇంట్లో ఎంతమంది మగ పిల్లలున్నా, ఆడపిల్ల లేకపోతే అందముండదు. కాబట్టి స్త్రీని ఎప్పుడూ అవమానించకూడదు, నిందించకూడదు, చులకనగా చూడకూడదు. రాబోయే కాలంలో స్త్రీలదే ఆధిక్యత అని గుర్తించండి.

పోల్చి చూసినట్లైతే, పురుషుడికన్న స్త్రీలో చాలా గొప్ప గుణాలు, లక్షణాలు ఉన్నాయి. బ్రహ్మదేవుడు సృష్టి చేసేటప్పుడే అనేక గొప్ప లక్షణాలు స్త్రీలో పొందుపరచాడు. ఒకే వయసున్న పురుషుడి ఆలోచనలకు, స్త్రీ ఆలోచనలకు చాలా తేడా ఉంటుంది. స్త్రీ చాలా బాధ్యతాయుతంగా ప్రవర్తిస్తుంది. ఆమెకు తన నిలువ, శక్తి తెలిసినా, వాటిని అవసరమైతేనే ఉపయోగిస్తుంది. లేకపోతే ఏమీ తెలిసినట్లే ఉంటుంది. ఆ శక్తి ముందు ఎవరూ నిలవలేరు.

సృష్టి కాలంలో బ్రహ్మదేవుడు అన్ని జీవులను పురుషుడితో సహా సృష్టించి, చివరిగా స్త్రీని సృష్టించటానికి సంకల్పించాడు. అలా సంకల్పించిన బ్రహ్మ స్త్రీని సృష్టించటానికి ఏకంగా వారం రోజులు తీసుకున్నాడు. బ్రహ్మదేవుని భార్య సరస్వతీ దేవి చూస్తోంది. ఒక స్త్రీని సృష్టించటానికి బ్రహ్మ ఎందుకు ఇంత కష్టపడుతున్నాడో ఆమెకు అర్థం కాలా. తన భర్తని అడిగింది.

దేవా ! ఒక స్త్రీని సృష్టించటానికి ఎందుకు ఇంతగా కష్టపడుతున్నావు? అని. దానికి బ్రహ్మ చెబుతున్నాడు.

"ఏం చెయ్యను దేవీ ! స్త్రీ హృదయంలో ఎన్ని విషయాలు నిబిడీకృతం చెయ్యాల్సి వస్తుందో తెలుసా ?

1. మొండికేసి మాట వినని పిల్లవాణ్ణి సముదాయించి, క్షణాల్లో దారికి తెచ్చుకోవాలి.
2. జీవితంలో అనేక సమస్యలు. చిన్న చిన్న వాటి నుంచి మనసు ముక్కలు చేసే వరకు అనేకానేక సమస్యలు. వీటన్నింటినీ ఎదుర్కోవాలి.
3. తనకు ఆరోగ్యం బాగా లేకపోయినా సహాయం చేసే వారుండరు. అయ్యో అనే వారుండరు. అన్నీ సర్దుకుపోవాలి.
4. రోజుకు 16 గంటలు పని చెయ్యాలి. చేతులో పని అందుకునే వారుండరు. ఇక్కడి వస్తువు తీసి ప్రక్కన పెట్టే వారుండరు.
5. కన్నవారు గాని, కట్టుకున్న భర్తగాని, పిల్లలు గాని ఎవరూ సహాయం చెయ్యరు. అన్ని పనులు తనే చూసుకోవాలి. ఇంట్లో పనులు, బయటి పనులు కూడా. ఇంత పని చేస్తున్నా ఆమెకు ఉండేది రెండే చేతులు
6. ఆమె దేహం చాలా మృదువుగా, నాజూకుగా ఉంటుంది. కాని మానసికంగా చాలా బలవంతురాలు. ఎన్ని సమస్యలైనా ఎదుర్కోగలదు.
7. కష్టం, సుఖం, ఇష్టం, అయిష్టం, ప్రేమ, ద్వేషం, దుఃఖం. అన్ని భావోద్వేగాలను చవిచూడాలి. చేసుకున్న వారందరూ భార్యను సుఖపెట్టరు. అనేక కష్టాలపాలు చేస్తారు. కొడతారు, తిడతారు, అసహ్యించుకుంటారు. అలాగే పిల్లలవల్ల అనేక కష్టాలు అన్నింటినీ భరించాలి.
8. కోపం వచ్చినా సరే నవ్వుతూనే ఉండాలి.
9. తనకు న్యాయమనిపించినప్పుడు దాని కోసం పోరాడాలి.
10. సమస్యను చాలా లోతుగా ఆలోచించాలి. పరిష్కారాలు చెప్పగలగాలి.
11. ఆమె కన్నీటిలో ఆనందము, ఆ వేదనా, దిగులు, దుఃఖము, బాధ, భయము అన్నీ ఉంటాయి.

12. మరొక జీవిని పదినెలల పాటు తనలో మోసి, కని, పెంచి, ప్రయోజకులుగా తీర్చిదిద్దే నేర్పు ఉండాలి.

13. స్త్రీ పరమశాంతమూర్తి. అవసరమైతే భద్రకాళి, రౌద్రమూర్తి.

ఇన్ని గొప్ప లక్షణాలు, గుణాలు తనలో ఉన్నా, ఇన్ని విషయాలు తెలిసినా ఏమీ తెలియనట్లే అమాయకంగా కనిపిస్తుంది. అందుకే స్త్రీని సృష్టించటానికి ఇంత సమయం పడుతోంది అన్నాడు బ్రహ్మ. స్త్రీలో ఎన్ని గొప్ప లక్షణాలున్నాయో చూడండి.

ఈ సందర్భంగా కాథలిక్ క్రిష్టియన్ కుటుంబంలో జన్మించిన 'మార్టినా' అనే మహిళ, హైందవ ధర్మంమీద, హిందువులు స్త్రీకి ఇచ్చే గౌరవం మీద వెలిబుచ్చిన అభిప్రాయం చూడండి. మార్టినా ఒక కాథలిక్ క్రిష్టియన్ కుటుంబంలో జన్మించింది. చిన్నప్పటి నుంచి చర్చికి వెడుతుండేది. చర్చిలో ఫాస్టరు 'యేసు ఒక్కడే దేవుడు' అని చెప్పేవాడు. ఆ మాటలు ఆమెను పూర్తిగా నమ్మలా. దాంతో బైబిలులోని పాత నిబంధనలు చదివి 1. భూమి ఆకారం గురించి బైబిలు ఎందుకు తప్పుగా చెప్పింది? 2. తండ్రితో కుమార్తె కామక్రీడలు సాగించవచ్చు అని బైబిలు ఎలా చెప్పింది? అని ఫాస్టరును అడిగింది. దాంతో మత పెద్దలు కోపగించి ఇంక నుంచి నువ్వు చర్చికి రావద్దు అన్నారు. అప్పుడు ఆమె వయస్సు 13 సంవత్సరాలు.

తరువాత మార్టినాకు ముస్లింలలో పరిచయమైంది. ఒకసారి మసీదుకు వెళ్ళింది. అక్కడి వారు స్త్రీలు మసీదుకు రాకూడదు. బురఖా వేసుకుని ఇంటిదగ్గరే నమాజ్ చెయ్యాలి అని చెప్పారు. ఎంతో పాపం చేసుకుంటేనే గాని మహిళగా జన్మించరని చెప్పారు. దాంతో ఇస్లాంలో మహిళలకు తీవ్రమైన ఇబ్బందులున్నాయని, మహిళలు పురుషుల కామవాంఛ తీర్చే బొమ్మలు. వారికి మసీదులోకి ప్రవేశం కూడా ఉండదు అని అర్థమయింది.

అలాంటి సమయంలో ఒక వృద్ధ స్త్రీ వచ్చి భారతదేశంలో పవిత్రమైన ఆధ్యాత్మిక భావాలున్నాయని చెప్పింది. ఆ మాటలను మార్టినా నమ్మలా. ఎందుకంటే గతంలో పాస్టరు భారతదేశంలో మహిళల పరిస్థితి ఇంతకన్నా దారుణంగా ఉంటుందని చెప్పాడు.

ఒక రోజున మార్టినా స్నేహితురాలు భారతదేశం నుంచి తెచ్చిన గంగాజలాన్ని ఇచ్చి 'ఇది చాలా పవిత్రమైన జలం. దీన్ని త్రాగు' అన్నది. ఇష్టం లేకపోయినా

బలవంతంగానే ఆ నీటిని త్రాగింది మార్టినా. అప్పుడు అడిగింది స్నేహితురాలిని. ఈ 'గంగ ఎవరు?' అని

గంగ నది. భారతీయులు ఆ నదిని దేవతగా పూజిస్తారు అని చెప్పింది స్నేహితురాలు. ఆశ్చర్యపోయింది మార్టినా. 'గంగ మహిళ కదా ? మరి ఆమె మీద వివక్షత చూపరా?' అని అడిగింది. అప్పుడు చెప్పింది స్నేహితురాలు.

"వాస్తవానికి భారతీయులు ఆరాధించేది భూమాతని, వేదమాతని, గోమాతని. భారతదేశంలో పవిత్రమైనవన్నీ మాత్రురూపమే. అంటే మహిళారూపమే. ధనలక్ష్మి, ధాన్యలక్ష్మి గంగానది, యమునానది, గోదావరి. వీటన్నింటినీ పవిత్రమైన స్త్రీ రూపంలోనే పూజిస్తారు. అక్కడ మహిళలకు ప్రాధాన్యత ఇస్తారు" అని చెప్పింది. దాంతో ఆశ్చర్యపోయింది మార్టినా. తరువాత కాలంలో భారతదేశానికి వచ్చి ఇక్కడ స్త్రీకి ఇచ్చే ప్రాముఖ్యత, గౌరవము చూసి అబ్బురపడి, హిందువుగా ఇక్కడే స్థిరపడి పోయింది. దీన్ని బట్టి భారతదేశంలో స్త్రీకి ఎంత గౌరవం ఉన్నదో మనకు అర్ధమవుతున్నది. కాబట్టి ఆడపిల్లల్ని వెంటపడి వేధించే ఓ మగపిల్లల్లారా ! భార్యను పలురకాలుగా హింసించి ఆనందాన్ని అనుభవిస్తూ, భార్యను బానిసలా చూసే పురుష పుంగవులారా ! మీ వెకిలివేషాలు, ఇబ్బందికరమైన పనులు భరిస్తున్నదంటే చేతకాక కాదు. భార్యలను హింసించే భర్తలు ఒక్క క్షణం ఆలోచించండి. ఆమె గనక నోరు తెరిస్తే మీ బ్రతుకు బజారు పాలవుతుంది. నలుగురిలోను తల ఎత్తుకోలేరు. తెల్లవారేసరికి ఏ దూలానికో, ఫ్యానుకో వేళ్ళాడాలి లేదా ఏ కాలవలోనో నదిలోనో శవమై తేలాలి. ఈ విషయం గుర్తించండి.

**కార్యేషుదాసి, కరణేషు మంత్రి, భోజ్యేషు మాతా, శయనేషు రంభా ...**

అంటూ స్త్రీకినేక బిరుదులిచ్చారు. ఇవన్నీ యథార్థాలు. ఆమె పోషించే పాత్రలు. స్త్రీ ఆనందంగా, సంతోషంగా ఉంటేనే ఇల్లు హాయిగా ఉంటుంది. లేకపోతే ఇల్లు నరకమే. భార్యను ఇబ్బందులపాలు చేసే ఏ మగాడైనా సుఖపడుతున్నాడేమో ఒకసారి ఆలోచించండి. స్త్రీ అంటే గృహలక్ష్మి, ఆనందలక్ష్మి, సంతానలక్ష్మి, శాంతలక్ష్మి. మనదేశంలోనే కాదు ప్రపంచంలో ఏ మారుమూల ప్రాంతంలోనైనా సరే స్త్రీని గౌరవించాల్సిందే. పూజించాల్సిందే. స్త్రీకంట కన్నీరు రావటం శ్రేయస్కరం కాదు. **తను బాధ పడుతూ కూడా ఇతరులకి ఆనందాన్నిచ్చే దేవత. అటువంటి స్త్రీని ఇబ్బంది పెట్టకండి. బాధ పెట్టకండి. స్త్రీని గౌరవించండి.**

# 25. శ్రాద్ధము

చనిపోయిన వారికి, వారు మరణించిన నెలలో వచ్చే అదే తిథిన పెట్టేదే శ్రాద్ధము. మనకు ఒక సంవత్సరము అంటే పితృదేవతలకు ఒకరోజు. కాబట్టి సంవత్సరానికి ఒకసారి మనం శ్రాద్ధము పెడుతున్నాము అంటే, పితృదేవతలకు ప్రతిరోజు ఆహారము అందుతుందన్న మాట. మంత్రపూరకంగా మనం ఈ లోకంలో సమర్పించే ఆహారం ఆ లోకంలో వారికి చేరుతుంది. ఇది ఎలా సాధ్యము అని చాలామందికి అనుమానం వస్తుంది. మనం పెట్టిన పిండాలు ఇక్కడే ఉన్నాయి కదా? వాటిని పితృదేవతలు ఎలా స్వీకరిస్తారు? దీనికి సమాధానం -

ఢిల్లీలో చదువుకుంటున్న పిల్లవాడికి మనం ఇక్కడి పోస్టాఫీసు నుంచో, బ్యాంకు నుంచే డబ్బులు పంపిస్తాం. మనం చెల్లించిన డబ్బు ఇక్కడే ఉంటుంది. కాని పిల్లవాడికి డబ్బులు చేరతాయి. అలాగే మనం సమర్పించిన పిండ నైవేద్యం ఇక్కడే ఉన్నా, అది పితృదేవతలకు చేరుతుంది.

శ్రాద్ధము పెట్టేటప్పుడు సామాన్యంగా ముగ్గురు బ్రాహ్మణులను పిలవటం జరుగుతుంది. ఇందులో మంత్రం చెప్పేది ఒకరు. మిగిలిన ఇద్దరూ భోక్తలు. ప్రస్తుత రోజుల్లో భోక్తగా కూర్చునే వాడికి ఏ మంత్రమూ రాదు. అయితే భోక్తలుగా ఎవరిని పిలవాలి? ఎవరిని పిలువరాదు? అనే విషయాన్ని పురాణాలు చెబుతున్నాయి. విష్ణుపురాణం ప్రకారము మిత్రద్రోహి, గోళ్ళు పుచ్చిపోయిన వాడు, అబ్రాహ్మణుడు, ఆడబిడ్డలను తిట్టేవాడు, అగ్నిహోత్రము చేయనివాడు, వేదం చదవనివారు, కల్లు, సారాయి అమ్మేవాడు, నీచపు పనులు కోసం వేదం చెప్పేవాడు, వీరు భోక్తలుగా పనికిరాదు. అలాగే రెండవ పెళ్ళి చేసుకున్న దాని భర్త, తల్లితండ్రులను గౌరవించని వాడు, శూద్ర స్త్రీతో సంబంధాలు ఉన్నవాడు, దేవాలయంలోని అర్చకుడు, ధనమిచ్చి వేదం నేర్చుకొన్నవాడు వీరు కూడా భోక్తలుగా పనికిరాదు.

శ్రాద్ధం జరుగుతున్నప్పుడు వచ్చిన అతిథిని వెళ్ళనివ్వరాదు. అతడికి అర్ఘ్యపాద్యాదులిచ్చి, భోజనం పెట్టి పంపాలి. పిత్రుదేవతలకు - బేసిసంఖ్యలోను, విశ్వేదేవతా స్థానంలో సరిసంఖ్యలోను బ్రాహ్మణులుండాలి. లేకపోతే రెండు స్థానాలకు చెరి ఒకరిని భోక్తలుగా పిలువవచ్చు. విశ్వేదేవతల స్థానంలోని వారు-తూర్పు ముఖం గాను, పిత్రుస్థానంలోని వారు - ఉత్తరముఖంగాను కూర్చోవాలి. పిత్రుదేవతలకు

నువ్వులు నీళ్ళు అపసవ్యంగా సమర్పించి ఆవాహన చెయ్యాలి. శ్రాద్ధ సమయంలో యతీశ్వరుడు రావటం విశేషం. అతడికి భోజనం పెట్టి పంపాలి.

శ్రాద్ధం కర్మలో కూరలు, ఉప్పు ఏవీ లేని అన్నాన్ని మూడుసార్లు హోమం చెయ్యాలి.

1. అగ్నయే కవ్యవాహనాయ స్వధా నమః
2. సోమాయ పిత్రుమతే స్వాహా
3. వైవస్వతాయ యమాంగీరస్వతే నమః

అని హోమం చేసి, మిగిలిన అన్నాన్ని భోక్త విస్తరిలో ఉంచాలి. ఆ తరువాత వారికి మృష్టాన్న భోజనం వడ్డించాలి. వడ్డించే సమయంలో కోపము, వేగము, విసుగు పనికి రావు. భోక్తలు భోజనం చేసిన తరువాత పితృదేవతలకు పిండాలు సమర్పించాలి.

వెండి చంద్రుడికి ప్రీతి. పితృదేవతలు చంద్రుడిపై ఆధారపడిన వారు. కాబట్టి శ్రాద్ధకర్మలో వెండిదానం శ్రేష్ఠం. పితృదేవతలకు ప్రీతి కలిగించే వాటినే శ్రాద్ధకర్మలో వాడాలి.

పూర్వకాలంలో శ్రాద్ధకర్మలో మాంసాన్ని విధిగా వాడేవారు. ప్రస్తుత కాలంలో మాంసానికి బదులుగా మినుములలో తయారుచేసిన గారెలు వాడుతున్నారు. పెరుగు, నెయ్యి, ఆవుపాలు, పాయసము కూడా మాంసముతో సమానమైనవే. అనుములు, గోధుమలు, వడ్లు, యవలు, వన ఔషధులు మొదలైనవి శ్రాద్ధకర్మలో వాడవచ్చు.

కందులు, నీరుల్లి, గోంగూర, పుల్లబచ్చలి, మునగ, ముల్లంగి, వెల్లుల్లి, సొరకాయలు శ్రాద్ధకర్మలో వాడరాదు. వడలు, ఇడ్లీలు, దోసెలు వంటివి కూడా పనికి రావు. రోగి, దిగంబరుడు, నాస్తికుడు, ఛండాలుడు, జూదరి, త్రాగుబోతు, నపుంసకుడు, శవవాహకుడు, కోతి, పంది, కోడి వంటివి శ్రాద్ధకర్మను చూడరాదు.

## 26. దాన ఫలితం

మన దగ్గర ఉన్న దాన్ని ప్రతిఫలాపేక్ష లేకుండా ఇతరులకు ఇవ్వటాన్నే దానము అంటారు. ఏ పని చేసినా ఫలితము అనేది ఉంటుంది. మనం సంకల్పం చెప్పి దానం చేస్తే ఇహలోకంలో ఫలితముంటుంది. గ్రహశాంతికి దానం చేస్తే, గ్రహదోషం తొలగిపోతుంది. సంకల్పం లేకుండా దానం చేస్తే పరలోకంలో ఫలితముంటుంది.

ఆ దానం కొన్ని రెట్లయి మరుజన్మలలో మనకు అందుతుంది. నేను మూడు లక్షల రూపాయలు దానం చేశాను. మరి దానికి తగిన ఫలితం వస్తుంది కదా ? అంటే వస్తుంది. నీ దృష్టిలో మూడు లక్షలు ఎక్కువ కావచ్చు. కాని దాన్ని భగవంతుడి దృష్టిలో లెక్క పెట్టాలి. ఉదాహరణకు నీకు ముప్పై కోట్ల రూపాయలు ఆస్తి ఉంది. మూడు లక్షలు దానం చేశావు. అదే ఇంకొకడికి కేవలం పది రూపాయలే ఉంది. అందులోంచి ఒక రూపాయి దానం చేశాడు. ఇంకొకడు తినటానికి నాలుగిళ్ళలో అడిగి అన్నం తెచ్చుకున్నాడు. తీరా తినబోయే సమయానికి ఆకలితో అలమటిస్తున్న వ్యక్తి కనిపించాడు. తను అడుక్కు తెచ్చుకున్న దాంట్లోంచి కొంత భాగం అతడికి దానం చేశాడు. ఇప్పుడు ఈ ముగ్గురూ దానం చేసిన వారే. కాని వీరిలో ఎవరు చేసిన దానం ఎక్కువో మీరే లెక్క కట్టండి. ఒక చిన్న ఉదాహరణ చూడండి.

ఒక ఊరిలో ఇద్దరు వ్యక్తులు గుడిదగ్గర కూచుని కాలక్షేపం కోసం కబుర్లాడు కుంటున్నారు. చీకటి పడింది. మబ్బులు కూడా పడుతున్నాయి. ఇంతలో ఇంకొక వ్యక్తి అక్కడికి వచ్చి కూర్చోవచ్చా? అన్నాడు. దానికి అదేం భాగ్యం. ఈ స్థలం ఏమీ మా స్వంతం కాదు. మేము కూడా కాలక్షేపానికి కూర్చున్నాం. నువ్వు కూడా కూర్చో అన్నారు వారు. మూడవ వ్యక్తికూడా కూర్చున్నాడు. ముగ్గురూ కలిసి పిచ్చాపాటి కబుర్లు చెప్పుకుంటున్నారు. ఇంతలో వర్షం మొదలయింది. చూస్తుండగానే పెద్ద గాలితో కూడిన వాన అయింది. దాంతో వాళ్ళు అక్కడ నుంచి కదిలే వీలు లేకపోయింది.

ఇంతలో మూడవ వ్యక్తి 'నాకు బాగా ఆకలి వేస్తోంది' అన్నాడు. మా పరిస్థితి కూడా అలాగే ఉంది. అతడి దగ్గర మూడు రొట్టెలు ఉన్నాయి. నా దగ్గర ఐదు రొట్టెలున్నాయి. వీటిని మనమందరం పంచుకుని తిందాం అన్నాడు రెండవ వ్యక్తి. సరేనన్నారు మిగిలిన ఇద్దరూ. కాని ఎనిమిది రొట్టెలను ముగ్గురు పంచుకోవటం ఎలా ? అనే ప్రశ్న వచ్చింది. మూడవ వ్యక్తే దానికి ఉపాయం కూడా చెప్పాడు. 'ఒక్కొక్క రొట్టెను మూడు ముక్కలు చేద్దాం. ఎనిమిది రొట్టెలకు కలిపి ఇరవై నాలుగు ముక్కలవుతాయి. అప్పుడు ఒక్కొక్కరు ఎనిమిది ముక్కలు తిందాం' అన్నాడు. సరేనన్నారు మిగతా ఇద్దరు. రొట్టెలను ముక్కలుగా చేసి ముగ్గురూ సమానంగా తిన్నారు. కాసిని మంచినీళ్ళు త్రాగి పడుకుని నిద్ర పోయారు.

తెల్లవారిన తరువాత లేచారు. వాన పూర్తిగా తగ్గింది. మూడవ వ్యక్తి 'రాత్రి నాకు తోడుగా ఉండటమే కాక ఆహారం కూడా పెట్టారు. నా దగ్గర ఎనిమిది బంగారు నాణాలు ఉన్నాయి. వాటిని మీరిద్దరూ తీసుకోండి అంటూ ఎనిమిది బంగారు నాణేలు వారికి ఇచ్చి వెళ్ళిపోయాడు.

అతడు వెళ్ళిన తరువాత మొదటివాడు ఆ బంగారు నాణేలలో నాలుగు నాకిస్తే నేను వెళ్లిపోతాను అన్నాడు రెండవ వాడితో. దానికి మొదటి వాడు అదెలా జరుగుతుంది. నావి ఐదు రొట్టెలు కాబట్టి నాకు ఐదు బంగారు నాణాలు రావాలి. నీవి మూడు రొట్టెలు కాబట్టి నీకు మూడు నాణేలే వస్తాయి, అన్నాడు.

ఇప్పుడు వీరిద్దరి మధ్య తగవు వచ్చి న్యాయాధికారి దగ్గర కెళ్ళారు. అతడికి రెండవ వ్యక్తి చెప్పిందే న్యాయం అనిపించింది. అయినా తీర్పు రేపు చెబుతాను అన్నాడు.

ఆ రాత్రి న్యాయాధికారి స్నేహితుడు వచ్చాడు. మాటల మధ్యలో ఈ తగాదా విషయం వచ్చింది. ఇప్పుడు తీర్పు ఎలా చెప్పబోతున్నావు? అని అడిగాడు. స్నేహితుడు రెండవ వాడు చెప్పినదే న్యాయమనిపిస్తోంది అన్నాడు న్యాయాధికారి.

నువ్వసలు జరిగిందేమిటో సరిగా విన్నావా? మూడు రొట్టెలున్న వాడికి ఒక బంగారు నాణెమే రావాలి అన్నాడు మిత్రుడు. అదెలా? అన్నాడు న్యాయాధికారి. వారు ఒక్కొక్క రొట్టెను మూడు ముక్కలు చేశారు. వాటిలో ఒక్కొక్కరు ఎనిమిది చొప్పున తిన్నారు. మూడు రొట్టెలున్న వాడి దగ్గరున్న రొట్టెలు తొమ్మిది ముక్కలైనాయి. వాటిలో అతడు ఎనిమిది తిని, ఒక దాన్ని మాత్రమే మూడవ వాడికి ఇచ్చాడు. కాబట్టి అతడికి ఒక నాణెమే రావాలి. రెండవ వాడి ఐదు రొట్టెలు పదిహేను ముక్కలైనాయి. అందులో అతడు ఎనిమిది ముక్కలు తీసుకుని, ఏడు ముక్కలు మూడవ వాడికి ఇచ్చాడు. కాబట్టి అతడికి ఏడు బంగారు నాణాలు రావాలి అని చెప్పాడు. ఇదే నిర్ణయాన్ని చెప్పాడు న్యాయాధికారి మరునాడు.

కాబట్టి మన లెక్క వేరు. మనంచేసినపని చిన్నదైనా సరే చాలా గొప్పగా లెక్క వేసుకుంటాం. కాని భగవంతుడి దృష్టిలో అలా ఉండదు. **మన దగ్గర ఉన్నదాన్లో ఎంత భాగం దానం ఇచ్చామో అంత వరకే మనకి దానఫలితం వస్తుంది.**

# 27. కుంభమేళా

కుంభము అంటే కుండ లేదా పాత్ర. మేళా అంటే ఉత్సవము, మొత్తం మీద కుంభమేళా అంటే కుంభోత్సవము. మన దేశంలో పితృదేవతలకు తర్పణలు వదలటానికి, పుణ్యస్నానాలు ఆచరించటానికి ప్రత్యేకంగా కొన్ని రోజులు కేటాయించారు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు మరణించిన తల్లితండ్రులకు వారు మరణించిన తిథులలో సంవత్సరానికి ఒకసారి ఆబ్దీకం పెట్టి తర్పణలు వదలటం జరుగుతుంది. కాగా అన్ని కులాలవారు ప్రత్యేకమైన రోజులలో నదీతీరాన ఈ పిండప్రదానము చేసి తర్పణలు వదులుతారు. ఆ రోజులనే దక్షిణ భారతదేశంలో పుష్కరము అంటారు. పుష్కరము అనే మాటకు 12 అని అర్థం. రాసి చక్రంలో మేషం నుంచి మీనం వరకు 12 రాసులుంటాయి. గురువు సంవత్సరానికి ఒక రాసి మారుతుంటాడు. అలా గురువు రాసి మారినప్పుడల్లా ఏదో ఒక నదికి పుష్కరం వస్తుంది.

బృహస్పతి ఏ రాసిలో ఉన్నప్పుడు ఏ నదికి పుష్కరం వస్తుందో చూడండి.

| | | |
|---|---|---|
| మేషరాశి | – | గంగానది |
| వృషభరాశి | – | నర్మదానది, రేవానది |
| మిధునరాశి | – | సరస్వతీనది |
| కర్కాటకరాశి | – | యమునానది |
| సింహరాశి | – | గోదావరినది |
| కన్యారాశి | – | కృష్ణానది |
| తులారాశి | – | కావేరీనది |
| వృశ్చికరాశి | – | భీమానది, తామ్రపర్ణి |
| ధనుర్రాశి | – | పుష్కరవాహిని |
| మకరరాశి | – | తుంగభద్రానది |
| కుంభరాశి | – | సింధునది |
| మీనరాశి | – | ప్రణీతానది |

అలా ఒక్కొక్క సంవత్సరము ఒక్కొక్కనదికి పుష్కరాలు వస్తాయి. ఆ సమయంలో, ఆ నదీతీరాన పితృదేవతలకు పిండప్రదానం చేసి, నదిలో పుణ్యస్నానాలు చేస్తారు.

ఈ పుష్కరము 12 సం॥కు ఒకసారి వస్తుంది. 12 రోజులపాటు ఈ కార్యక్రమం జరుగుతుంది. ఉత్తర భారతదేశంలో వచ్చే కుంభమేళా మన పుష్కరం లాంటిదే. అయితే ఈ రెండింటి మధ్య నా చిన్న తేడా ఉంది. పుష్కరమనేది కేవలము గురుగ్రహ గమనాన్ని అనుసరించి ఉంటుంది. కాగా కుంభమేళాకు గురుగ్రహంతో పాటుగ చంద్ర, సూర్యగ్రహాల గమనాన్ని కూడా లెక్కలోకి తీసుకుంటారు. ఉత్తర భారతంలో ప్రయాగ, హరిద్వార్, ఉజ్జయినీ, నాసిక్ మొత్తం నాలుగుచోట్ల ఈ కుంభమేళా జరుగుతుంది. వీటిలో ప్రయాగలో జరిగే కుంభమేళా ప్రసిద్ధి గాంచినది.

**ప్రయాగలో కుంభమేళా నిర్ణయం :**

స్కాందపురాణం ప్రకారం గురువు మేషంలో ఉండగా, రవిచంద్రులు మకరంలో ఉన్నప్పుడు కుంభమేళా ప్రారంభమవుతుంది. రవి చంద్రులు కలిసి ఉంటే అమావాస్య అవుతుంది. కాబట్టి కుంభమేళా అమావాస్య రోజున ప్రారంభమవుతుంది. సూర్యుడు మకరంలోకి జనవరి 14న వస్తాడు. అదే మకర సంక్రమణం. కాబట్టి మకర సంక్రమణం జరిగిన తరువాత, జనవరిలోనే కుంభమేళా ప్రారంభమవుతుంది. 14-1-2013న ప్రయాగలో కుంభమేళా ప్రారంభమైంది. ఇలాగే హరిద్వారు, నాసిక్, ఉజ్జయినీలలో కూడా కుంభమేళా జరుగుతుంది.

కుంభమేళా ప్రతి మూడు సంవత్సరాలకు ఒకసారి ప్రయాగ, హరిద్వారు, నాసిక్, ఉజ్జయినీలతో జరుగుతుంది. ప్రయాగలో కుంభమేళా ప్రారంభమై, మూడు సంవత్సరాలకు ఒకచోట చొప్పున జరుగుతుంది. ఇలా వరుసగా నాలుగు ప్రదేశాల లోను మేళా పూర్తయి 12 సంవత్సరాలయ్యేటప్పటికి తిరిగి ప్రయాగలో జరుగుతుంది.

కుంభమేళా ప్రతి పన్నెండు సంవత్సరాలకు పైన చెప్పిన ప్రాంతాలలో ఒకచోట జరుగుతుంది అన్నాం. ఇలా జరగాలని పురాణాలు చెబుతున్నాయి. 144 సంవత్సరాలకు ఒకసారి జరిగే దాన్ని **మహాకుంభ మేళా** అంటారు. ఈ రెండింటికీ శాస్త్ర ప్రామాణికత కూడా ఉంది. అయితే ఉత్తర భారతంలోని సాధు సంతులు చాలా కాలం క్రితం సమావేశమై, ఆరు సంవత్సరాలకు ఒకసారి కుంభమేళా జరగాలని నిర్ణయించారు. దీన్ని **అర్ధ కుంభమేళా** అంటారు. కుంభమేళాకు ఉన్న ప్రాముఖ్యత అర్ధ కుంభమేళాకు లేదు. ఇది శాస్త్ర ప్రమాణం కాదు. అర్ధ కుంభమేళా హరిద్వారు, ప్రయాగలలో మాత్రమే జరుగుతుంది. 14-1-2013లో ప్రయాగలో కుంభమేళా ప్రారంభమైంది. సరిగ్గా ఆరు సంవత్సరాలు పూర్తయ్యేసరికి ప్రయాగలో

అర్ధకుంభమేళా 2019 జనవరి 15న ప్రారంభమైంది. అర్ధకుంభమేళాకు గ్రహ గతులతో సంబంధం లేదు.

**కుంభమేళా ఎందుకు జరుగుతుంది ?**

క్షీరసాగరమథనం జరిగినప్పుడు ముందుగా హాలాహలం వచ్చింది. ఆ తరువాత కామధేనువు, కల్పవృక్షము, చివరకు అమృతము ఆవిర్భవించాయి. ఈ అమృతం కోసం దేవదానవులు 12 రోజులపాటు యుద్ధం చేశారు. దేవమానం ప్రకారం దేవతలకు ఒకరోజు అంటే మానవులకు, ఒక సంవత్సరం. ఈ పన్నెండు రోజులలోను 4 రోజులు మానవులకు, 8 రోజులు దేవతలకు కేటాయించబడ్డాయి. మానవులకు కేటాయించబడిన 4 రోజులు అంటే నాలుగు సంవత్సరాలు కాబట్టి, ఒక్కొక్క సంవత్సరము ఒక్కొక్క చోటగా, ఈ నాలుగు చోట్ల కుంభమేళా నిర్వహించటం జరుగుతుంది. ఇది 3 సం॥ ఒకసారి జరుగుతుంది.

పాలకడలి నుంచి ఆవిర్భవించిన అమృతం కోసం దేవదానవులు యుద్ధం చేస్తున్న సమయంలో అమృతభాండాన్ని సూర్యుడు, చంద్రుడు, గురువు, శని జాగ్రత్తగా రక్షించారు ఇందులో

1. చంద్రుడు – అమృతం భాండం నుంచి బయటకు వలికి పోకుండా కాపాడాడు.
2. సూర్యుడు – అమృతభాండం పగిలిపోకుండా రక్షించాడు
3. బృహస్పతి – అమృత భాండాన్ని రాక్షసులు ఎత్తుకు పోకుండా కాపలా కాశాడు.
4. శని – ఇతరులెవరివల్లా అమృతభాండానికి ఆపద రాకుండా రక్షించాడు.

ఈ గ్రహాలు అమృతభాండాన్ని రక్షించిన సమయంలో ఉన్న గ్రహాల స్థితిగతులు మళ్ళీ ఏర్పడినప్పుడు కుంభమేళ జరుగుతుంది.

శ్రీమహావిష్ణువు మోహినీ రూపం ధరించి అమృతభాండాన్ని తీసుకుని దేవదానవులకు పంచటానికి వచ్చాడు. ఆ సమయంలో భాండం నుంచి నాలుగు చుక్కలు వలికి భూమిమీద పడ్డాయి. అలా అమృతం పడిన ప్రదేశాలు 1.ప్రయాగ 2.హరిద్వార్ 3.నాసిక్ 4.ఉజ్జయిని. ఇవి పవిత్రమైన ప్రదేశాలు. అమృతం పడటం వల్ల పరమ పవిత్రమైనాయి. అందుకే ఈ నాలుగు చోట్లా కుంభమేళా జరుగుతుంది.

**ప్రయాగ :** క్షేత్రాలన్నింటిలోను ప్రయాగ చాలా శ్రేష్ఠమైనది. నక్షత్రాలలో చంద్రుడు ఎలా శ్రేష్ఠమో, అలాగే క్షేత్రాలలో ప్రయాగ శ్రేష్ఠమైనది. అని పద్మపురాణం చెబుతోంది. ప్రయాగలోని అక్షయవట దర్శనం చేస్తే బ్రహ్మహత్యా పాతకం కూడా నశించి పోతుంది.

ప్రయాగ తీర్థాన్ని 60 వేలమంది ధనుర్ధారులు రక్షిస్తుంటారు. గంగానదిని సూర్యభగవానుడు రక్షిస్తాడు.

యమునా నదిని ఇంద్రుడు రక్షిస్తుంటాడు. అని మత్స్యపురాణం చెబుతోంది.

ప్రయాగ గంగ, యమున, సరస్వతీ నదుల సంగమక్షేత్రం. అక్కడ స్నాన మాచరించటం పుణ్యప్రదం. అందులోను మాఘమాసంలో ప్రయాగలో స్నానం చేస్తే అపరిమితమైన ఫలితం వస్తుందంటోంది నారదపురాణం.

**ప్రయాగలో స్నానఫలం :** కుంభమేళా జరిగే సమయంలో ప్రయాగలో స్నాన మాచరించటం అత్యంత ఫలప్రదం. **స్కాందపురాణంలో**

**అశ్వమేధ సహస్రాణి వాజపేయ శతానిచ ।**
**లక్షం ప్రదక్షిణా భూమేః కుంభస్నానేన తత్ఫలం ॥**

వెయ్యి అశ్వమేధ యాగాలు, వంద వాజపేయాలు, లక్ష భూప్రదక్షిణాలు చేసిన ఫలితం ఒకసారి కుంభస్నానం చేస్తే వస్తుంది.

**సహస్రం కార్తికే స్నానం । మాఘే స్నాన శతానిచ**
**వైశాఖే నర్మదాకోటిః । కుంభ స్నానేన తత్ఫలం ॥**

ఒకసారి కుంభ స్నానం చేస్తే వెయ్యి కార్తీకస్నానాలు, వంద మాఘస్నానాలు గంగలో చేసిన ఫలితం వస్తుంది. నర్మదానదిలో కోటి వైశాఖస్నానాలు చేసిన ఫలితం వస్తుంది.

ఈ రోజులలో ఇక్కడ పిత్రుదేవతలకు పిండప్రదానం చేసి పుణ్య స్నానాలు ఆచరిస్తారు. ఇక్కడికి మన దేశం నుంచే గాక విదేశాల నుంచి కూడా యాత్రికులు వస్తారు. **ఇది పెద్ద మతపరమైన సాంస్కృతిక సమ్మేళనముగా యునెస్కో గుర్తించింది.**

కుంభమేళా సుమారు 45 రోజులపాటు జరుగుతుంది. 2019లో జరిగే ఈ మేళాకి 12 నుంచి 13 కోట్ల మంది వస్తారని ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం అంచనా వేసింది. ఇక్కడ జరిగే కుంభమేళాకి దేశంలో ఉన్న సాధు, సంతులందరూ తప్పక

వస్తారు. వీరిలో **నాగసాధువులు** ప్రత్యేకం. వీరు పూర్తిగా దిగంబరులు. శీతాకాలంలో కూడా బట్టలు ధరించరు. వళ్ళంతా బూడిద పూసుకుంటారు. ఒంటిపూట భోజనమే చేస్తారు. నిరంతరము జపతపాలు, ఆధ్యాత్మిక ప్రవచనాలలో మునిగి తేలుతుంటారు. వీరు ఎక్కడి నుంచి వస్తారో తెలియదు. కుంభమేళా జరిగినన్ని రోజులు అక్కడే ఉంటారు. మేళా పూర్తయిన తరువాత మళ్ళీ ఎక్కడికి వెడతారో తెలియదు.

ఎవరికీ కనపడరు. కుంభమేళా జరిగే సమయంలో ఒకేసారి లక్షలాది నాగ సాధవులు ప్రత్యక్షమవుతారు. వీరు మామూలు ప్రపంచానికి దూరంగా హిమాలయ పర్వతాల్లో, కొండ గుహల్లో, నదీతీరాల్లో ఉంటారు. మామూలు రోజుల్లో వీరిని చూసిన వారు ఎవరూ లేరు. హిమాలయాల నుంచి కుంభమేళా జరిగే ప్రదేశం కొన్ని వందల కిలోమీటర్ల దూరంలో ఉంటుంది. లక్షలమంది సాధువులు ఒకేసారి వస్తే రోడ్డుమీద ట్రాఫిక్ స్తంభించి పోవాలి. కాని ఎక్కడా అలా ట్రాఫిక్ స్తంభించిన దాఖలాలు గాని, రోడ్డుమీద వస్తుండగా వీరిని చూసినవారు గాని ఇంతవరకు ఎవరూ లేరు. పోనీ వీరంతా రైళ్ళతోనో, విమానాల్లోనో ప్రయాణించారా? అంటే అటువంటి సాక్ష్యాలు కూడా లేవు. మరి అంతమంది ఒకేసారి ఎలా ప్రత్యక్షమయ్యారు? తిరుగు ప్రయాణంలో కూడా ఒక కిలోమీటరు వరకు కన్పించి హటాత్తుగా మాయం అయిపోతారు. కుంభమేళాలో తప్ప వారు ఇంకెక్కడా, ఎప్పుడూ కన్పించరు, ఎందుకని?

వీటన్నింటి సమాధానం ఒకటే. వారికి సూక్ష్మశరీరయానం ఉన్నది. అంటే స్థూలదేహంతో కాకుండా సూక్ష్మ దేహంతో వారు ప్రయాణం చేస్తారు. ఇదే వాళ్ళ ప్రయాణ సాధనం. అందుకే వారు ఎవరికీ కన్పించరు. ఇది సత్యం. కళ్ళ ఎదురుగా కనిపిస్తున్న నగ్న సత్యం. నాగసాధువులు సూక్ష్మశరీరంతో ప్రయాణం చేసారనేది నగ్నసత్యం. మన దౌర్భాగ్యం ఏమంటే మనదగ్గర ఉన్న విషయాలను మనం నమ్మం. అమెరికా వారు చెబితేనే నమ్ముతాం. నీ తల్లి పతివ్రత, నీ భార్య పతివ్రత అనే విషయం కూడా అమెరికా వారు నిర్ధారిస్తేనే నమ్ముతాం. ఇది మన దౌర్భాగ్య స్థితి.

సైన్సు బాగా అభివృద్ధి చెందిన ఈ రోజుల్లో బహుళ ప్రచారం పొందినది నానో టెక్నాలజీ, అంటే అతీంద్రియ శక్తులన్న మాట. దీనిమీద పాశ్చాత్య దేశాలు లక్షల కోట్లు ఖర్చుపెట్టి పరిశోధనలు చేస్తున్నారు. ఈ టెక్నాలజీ కొన్నివేల సంవత్సరాల క్రితమే మన దేశంలో ఉంది. ఇప్పటికి కూడా అది హిమాలయాల్లో సజీవంగా

ఉంది. గతంలో మన ఋషీశ్వరులు చేసిన తపస్సునే ఇప్పుడు ధ్యానం అంటున్నాం. ధ్యానం వల్ల అనేక శక్తులు వస్తాయి. అందులో ఒకటి సూక్ష్మ శరీర యానం. ఇది నానో టెక్నాలజీలో అడ్వాన్స్‌డే స్టేజి.

పూర్వకాలంలో ఋషీశ్వరులు కోరుకున్న వెంటనే ఎక్కడికి కావాలంటే అక్కడికి వెళ్ళిపోయే వారు. త్రిలోక సంచారి అయిన నారదుడు ఉపయోగించింది ఇదే. ఎక్కడో సుదూర ప్రాంతాలలో ఉండే సాధువులు కుంభమేళా సమయంలో ఇక్కడికి రావటానికి, మళ్ళీ ఇక్కడి నుండి వారుండే ప్రదేశానికి వెళ్ళటానికి ఉపయోగించేదే **నానో టెక్నాలజీలోని అతిముఖ్యమైన సూక్ష్మ శరీర యానం.**

కుంభమేళా సాధువుల స్నానాలతోనే మొదలవుతుంది. ఎప్పుడు ఎక్కడ కుంభమేళా జరిగినా సాధువులు మొదటగా స్నానం చెయ్యటం ఆనవాయతీ.

సాధువులంతా **అఖాడా**లలో ఉంటారంటారు. అఖాడా అంటే మల్లయుద్ధ వేదిక. దీన్నే **గోదా** అంటారు. మన దేశంలో ఇలాటి అఖాడాలు 13 చోట్ల ఉన్నాయి.

1. **జూనా అఖాడా :** దీని ప్రధాన కార్యాలయం కాశీలో ఉంది. ఇందులో సుమారు 4 లక్షల మంది సాధువులుంటారు. వీరికి ఇష్టదైవం దత్తాత్రేయుడు. ఈ సాధువులలో స్త్రీలు కూడా ఉన్నారు.
2. **అటల్ అఖాడా :** దీని ప్రధాన కార్యాలయం కాశీ. ఇక్కడ 7 వందల మంది సాధువులున్నారు. ఇక్కడ మహిళలుండరు. వీరి దగ్గర 2 జండాలుంటాయి. 1. ధర్మధ్వజం 2.పర్వధ్వజం. కుంభమేళాలో ధర్మధ్వజంతో ప్రవేశించి, పర్వ ధ్వజంతో స్నానం చేస్తారు.
3. **ఆనంద్ అఖాడా :** ఇది కాశీలో ఉంది. వీరి ఇష్టదైవం సూర్యుడు.
4. **ఆహ్వాన్ అఖాడా :** ఇది కూడా కాశీలోనే ఉంది. ఇందులో 12 వేల మంది సాధువులున్నారు. వీరి ఇష్టదైవం గణపతి.
5. **నిరంజనీ అఖాడా :** ఇది ప్రయాగలో ఉంది. ఇందులో 10 వేల మంది సాధువులున్నారు.
6. **మహానిర్వాణీ అఖాడా :** ఇది కూడా ప్రయాగలోనే ఉంది. ఇందులో 6 వేల మంది సాధువులున్నారు.
7. **పంచాగ్ని అఖాడా :** ఇది కాశీలో ఉంది. ఇందులో 3 వేలమంది సాధువులున్నారు.

8. **దిగంబర అఖాడా :** ఇందులో స్త్రీలు ఉండరు.

9. **నిర్మోహి అఖాడా :** ఇందులో 15 వేల మంది సాధువులున్నారు.

10. **నిర్వాణీ అఖాడా :** ఇది అయోధ్యలో ఉంది. వీరు ఊర్ధ్వత్రిపుండ్రాలు ధరిస్తారు.

11. **పంచాయతీ బడా ఉదాసీన్ అఖాడా :** ఇది ప్రయాగలో ఉంది. ఇందులో 12 వేల మంది సాధువులున్నారు.

12. **పంచాయతీనయా ఉదాసీన్ అఖాడా :** ఇది హరిద్వార్‌లో ఉంది. ఇందులో 5 వేల మంది సాధువులున్నారు.

13. **నిర్మల్ అఖాడా :** ఇది హరిద్వార్‌లో ఉంది. ఇందులో స్త్రీలు ఉండరు.

ఈ అఖాడాలు ఎక్కువగా కాశీ, ప్రయాగలలోనే ఉన్నాయి.

సాధు సంతులంతా స్నానాలు చేసిన తరువాతనే కుంభమేళాలో మిగిలిన వారు స్నానాలాచరించాలి. ఈ సంవత్సరం 15-7-2019 నుంచి కుంభమేళా ప్రారంభమయి 4-3-2019 మహా శివరాత్రి వరకు కొనసాగుతుంది. అంటే మొత్తం కుంభమేళా 49 రోజులుంటుంది. ఇందులో

| | | |
|---|---|---|
| 15-01-2019 | - | మకర సంక్రమణం |
| 21-01-2019 | - | పుష్య పూర్ణిమ |
| 04-01-2019 | - | మౌని అమావాస్య (పుష్య అమావాస్య) |
| 10-02-2019 | - | వసంత పంచమి |
| 19-02-2019 | - | మాఘ పూర్ణిమ |
| 04-03-2019 | - | మహాశివరాత్రి |

ఈ రోజులలో విశేష స్నానాలుంటాయి. కుంభమేళా ప్రపంచం మొత్తంలోనే అతిపెద్దదయిన మతపరమైన సాంస్కృతిక ఉత్సవం కాబట్టి అత్యంత పుణ్యప్రదాయక మైన కుంభమేళాలో జీవితంలో ఒకసారైనా స్నానం చేసి తరించండి.

## 28. సరదాగా - పని

మనం అనేక పనులు చేస్తుంటాం. వాటిలో కొన్ని తప్పసరి. కొన్ని అవసరం కోసం చేసేవి. ఇంకొకరి కోసం చేసేవి. దైనందిన జీవితంలో చేసే పనులు మనం జీవించటం కోసం తప్పనిసరిగా చెయ్యాలి. తినటం, త్రాగటం, నడవటం,

మాట్లాడటం, నిద్ర పోవటం వంటివి. అందుకే ఆహార నిద్రా భయ మైధునాలు అనేవి అన్ని జీవులకు తప్పనిసరిగా ఉంటాయి. జీవులు ఆ పనులు తప్పనిసరిగా చేస్తాయి. జీవించటం కోసం కొన్ని పనులు చేస్తాం. భార్యఆనందంకోసం, పిల్లల ఆనందంకోసం కొన్ని పనులు చేస్తాం. వెనకటికి ఒకాయన చెప్పాడు చూడండి. 'సూరిబావ కళ్ళలో ఆనదం చూడటం కోసం ఈ హత్య చేశాను' అని. వీటన్నింటినీ ప్రక్కన పెడితే కేవలం, సరదాగా కొన్ని పనులు చేస్తాం. ఈ పనులు చెయ్యకపోతే నష్టము లేదు. చేస్తే లాభము రాదు. కేవలం ఊసుపోక ఇటువంటి పనులు చేస్తాం. వీటివల్ల వచ్చే ఫలితం మంచి కావచ్చు చెడు కావచ్చు. ఒక్కోసారి ఏ రకమైన ఫలితము ఉండకనుపోవచ్చు.

మహా భారతంలో దుర్వాస మహర్షికి సపర్యలు చేసింది కుంతి. ఆమె చేసిన సపర్యలకు మెచ్చి ఒక మంత్రం చెప్పి, ఆ మంత్రం జపించి ఏ దేవతను తలచుకుంటే ఆ దేవత ప్రత్యక్షమవుతుంది అని చెప్పి వెళ్ళిపోయాడు మహర్షి. ఆ మంత్రం నిజంగానే పని చేస్తుందా లేదా పరీక్షించాలి అనుకుంది. ప్రొద్దున్నే ఉదయిస్తున్న సూర్యుణ్ణి చూసి ఆ మంత్రం జపించింది. ఇందులో ఆవిడకు ఏ కోరిక లేదు. ఏ ఆలోచనా అంతకన్నా లేదు. కేవలం మహర్షి చెప్పినట్లుగా మంత్రం పని చేస్తుందా? లేదా? చూడాలి. అంతే, మంత్రజపం చేసి సూర్యుణ్ణి తలచుకోగానే సూర్యభగవానుడు ప్రత్యక్షమైనాడు. ఏం కావాలి? అని అడిగాడు ఏమీ అవసరంలేదు అంది కుంతి. కాని వచ్చిన సూర్యుడు ఊరికే వెళ్ళిపోలా. కర్ణుణ్ణి ప్రసాదించి వెళ్ళాడు. తరువాత కాలంలో కర్ణుడు అంగరాజైనాడు. దుర్యోధనుడికి మంచి మిత్రుడైనాడు. మహాభారత యుద్ధానికి కారణమైనాడు. నిశితంగా పరిశీలిస్తే అంత **పెద్ద కురుక్షేత్ర మహా సంగ్రామానికి కారణం కేవలం కుంతీదేవి అనాలోచితంగా, సరదాగా చేసిన పని.**

పూర్వకాలంలో హిమాలయ ప్రాంతంలో ఒక చాతక పక్షి ఉండేది. ఒకరోజు అది ఆహారం కోసం వెతుకుతూ కాశీనగరం వచ్చేసింది. విశాలాక్షి అమ్మవారి దేవాలయంలో ప్రవేశించింది. ఆహారం కోసం వెతుకుతూ దేవాలయ ప్రాంగణమంతా ప్రదక్షిణలు చేసింది. ఆ రోజు మహాశివరాత్రి. ఆ పక్షికి ఆహారం దొరకలా. దాంతో ఉపవాసం ఉండిపోయింది. ఇదంతా అనాలోచితంగా జరిగిందే. అలా గుడిలో ప్రదక్షిణలు చేస్తూ చేస్తూ, ఓపిక నశించి క్రింద పడి చచ్చిపోయింది. మహాశివరాత్రి పర్వదినాన ఉపవాసం ఉండి, గుడిలో ప్రదక్షిణలు చేసి ప్రాణాలు వదిలిన కారణంగా మరుజన్మలో కాశీరాజై జన్మించింది. ఇదంతా అనాలోచితంగా చేసినపనే.

మేం చదువుకునే రోజుల్లో మధ్యప్రదేశ్‌లోని సాగర్ యూనివర్శిటీలో విద్యార్థుల మధ్య ఒక చిన్న పోటీ వచ్చింది. కుంపటి మీద మరగకాగుతున్న టీని ఎవరు ఎన్ని కప్పులు త్రాగగలరు? ఈ పోటీలో ఎక్కువ కప్పులు త్రాగిన వారికి వంద రూపాయలు బహుమానం. కప్పుదించకుండా, ఒకటి తరువాత ఒకటిగా టీ త్రాగెయ్యాలి. అందరూ విద్యార్థులు. యువకులు. యువరక్తం బాగా వేడెక్కింది కుంపటి మీది టీ తాగాలనే, పోటీ ప్రారంభమైంది. అందులో ఒకతను ఇరవై కప్పులు టీ త్రాగాడు. అయితే రెండవతను ఇరవై ఒకటవ కప్పు టీ కూడా త్రాగి విజయపథంలో పయనించాడు. వంద రూపాయలు గెల్చుకున్నాడు కాని పోటీ గెలిచిన మరుక్షణంలోనే స్పృహ తప్పి పడిపోయాడు. వైద్యుడి దగ్గరకు తీసుకువెళ్లారు. పరీక్షలు చేసి పొట్టలోని ప్రేగులు అన్నీ మాడిపోయినాయి. బ్రతకటం కష్టం అని చెప్పారు. అనుకున్నట్లుగానే క్రొద్ది గంటలలోనే అతడు మరణించాడు. ఇది కేవలం సరదాగాకాచిన పందెంవల్ల వచ్చిన ఫలితం.

ఒక రాజకీయ నాయకుడి కుమారుడు తండ్రి ఊళ్ళో లేని సమయంలో కారు తీసుకుని స్నేహితులను ఎక్కించుకుని బయల్దేరాడు. చాలా వేగంగా వెడుతున్నాడు. వేగం ఇంకా పెంచాడు, అమితమైన వేగం 170, 180 కి.మీ. వేగంతో వెడుతూ, అదుపు తప్పి డివైడరును గుద్దేశాడు. ఆ దెబ్బకి కారు తలుపు ఊడి అవతల పడింది. డ్రైవరు పక్కనున్న వాడు ఒక ఫొటో గ్రాఫరు. ఇతడికి మంచి స్నేహితుడు. అతడు కూడా కార్లోంచి ఎగిరిపడ్డాడు. రోడ్డు ప్రక్కనే ఉన్న రాయికి అతడి తల బలంగా తగిలింది. అంతే మరుక్షణంలో తలప్రముక్కలై పోయింది. కేవలం సరదాగా చేసిన పని ఫలితం చూడండి. అతడు అక్కడే మరణించాడు.

ఈ మధ్యనే జరిగిన సంఘటన. **మెల్‌బోర్న్** నగరంలో రాత్రిపూట భోజనం చేసిన భర్త బెడ్‌రూమ్‌లోకి వెళ్ళాడు. గదిలో చిన్న లైటు వెలుగుతోంది. ఆ కాంతిలో తను పడుకునే పరుపు మీద నల్లటి పొడవాటి పాములు రెండు కనిపించాయి. దాంతో ఖంగు తిన్నాడు. చప్పుడు చేయకుండా గదిలో ఒక మూలనున్న బేస్ బాల్ బ్యాట్ తీసుకుని బలంకొద్దీ రెండు దెబ్బలు వేశాడు. పెద్ద అరుపు వినిపించింది. సందేహం లేదు. పాములు మానవభాషలో మాట్లాడుతున్నాయి. ఇవి చాలా భయంకరమైన శక్తిగల విషపూరితమైనవి. పిశాచలక్షణాలు ఎక్కువ. అనుకుని బలంగా ఇంకో దెబ్బ వెయ్యబోయాడు. 'నేను-నేను' అన్న మాటలు వినిపించాయి. నిదానించి చూస్తే, తన భార్య మరి ఈ పాములేమిటి?

మధ్యాహ్నం తన భార్య ఒక షాపింగ్ మాల్‌కు వెళ్ళింది. అక్కడ మేజోళ్ళు చూసింది చాలా విచిత్రంగా ఉన్నాయి. వాటిమీద పాము బొమ్మలు ముద్రించబడి ఉన్నాయి. అసలు పాములను మరిపిస్తాయి. ముచ్చట పడికొన్నది. ఇంటికొచ్చిన తరువాత, తన భర్తకు ఈ విషయం చెప్పి అతణ్ణి ఆశ్చర్యపరచాలనే ఉద్దేశ్యంతో తన శరీరమంతా దుప్పటి కప్పుకుని కాళ్ళకి మాత్రం మేజోళ్ళు వేసుకుని పడుకుంది. బెడ్‌రూమ్‌లోకి వచ్చిన భర్తకి అవి నిజమైన పాములనిపించి బ్యాటుతో కొట్టాడు. ఆ దెబ్బకి భార్య కాళ్ళు విరిగాయి. సరదా ఎంత పనిచేసిందో చూడండి.

కాబట్టి పిల్లలు పెద్దలు ఎవరైనా సరే **పనిచేసే ముందు పూర్వాపరాలు ఆలోచించి పని చెయ్యండి. లేకపోతే ఫలితం. ఇలాగే ఉంటుంది. దేన్నీ తేలికగా తీసుకొనకండి.** ఒకసారికి నాలుగు సార్లు ఆలోచించి మరీ పని చెయ్యండి.

## 29. స్వభావం

ప్రతిమనిషి సహజమైన లక్షణం ఒకటి ఉంటుంది. దాన్నే స్వభావం అంటారు. ఇది పుట్టుకతో వచ్చింది. అంటే పూర్వజన్మ కృతమన్న మాట. గతజన్మలలో చేసిన (పనుల) కర్మల తాలూకు ఫలితమిది. సామాన్యంగా ఇది మారదు. **పుట్టుకతో వచ్చిన బుద్ధి పుడకలతోనే పోతుంది** అంటారు. మరణించేదాకా ఈ లక్షణం ఇలాగే ఉంటుంది. కొంత మంది మంచిగా ఆలోచిస్తారు. అవతల వారు తమకు చెడు చేసినా అదికూడా మంచిదే అంటారు. అది వారి స్వభావం. మరికొంతమంది అవతలి వారు తమకు మేలు చేసినా అందులో ఏదో దురాలోచన ఉన్నది అనే భావిస్తారు. మహాభారతంలో ఒకసారి భీష్ముడు ధర్మారాజును పిలిచి లోకంలో చెడ్డవాళ్ళు, దుర్మార్గులు ఎంతమంది ఉన్నారో లెక్కపెట్టిరా అన్నాడు. కొద్దిరోజుల తరువాత ధర్మరాజు తిరిగి వచ్చి తాతగారూ లోకంలో చెడ్డవాళ్ళు, దుర్మార్గులు అనేవారు ఎవ్వరూ లేరు. అందరూ మంచివాళ్ళే అన్నాడట. ఇప్పుడు భీష్ముడు దుర్యోధనుణ్ణి పిలిచి లోకంలో మంచివాళ్ళు ఎంతమంది ఉన్నారో లెక్కపెట్టి చెప్పు అన్నాడు. కొద్దిరోజుల తరువాత దుర్యోధనుడు తిరిగివచ్చి పితామహా ! లోకంలో అందరూ దుర్మార్గులు, అహంకారులే. మంచివాళ్ళు అసలు లేనే లేరు. అన్నాడట. ఇక్కడ చూడండి. మానవులకు వారికి ఉండే సహజమైన స్వభావాన్ని బట్టి లక్షణాన్ని బట్టి ఇతరులు కూడా కనిపిస్తుంటారు. మంచివారికి అందరూ మంచివారులాగానే కనిపిస్తారు. చెడ్డవాళ్ళకి అందరూ చెడ్డవాళ్ళు లాగానే కనిపిస్తారు. ఇది సహజ

సిద్ధమైన స్వభావం. ఈ స్వభావం ఇలాగే ఉంటుంది. అది ఒక గ్రామం. వర్షాకాలం. వానలు బాగా కురిశాయి. వాన నీరు రహదారులమీద కూడా ప్రవహిస్తోంది. ఒక సన్యాసి కాలవవద్దు నుంచి పోతున్నాడు. బయట నీరు కాలవలోకి వస్తోంది. ఒడ్డున ఒక తేలు పోతోంది. నీటి వరవడికి తట్టుకోలేక తేలు నీటిలో కొట్టుకుపోతోంది చూశాడు సన్యాసి. పాపం అనుకున్నాడు జాలి పడ్డాడు వెంటనే ఆ తేలును పట్టుకుని ఒడ్డున పడేశాడు. అతడి చేతిలోంచి బయట పడగానే తేలు అతణ్ణి కుట్టింది. సన్యాసికి తేలు విషం ఎక్కి బాధ కలిగింది. అలా కుట్టిన తేలు మళ్ళీ నీటివైపు వెళ్ళి ప్రవాహంలో కొట్టుకుపోతోంది. ఈ సన్యాసి మళ్ళీ దాన్ని బయటకు తీవాడు. అది మళ్ళీ అతణ్ణి కుట్టి ప్రవాహం వైపు వెళ్ళి, అందులో కొట్టుకుపోతోంది. సన్యాసి మళ్ళీ దాన్ని రక్షించాడు. అది మళ్ళీ కుట్టింది. ఇలా చాలాసార్లు జరిగింది. దారిన పోయే ఒకరైతు ఇదంతా గమనించి ఆ సన్యాసితో "స్వామీ ! అది తేలు. కుడుతుంది. అది కుడితే విషమెక్కి భరించలేని బాధ కలుగుతుంది. నువ్వేమో దాన్ని రక్షిస్తున్నావు. అదేమో నిన్ను కుడుతోంది. ఎందుకొచ్చిన పని ఇది? ఒక్క దెబ్బ వేస్తే చచ్చి ఊరుకుంటుంది కదా?" అన్నాడు. అప్పుడు ఆ సన్యాసి "లేదు నాయనా ! అది తేలు. కుట్టటం దాని స్వభావం. నేను సన్యాసిని. పదిమందికీ ఉపయోగించే మంచి పనులు చెయ్యటం నా స్వభావం. ఈ తేలు తన స్వభావాన్ని వదులుకోకుండా, చావబోతూ కూడా నన్ను కుడుతోంది. అంటే మరణ సమయంలో కూడా తన స్వభావాన్ని వదులుకోలేదు. తేలు తన స్వభావాన్ని వదులుకోనప్పుడు నేను మాత్రం నా స్వభావాన్ని ఎందుకు వదులుకోవాలి?' అన్నాడు. అంటే సహజమైన స్వభావాన్ని ఎవరూ వదులుకోరు.

పూర్వ కాలంలో ఒక పెద్ద ఆసామి ఉండేవాడు. అతడు చాలా ధనవంతుడు. కుస్తీలంటే అతడికి చాలా ఇష్టం. ఎప్పుడూ నలుగురు సహిల్వాన్‌లను వెంటేసుకుని తిరుగుతుంటాడు. ఎవర్నీ లెక్క చెయ్యడు గౌరవించడు. ఆ ఊరిలోనే ఒక పెద్దాయన మంచి స్వభావం గలవాడు. పండితుడు, పదిమందికీ మేలు జరగాలని భావించే వాడు ఉండేవాడు. ఈయన వెనక ఎప్పుడూ కొంతమంది శిష్యగణం ఉండేది. ప్రతిరోజూ ఈ పండితుడు నదీ స్నానానికి వెడుతుంటే దారిలో ఆసామి ఎదురు వచ్చేవాడు. పండితుడు గౌరవంగా నమస్కారం అనేవాడు. ఆసామి ప్రతి నమస్కారం చెయ్యటం కాదు కదా, కనీసం ఇతణ్ణి చూసేవాడు కూడా కాదు. ప్రతిరోజు ఇలాగే

జరుగుతోంది. ఒకరోజున పండితుని ప్రక్కన ఉన్న శిష్యుడు 'గురువు గారూ ! ప్రతిరోజు మీరు అతడికి నమస్కారం చేస్తున్నారు. అతడు మాత్రం ప్రతి నమస్కారం చెయ్యకపోగా మిమ్మల్ని అవమానిస్తున్నాడు. అలాంటప్పుడు ఎందుకు అతడికి నమస్కరించటం? మానెయ్యొచ్చు కదా !' అన్నాడు. ఆ మాటలు విన్న పండితుడు "ఎదుటి వ్యక్తి ఎవరైనా సరే అతణ్ణి గౌరవించటం నా స్వభావం. అహంకారం అతని స్వభావం. అతని స్వభావం మారనప్పుడు నా స్వభావం మాత్రం ఎందుకు మారాలి?" అన్నాడు.

అయితే స్వభావం మారదా? అంటే మారుతుంది. దానికి తీవ్రమైన పరిశ్రమ చెయ్యాలి. ఈ పరిశ్రమ మనమైనా చెయ్యొచ్చు. ఇతరులు అంటే ప్రక్కవారు, కావలసిన వారు గురువులు ఎవరైనా చెయ్యవచ్చు. చిన్న ఉదాహరణ చూడండి. మన పరిసర ప్రాంతంలోనే ఒక వ్యక్తి ఉన్నాడు. చాలా కోపిష్టి దురుసు స్వభావం. ఎవరినీ లెక్క చెయ్యడు. ఎన్ని చెప్పినా అతడు మారడు. అతడుగా ఎవరినీ పలుకరించడు, ఇప్పుడు మీరే అతణ్ణి పలకరించండి. ప్రతిరోజు కనిపించనప్పుడల్లా నమస్కారం సార్. బాగున్నారా' అనండి. మొదట్లో అతడు మనల్ని పట్టించుకోడు. కాని రానురాను అలవాటు పడి అతడు కూడా ప్రతి నమస్కారం చేస్తాడు పలకరించినప్పుడు మాట్లాడతాడు. అదే అలవాటై పోతుంది. ఒక ఆఫీసులో సుబ్బారావు అనే బంట్రోతు ఉన్నాడు. అతడు ఏ పనీ చెయ్యడు. ఎవరి మాట వినడు. ఎవరికీ కనీసం మంచినీళ్ళు కూడా ఇవ్వడు. కాబట్టి ఎవరూ అతణ్ణి పలకరించరు. అతడికి పనిచెప్పరు. ఆఫీసుకి వెంకట్రావ్ అనే వ్యక్తి క్రొత్తగా వచ్చాడు ఆఫీసరు హోదాలో. అందర్నీ పరిచయం చేసుకున్నాడు. ఆఫీసులో వాళ్ళు సుబ్బారావు గురించి చెప్పారు. అతడి జోలికి మాత్రం వెళ్ళద్దు అని చెప్పారు. సరే అన్నాడు వెంకట్రావ్.

మధ్యాహ్నం లంచ్ టైమ్ కావస్తోంది. వెంకట్రావ్ సుబ్బారావుని పిలిచి 'నేను ఆఫీసుకు క్రొత్తగా వచ్చాను కదా. అందుకని అందరికీ లంచ్ ఇవాళ్ళ, నేనే ఇద్దామను కుంటున్నాను. ఏమంటావ్.' అన్నాడు. బానే ఉంది సార్ అన్నాడు సుబ్బారావ్. అయితే ఎక్కడ బాగుంటుంది? ఏమేమి ఆర్డరిద్దాం? అడిగాడు వెంకట్రావ్. కొంచెం సేపు ఆలోచించి కొన్ని పదార్థాలు చెప్పాడు సుబ్బారావ్. అయితే ఒక పనిచెయ్యి. ఈ వెయ్యి రూపాయలు తీసుకుని నువు అక్కడికి వెళ్ళి పదార్థాలు తిని చూడు. నీకు బాగున్నవి, నచ్చినవి ప్యాక్ చేయించి మిగిలిన వాళ్ళకి తీసుకుని రా. ముందు నువు తిన్న తరువాతే వాటిని ప్యాక్ చేయించుకురా డబ్బులు గురించి ఆలోచించద్దు.

కావాలంటే ఇంకొక ఐదువందలు తీసుకువెళ్ళు అన్నాడు వెంకట్రావ్. అలాగే అంటూ డబ్బులు తీసుకుని వెళ్ళిపోయాడు సుబ్బారావు. లంచ్ టైములో అందరూ వచ్చారు. సుబ్బారావే స్వయంగా పదార్థాలన్నీ తను ఎంత కష్టపడి సెలక్ట్ చేసి తీసుకువచ్చాడో వివరిస్తూ అందరికీ వడ్డించాడు. ఇప్పుడు ఆశ్చర్యపోవటం అందరి వంతు అయింది. ఇక్కడ చూడండి సుబ్బారావు స్వభావం ఎవరి మాటా వినకపోవటం. ఎవర్నీ లెక్క చెయ్యకపోవటం. కాని ఆ స్వభావం మారిపోయింది ఇంకొకరి వల్ల.

అలాగే తీవ్రమైన కృషి చేస్తే మన స్వభావాన్ని మనం మార్చుకోవచ్చు. దానికి విపరీతమైన పట్టుదల కావాలి. ఏమైనా సరే నేను మారాలి. ఈ పని చెయ్యాలి. అనే దృఢ నిశ్చయం ఉండాలి. అప్పుడు మాత్రమే మార్పు సాధ్యమవుతుంది.

ముఖ్యంగా ఆధ్యాత్మికంగా ఎదగాలన్నా, నైతిక విలువలు పెంపొందించు కోవాలన్నా, మనసును అదుపులో పెట్టుకోవాలన్నా తీవ్రమైన తపన, కృషి కావాలి. అవి ఉన్న మానవుడి స్వభావం ఎలాంటిదైనా మారుతుంది. తగిన వాతావరణం, పరిస్థితులు కల్పించుకుని దృఢదీక్షతో కూర్చుంటే ఎటువంటి మార్పైనా సంభవిస్తుంది. లేకపోతే పుట్టుకతో వచ్చిన స్వభావం పుడకలదాకా అలాగే ఉంటుంది.

## ౩౦. భగవద్గీత

మహాభారతంలో పాండవులు అరణ్యవాసము అజ్ఞాతవాసము పూర్తిచేసి తమ రాజ్యం తమకిమ్మని రాయబారం పంపారు. ముందుగా ధౌమ్యులవారు వెళ్ళారు. తరువాత శ్రీకృష్ణ భగవానుడు, మూడవది ఉలూక రాయబారం. యుద్ధం నిశ్చయమైంది. ఆరాత్రి పాండవులు భీష్మాచార్యుడి దగ్గరకు వెళ్ళి 'తాతా ! యుద్ధం చెయ్యటానికి అనుమతి ఇవ్వవలసింది' అని అడిగారు. విచిత్రం ఏమంటే యుద్ధం నిశ్చయమై పోయింది. కురు పితామహుడు. యావద్ సామ్రాజ్యానికి అధికారి. సర్వశాస్త్ర పారంగతుడు, వేదవేదాంగవిదుడు, ధర్మవేత్త, విశేషించి కౌరవుల సర్వసైన్యాధ్యక్షుడు, ఎదురులేని పరాక్రమవంతుడు. ఆయన మరణిస్తేనే గాని పాండవులు యుద్ధం గెలవరు. యుద్ధంలో గాంగేయుణ్ణి ఓడించటం జరిగే పనికాదు. అలా జరగాలంటే, గాంగేయుడు మరణించాలంటే ఆయన సహకారం ఉండి తీరాలి. అందుకే పాండవులు ఆ యుద్ధానికి ఆయన అనుమతి కోరారు. అంటే 'తాతా! నిన్ను చంపటానికి అనుమతి ఇవ్వవలసింది' అన్నారు. అలాగే అన్నాడు భీష్ముడు.

మరునాడు ఉదయం కురుపాండవ సైన్యాలు యుద్ధానికి మోహరించినాయి. అర్జునుడు సారథియైన కృష్ణునితో 'రెండు సేనల మధ్యకీ రథాన్ని పోనివ్వు' అన్నాడు. అలాగే చేశాడు శ్రీకృష్ణుడు. రెండు సేనా సమూహాలను తేరిపార చూశాడు అర్జునుడు. అదే కడసారి చూపు. ఇంక ఇటుగాని, అటుగాని యుద్ధం పూర్తయిన తరువాత ఎవరూ కనిపించరు. అందరూ మరణిస్తారు. ఎవరు వీళ్ళంతా? తనకు విద్య నేర్పిన గురువులు, అల్లారుముద్దుగా పెంచి ప్రయోజకుడుగా తీర్చిదిద్దిన తాత, తండ్రులు, సోదరులు, కుమారులు, మనవళ్ళు, బావలు, బావమరదలు, చుట్టాలు, పక్కాలు. కేవలం రాజ్యకాంక్షతో వీళ్ళందర్నీ చంపాలి. దారుణం ఇంతమంది ప్రాణాలు తియ్యటం నావల్ల కాదు అని నిశ్చయించుకున్నాడు. ధనుర్బాణాలు అవతల పడేశాడు యుద్ధం చెయ్యను అన్నాడు. అప్పుడు పరమాత్ముడు అర్జునుడికి కర్తవ్యాన్ని ఉపదేశించాడు. అదే గీత. సాక్షాత్తు భగవంతుడే చెప్పాడు కాబట్టి భగవద్గీత. 18 అధ్యాయాలు, 700 శ్లోకాలుగా ఉంది. ఈ విషయం అందరికీ తెలుసు. అయితే భగవద్గీతలో ఏముంది? దాని ప్రాముఖ్యత ఏమిటి? అనే విషయాలు చూద్దాం.

**భగవద్గీత అంటే ఏమిటి**? పదవీ విరమణ చేసిన తరువాత తీరుబడిగా కాలక్షేపం కోసం చదవాల్సిన పుస్తకమా? లేకపోతే రిటైరైనప్పుడు తోటి ఉద్యోగులు మనకిచ్చే బహుమతా? ఘంటసాల వారు పాడిన భగవద్గీత శ్లోకాలు వినబడితే ఎవరో మరణించారు అని భావిస్తాం. అంటే ఎవరైనా మరణించినప్పుడు భగవద్గీత సి.డి. పెట్టటం ఆనవాయితీ అయిపోయింది. అలా ఎవరైనా మరణించినప్పుడు వేసే సి.డి.నా? కేవలము హిందువులకు మాత్రమే నిర్దేశించబడిన మత గ్రంథమా. అసలు గీత అంటే ఏమిటి? జన బాహుళ్యానికి భగవద్గీత ఇచ్చే సందేశం ఏమిటి? అందర్నీ కొంపా గోడు వదిలేసి సన్యసించమంటోందా? ఏం చెబుతోంది?

ఇవేవీ కాదు. ఇవన్నీ అపోహలు. తెలియని వాళ్ళు చెప్పే మాటలు. అజ్ఞానులు చెప్పే విషయాలు. కొంచెం బుర్రపెట్టి ఆలోచిస్తే భగవద్గీత ఏం చెబుతోందో తెలుస్తుంది. ఒక్క మాటలో చెప్పాలంటే మానవుడు ఎలా ఉండాలో చెబుతుంది. జీవితాన్ని ఏ రకంగా నడపాలో వివరిస్తుంది. భగవద్గీత చదివితే సుఖ సంతోషాలతో ఎలా జీవించాలో తెలుస్తుంది. చేసిన పనిలో విజయం సాధించటం ఎలా ? అనే విషయం తెలుస్తుంది.

భగవద్గీత కేవలము హిందువులకు సంబంధించిన మతగ్రంథము అని చాలామంది అనుకుంటూ ఉంటారు. ఇక్కడ గమనించాల్సిన విషయం ఏమంటే

హిందూమతము అనేది ప్రపంచంలో ఎక్కడా లేదు. మతము అంటే మతి నుంచి వచ్చింది. ఎవరో ఒక వ్యక్తి చెప్పింది. ప్రచారం చేసింది. క్రీస్తు నుంచి వచ్చింది క్రైస్తవమతము. మహమ్మదు బోధించింది మహమ్మదీయమతము. కాని హిందూ ధర్మాన్ని ఎవరూ బోధించలా. ఇది సనాతనమైంది. ఈ ప్రాంతంలో ఉండేవారు పాటించిన ధర్మమది. అంతే గాని ఇది ఒకమతం కాదు. హిందూమతమనేదే లేనప్పుడు భగవద్గీత హిందూ మతగ్రంథం ఎలా అవుతుంది. భగవంతుడు చెప్పిన గీత కేవలము హిందువుల కోసం కాదు. ముఖ్యమైన సమయంలో, సరైన నిర్ణయాలు తీసుకోలేని వారి కోసం చెప్పబడింది. కాబట్టి భగవద్గీత ప్రపంచంలో అందరికీ సంబంధించిన పర్సనాలిటీ డవలప్‌మెంట్‌కు సంబంధించినది. దాన్ని అన్ని మతాలవారు చదవచ్చు. చదవాలి. ఎడిసన్ కరంటు బల్బు కనిపెట్టాడు. గ్రహంబెల్ టెలిఫోను కనిపెట్టాడు. వారు మనవారు కాదు. మనదేశస్థులు కాదు కాబట్టి వాటిని ఉపయోగించటం మానేస్తామా? రైట్‌సోదరులు విమానం కనిపెట్టారు. వారు జర్మనీ వారు కాబట్టి మనం విమానం ఎక్కటం మానెయ్యం కదా? భగవద్గీత కూడా అలాంటిదే. ఇది ఒక్క భారతీయులకే కాదు. ప్రపంచంలోని ప్రజలందరిది. భగవద్గీత ప్రపంచంలోని జనులందరికీ సంబంధించినది.

గీతలో ఏం చెప్పారు? అనే విషయం ఒక్కసారి ఆలోచించండి. నీ పని నువ్వు చెయ్యి. ఫలితం దానంతట అదే వస్తుంది అంటోంది గీత. లోకంలో ప్రతి మానవుడు సుఖ సంతోషాలతో ఉండాలనే అనుకుంటాడు. వాటి కోసమే కష్టపడతాడు. అయితే నాకు అది కావాలి. నాకు ఇది కావాలి అనుకుంటాడు. ఈ కోరికలకు మితమనేది ఉండదు. నడిచి వెళ్ళేవాడు సైకిలు స్కూటరు కావాలనుకుంటాడు. స్కూటరున్నవాడు కారు కావాలనుకుంటాడు. ఈ కోరికలు ఒకటి తీరితే ఇంకొకటి వస్తుంటాయి. వాటిని తీర్చుకోటానికి నిరంతరము శ్రమ పడతాడు. అవి తీరకపోతే దుఃఖిస్తాడు. దుఃఖానికి, అశాంతికి కారణం కోరికలు. ఆ కోరికలను అధిగమిస్తే, ఉన్న దాంతో తృప్తి పడితే, జీవితంలో దుఃఖం ఉండదు. నీ పని నువ్వు చెయ్యి. ఫలితం కోసం ఎదురు చూడకు అంటోంది గీత. జీవితంలో నీతి, నిజాయితీలు కావాలి. సమర్థత కావాలి. సాధించవలసిన లక్ష్యం ఒకటి ఉండాలి. నీతి, నిజాయితీ, సమర్థతలు ఉంటే లక్ష్యాన్ని తేలికగా సాధించవచ్చు. అదే వెతుక్కుంటూ నీ దగ్గరకు వస్తుంది అంటోంది గీత.

గీత అందర్నీ సన్యసించమని చెబుతోందా? ప్రతివారు కాషాయబట్టలు కట్టుకుని, ఇల్లు వాకిలి వదిలి అడవుల వెంబడి తిరగమని చెబుతోందా? అంటే లేదు. సన్యాసమనేది వేషధారణలో కాదు. మనస్సుకు ఉండాలి. మానసిక సన్యాసం కావాలి. సంసారంలో ఉంటూనే దేనితోను బంధాలు పెట్టుకోకుండా ఉండాలి. కుమ్మరిపురుగు బురదలో తిరుగుతున్నా దాని ఒంటికి బురద అంటదు. తామరాకు మీద నీరు పడినా, ఆ నీరు తామరాకుకు అంటదు. అలాగే మానవుడు కూడా సంసారంలో ఉన్నా ఏ విషయాలను మనసుకు పట్టించుకోరాదు. జనకమహారాజు లాగా జీవించాలి. అది సన్యాసమంటే. ఆ రకంగా ఉన్నవారికి దుఃఖము ఉండదు. అందుకే మానసిక సన్యాసం కావాలి అని చెబుతోంది గీత. ఇంద్రియాలు నీ అదుపులో ఉండాలి అంటోంది.

ఏ పని చెయ్యాలన్నా పట్టుదల ఏకాగ్రతలు కావాలి. ఆటగాడు ఆడి గెలవాలన్నా, పాటగాడు పాడి పదిమందినీ మెప్పించాలన్నా, నటుడు నటించాలన్నా ఏ పని చెయ్యాలన్నా కావలసింది ఏకాగ్రత. అది మనసు ప్రశాంతంగా ఉన్నప్పుడే వస్తుంది. కాబట్టి జీవితంలో విజయం సాధించాలంటే ముందు ఏకాగ్రతను సాధించాలని చెబుతోంది గీత.

భగవద్గీత ధర్మాధర్మాలు, మన కర్తవ్యం గురించి చెబుతోంది. అన్నింటికన్నా ముఖ్యమైనది ఏమంటే కోరికలను అదుపులో ఉంచుకోమంటోంది గీత. సుఖశాంతులు, త్యాగాలను వివరిస్తోంది. మానవుడు జీవితంలో ఆనందంగా ఉండటమెలాగో చెబుతోంది. లోకంలో దృశ్యమానమైనవన్నీ అశాశ్వతాలే. పరమేశ్వరుడు ఒక్కడే సత్యము నిత్యము శాశ్వతము అంటోంది. ఏది పాపం? ఏది పుణ్యం? అనే విషయాన్ని చెబుతోంది. జ్ఞానం ద్వారానే మోక్షం కలుగుతుంది. పరమాత్ముని చేరాలంటే పరమమైన భక్తి కావాలి. ప్రతిమానవుడు జీవితంలో కర్మలు చెయ్యాలి. చేస్తాడు. ఆ కర్మ ఎప్పుడూ ప్రతిఫలాపేక్ష లేకుండా చెయ్యాలి. జగత్తులోని జీవరాసి అంతా పరమాత్మ స్వరూపమే. అందుకే సాటిమనిషిని గౌరవించు ప్రేమించు అంటోంది గీత. ఇలా ఒకటేమిటి అనేకానేక విషయాలను వివరిస్తోంది. ఈ విషయాలన్నీ పూర్తిగా అర్థం కావాలంటే భగవద్గీతను చదవాలి. అసలు భగవద్గీతను ఒక పాఠ్యాంశంగా చేర్చాలి.

భగవద్గీతను మనకన్న విదేశీయులే ఎక్కువగా అర్థం చేసుకున్నారేమో? అనిపిస్తుంది. డా॥ బి.ఎన్. గుప్తా భారతీయుడు, శాస్త్రవేత్త. విదేశాలలో చదివాడు.

ఒకసారి ఈయన ప్రఖ్యాత శాస్త్రవేత్త **ఐన్‌స్టీన్‌**ని కలవటానికి వెళ్ళాడు. ఐన్‌స్టీన్‌కి భారతదేశమన్నా, భారతీయ సంస్కృతి సాహిత్యమన్నా చాలా మక్కువ. గుప్తాగారిని చూడగానే ఐన్‌స్టీన్ సంస్కృతం లోపలకరించాడు. గుప్తాగారికి సంస్కృతం రాదు. దాంతో ఐన్‌స్టీన్ ఏం మాట్లాడుతున్నాడో తెలియక బిక్కమొగం వేశాడు. అప్పుడు ఐన్‌స్టీన్ 'మీకు సంస్కృతం రాదా?' అన్నాడు. రాదని చెప్పారు గుప్తాగారు. "లోపలికి రండి. మీరు భారతీయులు కదా? సంస్కృతం తెలుసు అనుకుని, ఆ భాషలోనే మిమ్మల్ని పలకరించాను. లోపలకు రమ్మని ఆహ్వానించాను. భారతదేశంలోని సాహిత్యమంతా సంస్కృతంలోనే ఉంటుంది కదా? మరి మీకు సంస్కృతం రాకపోవటం ఏమిటి? నా గ్రంథాలయంలో భగవద్గీత దగ్గర నుంచి మీ దేశానికి సంబంధించిన అనేక గొప్ప గ్రంథాలున్నాయి. అదిగో ఆ గది నా లైబ్రరీ' అన్నారు. లోపలికి వెళ్ళి చూశారు గుప్తాగారు. విశేషమేమంటే అక్కడ సైన్సు పుస్తకాలకన్న భగవద్గీత మీద వ్రాసిన వ్యాఖ్యానాలే ఎక్కువ ఉన్నాయి. అప్పుడు ఐన్‌స్టీన్ 'నన్ను ఇంత పెద్ద శాస్త్రవేత్తగా తీర్చిదిద్ది, నాలో ఉన్న పరిశోధనా దృష్టిని, విశ్లేషణాశక్తిని, ఇనుమడింప చేసింది గీత. ప్రపంచమంతా భారతీయులకు ఋణపడి ఉంది. ఎందుకంటే గణితంలో తేలికగా లెక్క పెట్టగలిగే దశాంశ పద్ధతిని ప్రవేశ పెట్టింది భారతీయులు. అదే లేకపోతే ఎన్నో వైజ్ఞానిక పరిశోధనలు జరిగేవి కావు" అన్నాడు.

విచిత్రం ఏమంటే **భగవద్గీతను మార్గదర్శకంగా తీసుకున్న విదేశీయు లెంతోమంది ఉన్నారు.** కాని మన దేశంలో మాత్రం అది ఒక మత గ్రంథం. ఎవరైనా మరణించినప్పుడు వేసే సి.డి.

## 31. నిర్ణయం

ఏదైనా ఒకపని చేయవలసి వచ్చినప్పుడు దాన్ని గురించి పూర్తిగా, పూర్వాపరాలు ఆలోచించాలి. ఆ పని చెయ్యటం వల్ల లాభం ఎంత? చెయ్యకపోతే నష్టం ఎంత? లాభము నష్టము అనేవి కేవలము డబ్బు రూపంలోనే కాదు మానవ సంబంధాలు అంటే ఒక వ్యక్తి మీద కోపం వచ్చి 'నేను ఇంక నీతో మాట్లాడను. ఈ జన్మలో నీ ముఖం చూడను' అన్నాం అనుకోండి. తాత్కాలికంగా మనకు ఉపశమనం కలగవచ్చు. కాని రేపు అంటే కొన్ని సంవత్సరాల తరువాతైనా సరే ఆ వ్యక్తితో అవసరం రావచ్చు. ఇప్పుడు కాదన్న వాళ్ళని రేపు మన అవసరం కోసం అవును అనలేము. మళ్ళీ వాళ్ళ దగ్గరకు వెళ్ళలేం. ఇక్కడ ఒక చిన్న విషయం గమనించండి.

నాకు తెలిసిన ఒకాయన ఆఫీసరు. జిల్లా అధికారిగా చేసి రిటైరయ్యాడు. ఆయన కుమార్తె ఇంజనీరింగ్ పూర్తి చేసి ఒక కంపెనీలో రెండు సంవత్సరాలుగా ఉద్యోగం చేస్తోంది. మంచి తెలివితేటలున్న పిల్ల. ఎవరో సలహా ఇచ్చారు నువు యం.టెక్ చేస్తే మంచి భవిష్యత్తు ఉంటుంది అని ఆ సలహా వచ్చింది. వెంటనే ఉద్యోగం మానేసి అప్లికేషన్లు పెట్టటం మొదలుపెట్టింది. విచిత్రం ఏమంటే తనకు కావలసిన చోట, తను అనుకున్న చోట సీటురాలా ? వచ్చిన చోట చేరటానికితను ఇష్టపడలా. మళ్ళీ ఉద్యోగ ప్రయత్నాలు మొదలుపెట్టింది. కొన్నిచోట్ల వచ్చి చేరమన్నారు. ఇంతకన్న మంచి ఉద్యోగం వస్తుందని చేరలా. ఒక బ్యాంకులో ఆఫీసరుగా వచ్చింది. అది దూరప్రాంతమని చేరలా. పరిస్థితి ఏమంటే ఉద్యోగం మానేసి రెండు సంవత్సరాలైంది. ఇప్పటి దాకా ఖాళీగానే ఉంది. ఉద్యోగం రాక కాదు. వచ్చిన చోట తనకు నచ్చలా. నచ్చిన ఉద్యోగం దొరకలా. ఒకవేళ దొరికినా అది మన ప్రాంతంలో, మనముండే ప్రదేశానికి దగ్గర లేదు అని చేరలా. ఫలితం నిరుద్యోగం. ఇంకా పోటీ పరీక్షలు వ్రాస్తూనే ఉంది.

నాకు తెలిసిన ఇంకొకాయన కుమారుడు ఒక బ్యాంకులో గుమాస్తాగా చేస్తున్నాడు. అతడికి ఒక ప్రైవేటు బ్యాంకులో ఆఫీసరు పోస్టు వచ్చింది. మొత్తం పదిమందిని నియమించారు బ్యాంకువారు. ఆ లిస్టులో ఇతడు నాల్గవవాడు. కలకత్తాలో ఉద్యోగం 'ఏం చెయ్యమంటారు.' అని సలహా అడిగాడు. "వెంటనే వెళ్ళి చేరిపొండి. ఇంతకన్న మంచి ఉద్యోగం వస్తే అప్పుడు చూద్దాం" అన్నాను. కనిపించిన వాళ్ళందర్నీ సలహా అడిగాడు. రెండు నెలల తరువాత మళ్ళీ కనిపించాడు. పిల్లవాడి ఉద్యోగం ఏమైంది? చేరాడా? అన్నాను. ఇంకా తేల్చుకోలేదు. అన్నాడు. 'మరి మిగిలిన వాళ్ళందరూ చేరిపోతే మనవాడు వాళ్ళందరి కన్నా జూనియరై పోతాడు కదా?' అన్నాను. 'మిగిలిన తొమ్మిది మందీ చేరేశారు. నేను మాత్రం మూడు నెలలు సమయం అడిగాను' అన్నాడు. తరువాత అతను వెళ్ళి కలకత్తా లో చేరాడు. కాని అందరికన్నా జూనియరుగా మిగిలిపోయాడు.

ఈ రెండు చోట్ల కూడా సరియైన నిర్ణయాలు సరియైన సమయంలో తీసుకోకపోవటం వల్లనే నష్టం జరిగింది.

పక్షులలో పిచ్చుకలు అని చిన్న చిన్న పిట్టలుంటాయి. ధాన్యపు గింజలను, చిన్న చిన్న పురుగులను తింటూ ఉంటాయి. ఒక్కొక్కసారి పొలాలమీదికి దండుగా

వచ్చి పంటలు నాశనం చేస్తాయి. ఒక పిచ్చుక సంవత్సర కాలంలో ఆరున్నర కిలోల ధాన్యం తింటుంది అని లెక్క తేల్చారు చైనావారు. దేశంలో కొన్ని లక్షల పిచ్చుకలున్నాయి. ఇవి మొత్తం కలిసి కొన్ని లక్షల క్వింటాళ్ళ ధాన్యం తినేస్తున్నాయి. ఈ నష్టాన్ని గనక ఆపగలిగితే దేశంలో కొన్ని వేలమందికి ఆహార ధాన్యాలు అందుతాయి అనే ఆలోచన వచ్చింది. ఆలోచన రావటమే తడవుగా దాన్ని ఆచరణలో పెట్టాలి అనుకున్నారు. కాని పిచ్చుకలు ధాన్యం తినకుండా ఆపటం ఎలా? జాగ్రత్తగా ఆలోచించారు. వాటిని చంపేస్తే మెరుపులాంటి ఆలోచన. బాగుంది. అక్కడ ఉన్న అధికారులందరికీ వచ్చింది. ఇంకేం. రాజు తలచుకుంటే దెబ్బలకి కొదవా? ప్రభుత్వమే తలచుకుంటే కానిది ఏముంటుంది? వెంటనే పిచ్చుకలను చంపటం ఒక ఉద్యమంలాగా మార్చారు. చాలా వరకు పిచ్చుకలు చచ్చిపోయినాయి. ఇంకా మిగిలిన వాటిని చంపటానికి డబ్బు లిచ్చి మనుషుల్ని నియోగించారు. ఫలితంగా చైనా దేశం మొత్తం మీద ముప్పై లక్షల పిచ్చుకల్ని చంపేశారు. గూళ్ళలో ఉన్న గుడ్లని చిదిమేశారు. మొత్తం మీద దేశంలో పిచ్చుక అనేది లేకుండా చేశారు.

పిచ్చుకలు లేకపోవటం వల్ల ధాన్యం నష్టం కావటం తగ్గింది. చాలా ఆనందంగా ఉంది. కాని ఇప్పుడే మొదలైంది అసలు సమస్య. పంటలకు చీడపీడలు పడుతున్నాయి. పురుగులు పంటలను నాశనం చేస్తున్నాయి. సామాన్యంగా అయితే పిచ్చుకలు ఆ పురుగుల్ని తినేస్తాయి. కాని ఇప్పుడు పిచ్చుకలు లేకపోవటం వల్ల పురుగులు విజృంభించాయి. దాంతో పంటలు బాగా దెబ్బ తిన్నాయి. కరువు ఏర్పడింది. ఆ సమయంలో సుమారు నాలుగుకోట్ల మంది ఆహారం దొరక్క చనిపోయారు. ఈ విపత్తు నుంచి బైట పడాలంటే ఎలా? క్రిమికీటకాలను సంహరించే తెలివైన ఉపాయం కోసం ఆలోచించింది మేధావి వర్గం. పిచ్చుకలు ఉంటే ఈ పని సులువౌతుంది అని తేల్చింది. ఇప్పుడు రష్యా నుంచి కొన్ని లక్షల పిచ్చుకల్ని దిగుమతి చేసుకుంది చైనా.

అడుగు తొక్కనేల కాలు కడగనేల. ఉన్న పిచ్చుకల్ని చంపటమెందుకు? మళ్ళీ వాటిని దిగుమతి చేసుకోవటమెందుకు?

అందుకే **పని చేయదలచుకున్నప్పుడు పూర్వాపరాలు కూలంకుషంగా ఆలోచించాలి. అందులోని సాధక బాధకాలు, లోటుపాట్లు, లాభనష్టాలు పూర్తిగా ఆలోచించిన తరువాతనే నిర్ణయం తీసుకోవాలి.** లేకపోతే ఇలాగే ఉంటుంది.

# ౩౨. నేను ఎవరు ?

నేను ఎవరు? ఎక్కడి నుంచి వచ్చాను. ఈ లోకంలో పుట్టకముందు ఎక్కడున్నాను? మరణించిన తరువాత ఎక్కడికి పోతాను? ఈ లోకంలోకి ఎప్పుడు వచ్చాను? ఎందుకు వచ్చాను? లోకంలో పిపీలికాది బ్రహ్మ పర్యంతము 84 లక్షల జీవరాసులున్నాయి. వాటిలో పశువుగానో, పక్షిగానో, క్రిమికీటకాదులు గానో పుట్టకుండా మనిషిగానే ఎందుకు జన్మించాను? లోకంలో జన్మించిన జీవరాసిలో అనేక తారతమ్యాలున్నాయి. నీటిలో జీవించేవి కొన్ని. నేలమీద మాత్రమే జీవించేవి కొన్ని ఉభయచరాలు కొన్ని. ఖగచరాలు కొన్ని. వీటిలో మళ్ళీ అనేక తేడాలు. జీవరాసిలో ఒక్క మానవుడికి తప్ప ఆలోచించే శక్తిలేదు. సంకల్ప వికల్పాలకు కారణమైంది మనస్సు. ఆ మనస్సు మనిషికి మాత్రమే ఉంది. ఇతరమైన ఏ ప్రాణికీ లేదు. అవి ఏవీ స్వంతంగా ఆలోచించలేవు.

జీవులయొక్క జీవిత కాలంలో చాలా తేడాలున్నాయి. కొన్నింటి ఆయుష్యు చాలా తక్కువ. ఇవాళ్ళ పుట్టి రేపు మరణిస్తాయి. కుక్కలు, పిల్లుల వంటివి 10 నుంచి 15 సంవత్సరాల వరకు జీవిస్తే పశువులు ఇంకా ఎక్కువ కాలం జీవిస్తాయి. ఏనుగు వంటి జంతువులు దరిదాపు వంద సంవత్సరాలు జీవిస్తాయి. కొన్ని జీవులకి రెండు కాళ్ళుంటే కొన్నింటికి నాలుగు కాళ్ళున్నాయి. కొన్ని ఆకాశంలో ఎగరటానికి వీలుగా రెక్కలున్నాయి. వీటిలో కొన్ని శాఖాహారులు.కొన్ని మాంసాహారులు. కొన్ని క్రూరమృగాలు. అసలు ఈ రకమైన తేడాలెందుకున్నాయి. ఎవరు చేస్తున్నారిదంతా ఈ రకమైన ప్రశ్నలు అనాదిగా మానవుణ్ణి వేధిస్తూనే ఉన్నాయి. మన దేశంలోనే కాదు. ప్రపంచంలో అన్ని మూలలా, అన్ని దేశాలలోని మానవులు ఈ విషయాన్ని గురించి ఆలోచిస్తూనే ఉన్నారు.

పురుషుని యొక్క వీర్యంలో అనేక లక్షల జీవకణాలు ఉత్పత్తి అయి, అత్యంత వేగంగా స్త్రీ శరీరంలో ప్రవేశిస్తాయి. అందులో ఒక్క జీవకణం మాత్రమే గర్భంలో ప్రవేశిస్తుంది. అది కూడా మొండెం లేకుండా శిరస్సుతో మాత్రమే ప్రవేశిస్తుంది. అలా ప్రవేశించిన తరువాత కేవలము 24 గంటలలోపు అండాన్ని పట్టుకోవాలి. లేకపోతే అదికూడా ముక్కలై బయటకు వచ్చేస్తుంది. ఇది ఒక పోరాటం. దీనికి భగవంతుడు నిర్ణయించిన సమయం కేవలం 24 గంటలు. ఈ సమయంలో అండాన్ని చేరితే జీవించటం. లేకపోతే మరణించటం.

ఈ రకంగా రూపం లేకుండా కేవలము తల మాత్రమే కలిగి గర్భంలో ప్రవేశించిన జీవకణం, అండాన్ని పట్టుకుని రూపాంతరం చెందుతుంది. అలా రూపాంతరం చెంది, శిసువుగా మారి మాత్రుగర్భంలో తొమ్మిది నెలలు గడిపి, నిర్దిష్టమైన రూపంతో బయటకు వస్తుంది. ఈ మధ్య కాలంలో మాత్రు గర్భంలో దుర్భరమైన జీవితాన్ని అనుభవిస్తుంది. కాళ్ళు చేతులు కదపలేదు. ఆకలేస్తే చెప్పలేదు. బాధ కలిగితే ఏడవలేరు. ప్రక్కకు తిరగలేదు. ఈ స్థితిలో తొమ్మిది నెలలు పూర్తి చేసుకుంటుంది. దేహం పూర్తిగా పెరుగుతుంది. దేహంతో పాటుగా దేహంమీద మోహం కూడా పెరుగుతుంది. నేను, నాది అనే అహంకార మమకారాలు పెరుగుతాయి. నేను అంటే–ఈ దేహము, దేహమే నేను అనే నిశ్చయానికి వస్తాడు.

కాని విచిత్రం ఏమంటే ఈ దేహంలో ఏ భాగము నీ మాట వినదు. చిన్నప్పుడు రెండు అడుగులు మాత్రమే ఉన్నావు. క్రమేణా శరీరం పెరిగింది. ఆరడుగులయింది. తెలివితేటలు పెరిగాయి. లోకజ్ఞానం కలిగింది. వేదాలు, శాస్త్రాలు అన్నీ చదివావు. నువ్వు పండితుడివి అన్నారు. గొప్పవాడన్నారు. అనేక సన్మానాలు, సత్కారాలు అందుకున్నావు. మంచి పదవులు అలంకరించావు. పేరు ప్రతిష్ఠలతో బాటుగా ధనం కూడా సంపాదించావు. శరీరాన్ని అందంగా పోషించావు. అందం కోసం అనేకమైన అలంకరణ సామాగ్రిని ఉపయోగించావు. వయసు పెరుగుతోంది. నీ అందం కాస్తా మందమై పోయింది. శరీరం ముడతలు పడింది. అవయవాలు క్రమంగా పనిచెయ్యటం మానేశాయి. తెలివితేటలు తగ్గిపోయాయి. జ్ఞాపకశక్తి మందగించింది. కంటిచూపుతగ్గింది. చెవులువినపడవు. కళ్ళుకనపడవు. నడవలేవు. కూర్చోలేవు. నుంచోలేవు, అన్నింటికీ ఇంకొకరి మీద ఆధారపడాలి. ఏమైంది నీ అందం, అధికారం, పాండిత్యం, తెలివి? ఈ దేహం నీదే కదా? ఎందుకు నీ మాట వినటం లేదు?

ఒకప్పుడున్న అందం ఇప్పుడెందుకు లేదు? ఏమై పోయింది నీ తెలివి? ఏమై పోయింది నీ పాండిత్యం? క్రమేణా ఆయుష్యు తీరిపోయింది. ఈ దేహాన్ని వదిలి వెళ్ళిపోతున్నావు. ఎందుకలా జరుగుతోంది? ఈ దేహం నీవే కదా? నువ్వు అంటే దేహం. దేహమంటే నువ్వు. అలాంటప్పుడు ఎందుకు ఈ దేహాన్ని విడిచి వెడుతున్నావు?

ఎందుకంటే ఈ దేహం నీదికాదు. నువ్వు ఈ లోకంలోకి ఎందుకు వచ్చావో నీకు తెలియదు. గతజన్మలలో చేసిన కర్మ ఫలితాన్ని అనుభవించటాని ఇక్కడికి వచ్చావు. ఈ భూమిమీద పుట్టిన తరువాత ఎంతటివాడైనా, సాక్షాత్తు భగవంతుడే అయినా సరే కర్మఫలితాన్ని అనుభవించాల్సిందే. నారదుడికి కోతిముఖం ఇచ్చినందుకే సాక్షాత్తు శ్రీమహావిష్ణువుని నారదుడు శపించాడు. ఆ శాపం కారణంగానే శ్రీమహా విష్ణువు శ్రీరాముడిగా జన్మించాడు. కాబట్టి కర్మపలం అనుభవించక శ్రీమహావిష్ణువుకే తప్పలేదు. ఇక మనమెంత? గతజన్మలలో చేసిన కర్మఫలితం వల్లనే ఈ దేహం ప్రాప్తిస్తుంది. నహుషుడు ఇంద్రుడైనాడు. కాని అహంకారం కారణంగా అగస్త్య మహర్షివల్ల శపించబడి కొండచిలువగా జన్మించాడు. చేసిన కర్మను బట్టే ఈ దేహం వస్తుంది. అది పశువు, పక్షి, క్రిమి, కీటకము ఏదైనా కావచ్చు. మానవుడైనా కావచ్చు. జంతూనాం నరజన్మ దుర్లభం. మనిషిగా పుట్టాలంటే అనేక జన్మలు ఎత్తాలి. చాలా పుణ్యం చేసుకోవాలి. అందులో కూడా పాపకర్మలు చేసినవారు దుష్టులుగా, దుర్మార్గులుగా అంగవిహీనులుగా జన్మిస్తారు. ఇంకా పాపం చేసినవారు నీచయోను లందు జన్మిస్తారు. నీచమైన పనులు చేస్తారు. కాని నువ్వు ఉత్తమమైన బ్రాహ్మణ వంశంలో జన్మించావు. బ్రాహ్మణజన్మ ఉత్తమమైనది అనటానికి కారణం ఏమంటే నిరంతరము సత్యసాధనలో, తత్త్వశోధనలో కాలం గడిపేవారు బ్రాహ్మణులు. వీరికి లౌకిక విషయాలయందు ఆసక్తి ఉండదు. ఎక్కడో అడవుల్లో ఆశ్రమాలు నిర్మించుకుని తపస్సు చేసుకుంటూ, భగవతత్త్వాన్ని శోధిస్తూ, నిరంతరము వేదాంత చర్చలు, యజ్ఞాలు, యాగాలు చేస్తూ కాలం గడిపేవారు బ్రాహ్మణులు. అందుచేతనే వారు ఉత్తములు, పవిత్రులు అనటం జరిగింది. అటువంటి బ్రాహ్మణ వంశంలో జన్మించిన నువ్వు నిన్ను గురించి తెలుసుకో.

నువ్వెవరివో కాదు సాక్షాత్తు పరమేశ్వరుడివి. **నిర్వాణషట్కం**లో శంకర భగవత్పాదుల వారు చెప్పినట్లుగా

**మనోబుద్ధ్యహంకార చిత్తానినాహం**
**నశ్రోత్రం నజిహ్వా నచ ఘ్రాణనేత్రే**
**నచో వ్యోమ భూమి ర్నతేజో నవాయుః**
**చిదానందరూపం శ్శివోహం శ్శివోహం ॥**

నేను బద్ధిని కాను, చిత్తము కాను, అహంకారము కాను, మనస్సును కాను, నేత్రము కాను, శ్రోత్రము కాను, ముక్కు కాను, నాలుక అంతకన్నా కాను. పంచభూతాలయిన ఆకాశం కాను, వాయువు కాను, తేజస్సు కాను, నీరు కాను, భూమికాను. మరి నేనెవరు? అంటే చిదానందరూపుడైన పరమాత్మని.

ఈ విషయం తెలుసుకో. శరీరపతనం జరిగిన తరువాత కూడా నువ్వు ఉన్నావు అంటే, నువ్వు శరీరానివి కాదు. సాక్షాత్తు పరమాత్మవి.

**దేహోదేవాలయ ప్రోక్తో జీవోదేవస్సనాతనః** నీ శరీరమే దేవాలయం అందులో అనాదియైన సనాతనుడైన జీవాత్మయే ఆ పరమేశ్వరుడు. అదే నువ్వు.

కేవలం అజ్ఞానంతో జీవాత్మ వేరు, పరమాత్మ వేరు అనుకుంటున్నావు. అజ్ఞానం తొలగిపోతే జీవాత్మ ఉండదు. మిగిలేది కేవలం పరమాత్మే. అదే నువ్వు.

కాబట్టి ఓ మానవుడా ! ఈ శరీరం, భోగాలు, సుఖాలు, సిరిసంపదలు అన్నీ మూణ్ణాళ్ళ ముచ్చట భార్య, పిల్లలు, బంధువులు, స్నేహితులు జీవితమనే నాటకంలో పాత్రధారులు. ఎవరి పాత్రను వారు జాగ్రత్తగా పోషించి వెళ్ళిపోతుంటారు. ఈ జగత్తులో ఏదీ శాశ్వతంకాదు. నిత్యము సత్యము అయినది **పరబ్రహ్మ** ఒక్కటే. అదే నువ్వు. **తత్త్వమసి.**

## 33. స్నానం

సామాన్యంగా ప్రతిరోజూ, ప్రతివారూ స్నానం చేస్తారు. స్నానం అంటే జలంతో శరీరమంతా రుద్ది కడుక్కోవటం. ఇది మనకు తెలిసినది. కాని స్నానమనేది నాలుగు రకాలుగా ఉంటుంది. 1.జలస్నానము 2. మంత్రస్నానము 3. భస్మస్నానము 4 జ్ఞానస్నానము.

**జలస్నానం మలత్యాగం మంత్రస్నానం మనశ్శుచిః**
**భస్మస్నానం హరే త్పాపం జ్ఞానస్నానం పరం పదం ॥**

1. జలస్నానం – శరీరానికి పట్టిన మురికిని పోగొడుతుంది
2. మంత్రస్నానం – మనస్సు పవిత్రమౌతుంది. మలిన రహితమౌతుంది.
3. బస్మస్నానం – ఇది వైరాగ్యంతో చేసే స్నానం దీనివల్ల పాపం పోతుంది.
4. జ్ఞాన స్నానం – దీనివల్ల మోక్షం సిద్ధిస్తుంది.

వీటిలో మనం ప్రతిరోజు చేసేది జలస్నానం. వాతావరణం వేడిగా ఉండే ప్రాంతాలవారు రోజుకు రెండుసార్లు స్నానం చేస్తే, చల్లని ప్రాంతాలవారు కొన్ని రోజులకు ఒకసారి చేస్తారు. ధృవప్రాంతాల వారు ఎప్పుడు స్నానం చేస్తారో తెలియదు. దీనికి కారణం చల్లని, మంచు ప్రాంతాలలో శరీరానికి చెమట పట్టదు. మలినం కాదు. మన ప్రాంతాలలో కూడా ఆరోగ్యం సరిగా లేనివారు అంటే జ్వరం, రోగం వచ్చిన వారు ప్రతిరోజు స్నానం చెయ్యరు. అలా చేస్తే వారి ఆరోగ్యం చెడిపోతుంది. ప్రత్యేకించి సీతాకాలంలో వారానికి ఒకసారి మాత్రమే స్నానం చేస్తారు. స్నానం ఇలాగే చెయ్యాలి అనేది దేశకాలమాన పరిస్థితులను బట్టి ఉంటుంది. ఇప్పుడు జలస్నానం ఎక్కడ? ఎప్పుడు? ఎలా? చెయ్యాలనే విషయాలను చూద్దాం. ఈ విషయాలన్నీ మన ప్రాంతం వారిని దృష్టిలో పెట్టుకుని మాత్రమే చెప్పబడుతున్నాయి.

**ఉత్తమంతు నదీస్నానం, మధ్యమంతు ప్రవాకమ్ ।**
**అధమంతు తటాకేన కూపస్నానం అధమాధమమ్ ॥**

1. నదిలో నీరు చాలా దూరప్రాంతాల నుంచి వస్తుంది. కొండలు, కోనలు, అడవులు దాటుకుంటూ వస్తుంది. కాబట్టి దీనిలో ఔషధ గుణాలుంటాయి. అందుచేత నదిలో స్నానం చెయ్యటం ఉత్తమం.
2. నీరు ప్రవహిస్తున్నప్పుడు దానిలో విద్యుత్తు ఉంటుంది. ఆ విద్యుత్తు వల్ల శరీరంలో వాతం వల్ల వచ్చే నొప్పులు తగ్గిపోతాయి. అందుకే ప్రవహించే నీటిలో స్నానం చెయ్యండి అన్నారు. ఇది మధ్యమం.
3. తటాకము అంటే చెరువు. ఇందులో నీరు కదలకఉండా నిశ్చలంగా ఉంటుంది. చెరువులో స్నానం చేస్తే పెద్దగా ఉపయోగం ఏమీ లేదు. అందుకే ఇది అధమం.
4. కూపము అంటే బావి. ఇది చాలా చిన్నది. ఇందులో నీటికి ఏ మాత్రం కదలిక ఉండదు. ఈ నీటిలో ఏ రకమైన ఔషధగుణాలు గాని, విద్యుత్తు గాని ఉండదు. కేవలం ఇది నీరు. శరీరానికి పట్టిన మురికి వదిలించుకోటానికి మాత్రమే పనికి వస్తుంది. అందుకే దీన్ని ఆఖరున చెప్పటం జరిగింది. అధమాధమం. ఈ రోజుల్లో మనకు ఈ బావులు కూడా కనిపించటంలా అన్నీ బోరుబావులే. బావి త్రవ్వితే స్థలం పోతుందని ఇలా చేస్తున్నారు. దీన్ని మనం ఏమీ అనలేము అంతే.

స్నానము ఆరు రకాలుగా విభజించి చెప్పబడింది.

1. నిత్యస్నానం
2. నైమిత్తిక స్నానం
3. కామ్యస్నానం
4. క్రియాంగ స్నానం
5. అభ్యంగన స్నానం
6. క్షేత్ర స్నానం

1. **నిత్యస్నానం :** ప్రతిరోజు మనం చేసేది. జపతపాలు, పారాయణ, పూజాది కార్యక్రమాలు చెయ్యటానికి చేసే స్నానం.

2. **నైమిత్తిక స్నానం :** ఏదైనా ఒక నిమిత్తం చేసే స్నానం దోష నివారణ కోసం చేసేది. పురిటి స్నానం, మైలస్నానం వంటివి.

3. **కామ్యస్నానం :** ప్రత్యేకమైన ఫలితాలను ఆశిస్తూ చేసే స్నానం. పరవడి దినాలలో చేసే స్నానాలు. ఆ, కా, మా, వై.

| | | |
|---|---|---|
| ఆ | – | ఆషాఢ పౌర్ణమి |
| కా | – | కార్తీక పౌర్ణమి |
| మా | – | మాఘ పౌర్ణమి |
| వై | – | వైశాఖ పౌర్ణమి |

ఇవి పరవడి దినాలు. ఈ రోజుల్లో ప్రత్యేకంగా సముద్రస్నానాలు చేస్తారు. దగ్గరలో సముద్రం లేకపోతే నదీస్నానం చేస్తారు. అలాగే యజ్ఞయాగాదులు చేసేటప్పుడు ఆచరించే స్నానాలు కూడా.

4. **క్రియాంగ స్నానం :** పిత్రు కార్యక్రమాలు చేసే సమయంలో, పిత్రు దేవతల తృప్తి కోసం చేసే స్నానాలు. అక్కడ చేసే క్రియలో భాగంగా ఈ స్నానమాచరించటం జరుగుతుంది.

5. **అభ్యంగన స్నానం :** దీన్నే 'మలాపకర్షణ' స్నానం అనికూడా అంటారు. ఆపాద మస్తకము నలుగు పెట్టి రుద్ది స్నానం చెయ్యటం శరీరానికి ఉన్న మలినాలను పూర్తిగా వదిలించుకోవటానికి చేసే స్నానం. దీన్ని ప్రతిరోజు కాకుండా వారానికి, పదిరోజులకు, పరవడి రోజులు, పడగలప్పుడు చేస్తారు.

6. **క్షేత్రస్నానం :** పవిత్రమైన ప్రదేశాలతోను, పుణ్యక్షేత్రాలలోను చేసే స్నానాలు. ఇక్కడ స్నానం చేస్తే అప్పటివరకు చేసిన పాపాలు పోయి పవిత్రులవుతారు. దీన్నే క్రియాస్నానం అనికూడా అంటారు.

అయితే అందరూ అన్నివేళలా ఈ స్నానాలు చెయ్యలేరు. ఆరోగ్యం సరిగాలేని వారు స్నానం చెయ్యలేరు. కొన్ని ప్రాంతాలలో నీటివనరులు తక్కువ. అలాంటిచోట స్నానం చెయ్యటం కష్టం. నా పెళ్ళైన కొత్తల్లో, నా భార్యకి మా ఇంట్లో నీటిని చూస్తే చాలా ఆశ్చర్యంగా ఉండేది. వాళ్ళది ఒంగోలు. అక్కడ నీరు పెద్దగా ఉండదట. పిల్లలకు స్నానం చేయించి, ఆ నీటితోనే బట్టలు ఉతికేవారట. మాది బందరు (మచిలీపట్నం) కరంటు స్తంభం పాతటానికి గొయ్యి తవ్వితే నీరు వచ్చేది. బావిలో నీరు చేతికి అందేది. అందుకే తనకు ఆశ్చర్యంగా ఉండేది. ఇలాంటి వారు ప్రతిరోజు స్నానం చెయ్యలేరు. కాబట్టి శరీరశుద్ధి కోసం కొన్ని పద్ధతులు చెప్పారు. వీటిని **గౌణస్నానాలు** అంటారు. ఇవి ఎనిమిది రకాలు.

1. **మంత్రస్నానం :** పూజలో భగవంతుడికి స్నానం చేయించినట్లుగానే ఆపోహిష్టాది మంత్రాలతో మార్జన చేసుకోవటం.
2. **ధ్యాన స్నానం :** జ్ఞానుల యొక్క పాదాలు కడిగి ఆ నీటిని నెత్తిన జల్లుకోవటం. జ్ఞానులు ఎప్పుడూ కనిపించరు కాబట్టి తులసి వంటి పవిత్రమైన చెట్టు మొదట్లో పోసిన నీటిని నెత్తిన జల్లుకోవటం.
3. **భస్మస్నానం :** శరీరానికి భస్మము లేదా విభూది పూసుకోవటం.
4. **కాపిలస్నానం :** తడిగుడ్డతో వళ్ళు తుడుచుకోవటం. ఆరోగ్యం సరిలేని వారు ఈ రకంగా చేస్తుంటాం.
5. **ఆగ్నేయస్నానం :** త్రాయుషం జమదగ్నేః అనే మంత్రం చదువుతూ భస్మంతో మార్జన చేసుకోవటం.
6. **దివ్యస్నానం :** ఇది చాలా విచిత్రమైనది. ఉత్తరాయణంలో ఎండ, వాన రెండూ కలిసి వచ్చినప్పుడు ఆ వానలో తడవటం.
7. **వాయువ్యస్నానం :** ఆవులు నడుస్తున్నప్పుడు వాటి కాలి డెక్కలు నేలమీద దిగబడి చిన్నగుంటలుగా అవుతాయి. ఆ గుంటలోని మట్టితో మార్జన చేసుకోవటం. అంటే గోధూళిలో స్నానమన్న మాట. ఇది చాలా పవిత్రం.
8. **మానస స్నానం :** స్నానం చేసినట్లుగా మనస్సులో భావించటం. ఇక్కడ నిజంగా స్నానమనేది జరగదు. కాని జరిగినట్లుగా భావన చేస్తారు. ఉదాహరణకి

తెల్లవారుఝామున జపం చేసుకోవటానికి లేస్తాం. అప్పుడు స్నానం చెయ్యటం కుదరదు. అలాంటి సమయాలలో మానస స్నానం చేస్తారు. పుండరీకాంక్ష పుండరీకాక్ష అంటూ నెత్తిన నీరు జల్లుకుంటారు. అదే స్నానం. ఇది నాలుగు రకాలుగా ఉంటుంది.

1. **ఋషి స్నానం :** తెల్లవారుఝామున 4–5 గంటల మధ్యన చేసేది.
2. **దైవ స్నానం :** తెల్లవారుఝామున 5–6 గంటల మధ్యన చేసేది.
3. **మానవ స్నానం :** ఉదయం 6–7 గంటల మధ్యన చేసేది.
4. **రాక్షస స్నానం :** ఉదయం 7 గంటల తరువాత చేసేది. సూర్యోదయానికి ముందే స్నానం చెయ్యటం ఉత్తమం.

**నియమాలు :** ఎవరైనా ఎక్కడైనా స్నానం చెయ్యవచ్చు. కాని నదులు, ప్రవాహాలు, చెరువులలో స్నానం చేసేవారు తప్పనిసరిగా కొన్ని నియమాలు పాటించాలి. లేకపోతే ఒక్కోసారి ప్రాణానికే ప్రమాదం వస్తుంది.

1. మొసలిలాంటి జంతువులున్న చోట స్నానం చెయ్యరాదు.
2. నీటిలో నడుము కన్న ఎక్కువ లోతుకు వెళ్ళరాదు.
3. శిఖను పాయలుగా తీసి స్నానం చెయ్యాలి.
4. బ్రొటన వేళ్ళతో చెవులు, చిటికెన వ్రేళ్ళతో ముక్కులను మూసుకుని మాత్రమే నీటిలో మూడుసార్లు మునగాలి.
5. బట్టలు కట్టుకునే స్నానం చెయ్యాలి. దిగంబర స్నానం పనికిరాదు.
6. సుమంగళులు నీటిలో మునుగుతూ స్నానం చేయరాదు.
7. స్నానమాచరించిన తరువాత భగవన్నామస్మరణ చేస్తూ తడి వస్త్రాలను విడిచి, పొడి వస్త్రాలు ధరించాలి.

ఇళ్ళల్లో, స్నానపు గదుల్లో స్నానం చేసేవారికి ఈ నియమాలతో పనిలేదు.

ఇవన్నీ శాస్త్రాలలో చెప్పిన విషయాలు. వీటికి ఆ రోజుల్లోనే చాలా వెసులుబాట్లు కల్పించారు. కాబట్టి శాస్త్రాన్ని పరిహసించకుండా అర్థం చేసుకుని ఆచరించటానికి ప్రయత్నించండి.

# 34. దైవము

దైవము అంటే మనకన్న ఎక్కువ శక్తి గలది. అతీంద్రియ శక్తి గలది. సృష్టి స్థితి లయాలను చేసేది. అన్నింటినీ నియంత్రించేది. జీవులు చేసిన కర్మను మళ్ళీ వారి అనుభవానికి పంపేది. మానవుణ్ణి మంచి మార్గంలో నడిపించేది. లోకాలను రక్షించేది. పంచభూతాలను తన అధీనంలో ఉంచుకున్నది. జీవులకు మోక్షాన్ని ప్రసాదించేది.

జీవి తను చేసిన కర్మను మంచి అయినా, చెడు అయినా తానే అనుభవించాలి. ఇవాల్టి రోజున బలం, అధికారం, ధనం, పలుకుబడి ఉన్నాయి కదా అని అవతలివాడికి చెడు చేస్తే, ఇంకొక వ్యక్తిని ఇబ్బంది పెడితే, అతడు పడిన బాధ, ఉసురు ఊరికే పోదు. అతడు ఏమీ చెయ్యలేడు. మహా అయితే నాలుగు తిడతాడు. గట్టిగా అరుస్తాడు అంతే. దానివల్ల ఏం జరగదు అనుకుంటాం. అది చాలా తప్పు. అతడి తిట్లు శాపనార్థాలవుతాయి. అతడి గుండెమంట మనకు తప్పనిసరిగా బాధలు, ఇబ్బందులు కలిగిస్తుంది. అతడి ఉసురు మనకి తగిలి తీరుతుంది. నాకేంకాలేదు అనుకుంటాం. ఒక్కోసారి ఆ పాపం మీ పిల్లలకు కూడా తగులుతుంది. వాళ్ళకి ఆరోగ్యం బాగుండక పోవచ్చు. మతిస్థిమితం లేకపోవచ్చు. కాళ్ళు చేతులు సరిగా పని చెయ్యకపోవచ్చు. బుద్ధి మందగించవచ్చు. వాడు అప్రయోజకుడు కావచ్చు. ఇదంతా గతజన్మలలో మనం చేసిన కర్మఫలితమే. మన సంతానానికి బాగాలేదు అంటే, మనకి బాగా లేనిదానికన్న ఇంకా విపరీతమైన బాధ ఉంటుంది. జీవితంలో అంచెలంచెలుగా పైకి వచ్చాడు. నీతినియమాలను గాలికి వదిలేశాడు. మంచిస్థాయికి చేరాడు. కోట్లు సంపాదించాడు. కొడుకు అయోమయం. కూతురికాపరం సజావుగా లేదు. భార్యకి అనారోగ్యం. ఎంతోమంది వైద్యులని సంప్రదించాడు. ఏ రోగం లేదు. అంతా బాగానే ఉన్నది అంటారు. కాని లేవలేదు. అందరిలాగా తిరగలేదు. ఇతగాడికి బయట ఉన్నంతవరకు బాగానే ఉంటుంది. ఇంటికి రాగానే ప్రత్యక్ష నరకం కనిపిస్తుంది. శాంతి అనేది ఉండదు. ఇంట్లో ఎవరిని చూద్దామన్నా ఒకటే. సమస్య సమస్య సమస్య. ఎటు చూసినా సమస్యే. ఇల్లంతా సమస్యే. వీటినుంచి బయట పడాలంటే ఒకటే దారి. ప్రాణత్యాగం. ఆత్మహత్య చేసుకోవటమే. కాని అది పరిష్కారం కాదు. అతడి దృష్టిలో వీటన్నింటికీ కారణం భగవంతుడే. ఆయనే తనకు ఇలా అన్యాయం చేశాడు.

నాకు తెలిసిన ఒకవ్యక్తి ఉన్నాడు. మహాపొగరుగా ఉండేవాడు. ఎవరినీ లెక్క చేసేవాడు కాదు. ఎదుటి వ్యక్తి ఎవరైనా సరే 'నువ్వెంత?' అనేవాడు. అతనికి లేక లేక ఒక కూతురు పుట్టింది. అతిగారాబంగా చూసుకుంటున్నాడు. పసితనంలోనే పిల్లకి కాలుచేతులు సరిగా పని చెయ్యటంలా. వైద్యులని సంప్రదించారు. వయసు పెరిగితే అన్నీ సర్దుకుంటాయన్నారు వైద్యులు. రోజులు గడిచాయి. పిల్లకి రెండు సంవత్సరాలు నిండాయి. నడవలేదు. చేతులు కూడా సరిగా పనిచేయవు. మాట సరిగారాదు. ఎన్ని మందులు వాడినా ఉపయోగం లేకపోయింది. 20 సంవత్సరాలు వచ్చేవరకు అలాగే బాధపడింది. తరువాత ఆ జీవికి విముక్తి కలిగింది. ఇతడికి కూతురు జీవించి ఉన్నంతవరకు ప్రత్యక్ష నరకం.

ఎంతోమందిని సంప్రదించాడు. చివరికి తెలిసింది ఏమంటే గతజన్మలలో డబ్బున్నదన్న అహంకారంతో తన ఇంట్లో పనిమనిషి మీద దురుసుగా ప్రవర్తించాడు. ఫలితంగా పనిమనిషి కాళ్ళు చేతులతోపాటు మాటకూడా పడిపోయింది. మరి ఈ పాపాన్ని ఎవరు అనుభవిస్తారు?

ఇలా చూస్తూ పోతే అనేకమంది కనిపిస్తారు. మనం అనుభవిస్తున్న కష్టసుఖాల వెనక మనం చేసిన కర్మమే ఉన్నది. ఆ కర్మ ఫలితంగానే జీవితంలో సుఖదుఃఖాలు అనుభవిస్తాం. జీవితం అంటేనే కష్టసుఖాల కలయిక. ఏ వ్యక్తీ పూర్తిగా కష్టాలే అనుభవించడు. అలా అని ఎవరూ పూర్తిగా సుఖపడరు. సముద్రం వద్దున తిరిగే పీతకి కూడా కష్టాలుంటాయి. పీతకష్టాలు పీతవి.

ఈ కష్టాలన్నింటికీ కారణం గతజన్మలలో మనం చేసిన కర్మ. దాని ఫలితమే ఇవన్నీ. వేపగింజను పాతిపెట్టి, అది చెట్టయిన తరువాత మామిడికాయలు కాయాలి అంటే కాస్తుందా? వేపకాయలే కాస్తుంది. కాబట్టి కర్మ చేసేటప్పుడే జాగ్రత్తగా ఆలోచించి చెయ్యాలి. అనాలోచితంగా చేసిన కర్మవల్ల కూడా ఫలితం ఉంటుంది. తెలిసి ముట్టుకున్నా తెలియక ముట్టుకున్నా నిప్పు కాలుతుంది. కర్మకూడా అంతే. ఒక వ్యక్తి దేవాలయానికి వెళ్ళాడు. దేవాలయంలో పూలతోట ఉంది. రోజూ స్వామివారికి పుష్పాలు ఇక్కడ నుంచే వెడతాయి. దేవస్థానం వారు భక్తులు కూడా ఆ పూదోటని చాలా జాగ్రత్తగా కాపాడతారు. ఒకరోజున ఇతడు దేవాలయానికి వెళ్ళేసరికి ఒకఆవు తోటలో మొక్కలను తినేస్తోంది. అది చూసి సహించలేక పోయాడు ఈ భక్తుడు. గట్టిగా అరిచి అదిలించాడు. ఆవుకదల్లా. ఇక లాభం లేదు అని

ప్రక్కనే ఉన్న చిన్నకర్ర తీసుకుని ఆవును కొట్టాడు. ఆవు పరుగెత్తటం మొదలెట్టింది. గుళ్ళోకి పోయింది. దేవాలయం చుట్టూ పరుగెత్తింది. దాన్ని తోలుతూ, దాని వెనకే పరుగు పెడుతూ, దాన్ని కొడుతున్నాడు ఈ భక్తుడు.

ఇక్కడ చూడండి. అనుకోకుండా జరిగింది ఈ కర్మ. ఆవును కొట్టటం మహాపాపం. అదే సమయంలో ఆవుతోపాటుగా దేవుడి చుట్టూ ప్రదక్షిణలు చేశాడు. ఇక్కడ రెండు పనులు జరిగాయి. 1.ఆవుని కొట్టటం. ఇది మహాపాపం. 2. దేవుడికి ప్రదక్షిణాలు చేశాడు. ఇది పుణ్యం. రెండూ ఒకే కాలంలో చేశాడు. కాబట్టి వాటి ఫలితం కూడా ఒకేసారి అనుభవిస్తాడు. ఆవును కొట్టి పాపం చేసినందుకు కేన్సరు వచ్చింది. గుడిచుట్టూ ప్రదక్షిణలు చేసిన పుణ్యఫలం వల్ల మంచి హాస్పిటల్‌లో చేర్పించారు. సరైన వైద్యం అందింది.

పిల్లిని చంపాం. గుడి కట్టించాం. పాపం కాస్తా పోయింది అనుకుంటారు. ఇదేమీ వ్యాపారం కాదు. పాపం పాపమే. పుణ్యం పుణ్యమే. దేనికది విడివిడిగా అనుభవించాల్సిందే.

సామాన్యంగా జరిగేదేమంటే, మనం సుఖంగా ఉన్నప్పుడు భగవంతుడు గుర్తు రాడు. మన కష్టాలన్నింటికీ అతడే బాధ్యుడు. ఇలానే భావన చేస్తాం. ఇది మానవ సహజం. మంచి జరిగితే మన ప్రయోజకత్వం. చెడు జరిగితే కారణం అవతలి వ్యక్తి. అలాగే సుఖాలు పొందటం విజయం సాధించటం మన గొప్పతనం. మన కష్టాలకు, బాధలకు కారణం భగవంతుడు. అందుకే వేమన అంటాడు మానవుడి బుద్ధి ఎలా ఉంటుదో చూడండి.

**తనకు లేని నాడు దైవంబు దూరును**
**తనకు గల్గెనేని దైవమేల**
**తనకు దైవమునకు దగులాటమెట్టిదో**
**విశ్వదాభిరామ వినురవేమ**

తనకు ఏ రకమైన కష్టం వచ్చినా సరే. దీనికి కారణం దైవమే అనుకుంటాడు. దైవాన్ని దూషిస్తాడు. సుఖాలు అనుభవిస్తున్న రోజున మాత్రం దైవాన్ని తలచడు. దానికి కారణం దైవమే అని భావించడు. ఇటువంటి మనుషులకు, దైవానికి సంబంధం ఏముంటుంది?

నిజంగా చెప్పాలంటే దైవము అనేది ప్రత్యేకంగా ఎక్కడా లేదు. తన కోరికలు తీర్చుకోటానికి మనిషే భగవంతుణ్ణి సృష్టించాడు. మానవుడు అనుభవిస్తున్న కష్టసుఖాలకు అతడే బాధ్యుడు. తాను చేసిన కర్మఫలితంగానే కష్టసుఖాలు వస్తాయి. కాబట్టి కర్మ చేసేటప్పుడు దాని ఫలితాన్ని మళ్ళీ మనమే అనుభవించాలి అని గుర్తించండి. చెడుకర్మలు చెయ్యకండి. ఇతరులకు హాని తలపెట్టకండి. ఇతరులకు కలిగించిన కష్టాలు కాబూలి వాడి దగ్గర తీసుకున్న అప్పులాంటివి. వడ్డీతో సహా అప్పు తీర్చాలి.

కాబట్టి ఓ మానవుడా ! **కష్టాలు కలిగినప్పుడు దైవాన్ని దూషించటం అనవసరం. అది నువ్వు చేసుకున్న నిర్వాకమే.** ఈ విషయాన్ని గుర్తించి బుద్ధి గలిగి ప్రవర్తించు. **ఇతరులకు హాని చెయ్యకు. ఎవరినీ కష్టపెట్టకు. ఎవరినీ బాధించకు.**

## 35. అర్థం లేని చదువు వ్యర్థం

ప్రతిరోజూ మనం భగవంతుణ్ణి ప్రార్థిస్తూ శ్లోకాలు చదువుతుంటాం. అష్టోత్తర, సహస్ర నామాలు పారాయణ చేస్తుంటాం. మంత్రజపం చేస్తుంటాం. అంతేకాదు పురాణాలు, కథలు వింటుంటాం. విచిత్రం ఏమంటే వీటిలో వేటికీ అర్థం మనకు తెలియదు. రోజు ప్రొద్దున్నే **బ్రహ్మమురారి సురార్చిత లింగం** అంటూ లింగాష్టకం చదువుతాం. దాని అర్థం ఏమిటో తెలియదు. లలితా సహస్రం, విష్ణు సహస్రం పారాయణ చేస్తాం. మన చదివే నామానికి అర్థం తెలియదు మంత్రజపం చేస్తుంటాం. మంత్రానికి అర్థం తెలియదు. మంత్రానికి అర్థం తెలిసి గనక జపం చేస్తే, మంత్రాధిదేవత వచ్చి ఎదురుగా నుంచుంటుంది. రామాయణం వింటున్నాం. అందులో తాదాత్మ్యత పొందాలి. కాని అది జరగదు. భాగవతం చదువుతున్నాం. మృదుభక్షణ ఘట్టం. బాలకృష్ణుడు తాను మన్ను తినలేదు. కావాలంటే నా నోరు వాసన చూడు అని నోరు తెరిచి చూపించాడు. ఆ పిల్లవాడి నోట్లో యశోదకు పద్నాలుగు లోకాలు కనిపించాయి. మనం శ్రద్ధగా వింటే మనక్కూడా కనిపించాలి. కాని అలా జరగటం లేదు. కారణం మనసు దానిమీద లగ్నం కాలేదు. చదువుతున్న దానికి అర్థం మనకి తెలియదు.

అలా ఒక పండుగ, పూజ, వ్రతము జరుపుకుంటున్నాము. దాని విశేషం మనకు తెలియదు. ఉదాహరణకు సత్యన్నారాయణ స్వామి వ్రతం జరుపుకుంటున్నాం. పూజ పూర్తయిన తరువాత ఐదు అధ్యాయాలు కథలు చెబుతారు. ఒక్కొక్క

అధ్యాయానికి ఒకటి చొప్పున ఐదు అధ్యాయాలకి ఐదు కొబ్బరికాయలు కొట్టాలి. అంతే మనకు తెలిసింది. ఆ కథలలోని అంతరార్థం మనకు తెలియదు.

| | |
|---|---|
| మొదటి అధ్యాయంలో | – వ్రత విధానము |
| రెండవ అధ్యాయంలో | – సంతాన ప్రాప్తి |
| మూడవ అధ్యాయంలో | – వ్రతం చేస్తానని చెయ్యకపోతే కలిగే ఇబ్బంది |
| నాల్గవ అధ్యాయంలో | – వ్రతం చేసి ప్రసాదం తీసుకోకపోతే కలిగే ఇబ్బంది |
| ఐదవ అధ్యాయంలో | – ఏ కులం వారు వ్రతం చేసినా తప్పనిసరిగా మనం ప్రసాదం తీసుకోవాలి. కులమతాలతో పట్టింపు లేదు. |

ఈ విషయాలు కథలో చెప్పబడ్డాయని ఎంతమందికి తెలుసు? కార్తీకమాసంలో ఉసిరి కొమ్మని పాతి అక్కడ భోజనాలు చేస్తాం. ఉసిరి కొమ్మనే ఎందుకు పాతాలి అనే విషయం తెలిసిన వారెందరు? జపమాలను పవిత్రంగా దేవుడి దగ్గర ఉంచాలి. రోజూ దానికి దీప ధూప నైవేద్యాలు సమర్పించాలి. కారణం ఏమిటి? ఇలాంటి విషయాలన్నీ తెలుసుకుని చేస్తే ఫలితం ఎక్కువ ఉంటుంది లేకపోతే అది మూఢాచారం అవుతుంది. గతంలో చెప్పుకున్నాం. వేదం చదివేటప్పుడు, చదువుతున్న దానికి అర్థం తెలిస్తే ఫలితం ఎక్కువగా ఉంటుంది. ఒక చిన్న కథ చూడండి.

పూర్వకాలంలో ఒక గురువుగారు. ఆయనకు ఒక గురుకులం ఉండేది. అందులో అనేకమంది విద్యాభ్యాసం చేసేవారు. ఆధ్యాత్మిక విద్యను కూడా అభ్యసించే వారు. ఒక విద్యార్థికి విద్యాభ్యాసం పూర్తయింది. గురుదక్షిణగా అడవిలో తిరుగుతున్న ఒక చిలకను తెచ్చి ఇమ్మన్నారు గురువుగారు. శిష్యుడు అడవిలోకి వెళ్ళాడు. అడవి అంతా తిరిగాడు. అతడికి చిలక ఎక్కడా కనపడలేదు. సాయంత్రం అవుతోంది. చీకట్లు క్రమ్ముతున్నాయి. అందరూ వేగంగా ఇళ్ళకు పోతున్నారు. ఈ పిల్లవాడు మాత్రం ఒక చెట్టు క్రింద దిగాలుగా కూర్చుని ఉన్నాడు. ఇంటికి వెడుతున్న ఒక బోయవాడు ఈ విద్యార్థిని చూసి ఆశ్చర్యపోయి 'నాయనా ! ఎవరు నువ్వు. ఇదంతా అడవి ప్రాంతం. చీకటి పడుతోంది. క్రూరమృగాలు తిరుగుతాయి. నువ్వు ఈ అడవికి క్రొత్తలా ఉన్నావు. చెట్టుక్రింద ఒంటరిగా కూచున్నావు. నీకేం కావాలి?' అని అడిగాడు. 'మా గురువుగారు చిలకని పట్టుకు రమ్మన్నారు. అడవంతా తిరిగినా

చిలక ఎక్కడా కనిపించలేదు. ఏం చెయ్యాలో తెలియక ఇక్కడ కూర్చున్నాను' అన్నాడు బ్రహ్మచారి. 'ఓరి పిచ్చివాడా! చిలక దొరక్క పోవటమేమిటి. ఇదిగో ఈచెట్టుపైన అన్నీ చిలకలే కదా! ఉండు' అంటూ చెట్టెక్కి ఒక చిలకని పట్టుకుని అతనికి ఇచ్చాడు బోయవాడు. ఇక్కడ చూడండి చిలకను గురించి తెలుసు. కాని అది ఎలా ఉంటుందో, ఎక్కడ ఉంటుందో ప్రత్యక్ష జ్ఞానం లేదు. అందుకే అతనికి ఎంత వెతికినా చిలక దొరకలేదు. చిలక అతనికి దగ్గరలోనే ఉంది. కాని గుర్తించలేక పోయాడు.

ఒక ఊరిలో ఒకచెట్టు మీద ఒకపక్షి గూడు కట్టుకుని గ్రుడ్లు పెట్టింది. ఆ గ్రుడ్లు పిల్లలయినాయి. క్రమంగా పిల్లలు పెరుగుతున్నాయి. ఆ పిల్లలు బయటకు వెళ్ళి ఎక్కడ ప్రమాదంలో పడతాయో అని భయపడి 'ఓ పిల్లల్లారా ! రండి మీకొక పాట నేర్పుతాను' అంది. తల్లిపక్షి. పిల్లలన్నీ తల్లిచుట్టూ చేరాయి.

వేటగాడొస్తున్నాడు – జాగ్రత్త

గింజలు జల్లుతాడు – జాగ్రత్త

వల వేస్తాడు – జాగ్రత్త

పట్టుకుంటాడు – జాగ్రత్త

మెడ విరిచి చంపేస్తాడు – జాగ్రత్త

అంటూ పాట నేర్పింది. పిల్లలు కొద్దిరోజుల్లోనే పాటను పూర్తిగా నేర్చుకుని పాడటం మొదలు పెట్టాయి. తల్లి పక్షి చాలా ధైర్యంగా, వేటగాడొచ్చినా ఫరవాలేదు. అనుకుంటూ ఆహారం కోసం అడవిలోకి వెళ్ళింది.

ఈలోగా వేటగాడొచ్చాడు. వాణ్ణి చూడగానే పక్షి పిల్లలు పాట మొదలు పెట్టాయి.

వేటగాడొచ్చాడు – జాగ్రత్త

అది విన్న వేటగాడు ఆశ్చర్యపోయాడు. లాభం లేదు. చెట్టుచాటున నక్కి గింజలు చల్లుదాం అనుకుని గింజలు విసిరాడు. వెంటనే పక్షిపిల్లలు

గింజలు జల్లుతున్నాడు – జాగ్రత్త

అన్నాయి. ఈసారి మరింత ఆశ్చర్యపోయాడు వేటగాడు. ఏం చెయ్యాలో అర్థం గాక వలవేశాడు.

వలవేశాడు – జాగ్రత్త

అన్నాయి పక్షిపిల్లలు. వేటగాడికి తల తిరిగినంత పనైంది. కాని ఈ లోపలే పాట పాడుకుంటూ వేటగాడు విసిరిన వలమీద వాలి అందులో చిక్కుకున్నాయి పక్షిపిల్లలు.

పట్టుకుంటాడు - జాగ్రత్త

అన్నాయి. వేటగాడు నిదానంగా వాటిని సమీపించి వాటి మెడలు విరుస్తున్నాడు.

మెడ విరుస్తున్నాడు - జాగ్రత్త

అంటూనే అవి చచ్చిపోయాయి. ఈ పక్షిపిల్లలు పాటైతే నేర్చుకున్నాయి గాని, అందులోని అర్థాన్ని గ్రహించలేదు. అందుచేతనే పాట నేర్చుకున్నా, పాడినా దాని ఫలితం వాటికి దక్కలేదు.

అలాగే మనంకూడా అర్థం తెలియకుండా పూజలు, జపాలు, వ్రతాలు ఏం చేసినా, ఎన్ని చేసినా పూర్తి ఫలితం రాదు దాని అర్థం గ్రహించాలి. **అర్థం లేని చదువు వ్యర్థం.**

## 36. గురువు అనుగ్రహం

**ఋణానుబంధరూపేణ పశుపత్ని సుతాదయా**

పూర్వజన్మలలో మనం ఎవరికైనా బాకీ ఉన్నవారు గాని, మనకు బాకీ ఉన్నవారు గాని మనకు భార్య, పిల్లలు, పశువులు పక్షులుగా జన్మిస్తారు.

ఆ బాకీ తీర్చుకోటానికే వారు అలా జన్మించటం జరుగుతుంది. బాకీ తీరేవరకు వారు మనతోనే ఉంటారు. బాకీ తీరిన తరువాత ఎవరి త్రోవన వారు వెళ్ళిపోతారు. ఈ భూమిమీద పుట్టిన ఎవరికైనా ఈ సూత్రం తప్పదు. భగవంతుడైనా సరే. రామావతారంలో శ్రీమహావిష్ణువు శ్రీరాముడుగా జన్మిస్తే ఆదిశేషుడు లక్ష్మణుడిగా జన్మించి, అన్నను సేవించాడు. ఈ రకంగా బాకీ పడ్డాడు శ్రీమహావిష్ణువు ఆదిశేషుడికి. ఈ బాకీ తీరాలి. ఇప్పుడు కాకపోతే తరువాత ఎప్పుడైనా సరే. ఇదంతా కృతయుగంలో జరిగిన కథ. ఈ బాకీ తీరటానికి ద్వాపరయుగంలో శ్రీమహావిష్ణువు శ్రీకృష్ణుడుగా ఆదిశేషుడు బలరాముడిగా జన్మించారు. ఇప్పుడు ఆ బాకీ తీర్చుకోవటానికి అన్నగారిని సేవించాడు శ్రీకృష్ణుడు.

ఎవరికో కొంత ధనం అప్పిచ్చాం. వాళ్ళు తిరిగి ఇవ్వలేదు. ఆనందంగా కాలం గడిపేశారు. మరుజన్మలో ఆ అప్పు వడ్డీతో సహా మనకు ఏదో ఒకరూపంలో తిరిగి చెల్లిస్తారు. మన ఇంట్లో కాపలా కాసే కుక్కలు, పాలిచ్చే పశువులు అన్నీ ఈ కోవకు చెందినవే. ఈ సందర్భంగా ఒక ఆసక్తికరమైన విషయం చూడండి. ఇది యథార్థ సంఘటన అని ఆంధ్రభూమిలో ఇరవై సంవత్సరాల క్రితం ప్రచురితమైంది. ఆ రోజుల్లో ఆంధ్రభూమి మాసపత్రికగా వచ్చేది.

తెలంగాణాలో ఆదిలాబాద్ జిల్లా. అటవీ ప్రాంతం. అక్కడికి ఒకతన్ని ఫారెస్ట్ ఆఫీసరుగా నియమించారు. అతడికి అడవిలోనే నివాస ప్రాంతంలో ఇల్లుకూడా ఇచ్చారు. ఇంకా వివాహం కాలేదు కాబట్టి ఒక్కడే ఉంటున్నాడు. ఒకరోజున అతడు జీపులో వెడుతుండగా త్రోవలో రోడ్డుమీద పడిఉన్న ఒక వ్యక్తిని చూశాడు. అతడు గిరిజనుడు. ఏదో లారీ గుద్దేసింది. గాయపడి అపస్మారంలో ఉన్నాడు. ఆఫీసరు గారు జీపు ఆపి, అతణ్ణి తీసుకువెళ్ళి ఆస్పత్రిలో చేర్పించాడు. కొంతసేపటికి అతడు కళ్ళు మూశాడు.

కాలం గడుస్తోంది. ఈ ఆఫీసరు గారు గిరిజనతండాలోని ఒక స్త్రీతో సంబంధం పెట్టుకున్నాడు. ఈ విషయం గిరిజనులకు తెలిసింది. ఒకరోజున వారందరూ ఆఫీసరుగారిని తన్నటానికి కర్రలు, కత్తులు తీసుకుని ఆయన నివాసానికి వచ్చారు. ఆఫీసరుగారిని బయటకు పిలిచి, ఆయన మీద దాడి చెయ్యబోయారు. మరుక్షణంలో ఏమైందో ఏమో, భయంతో పెద్దగా అరుస్తూ అందరూ పారిపోయారు. ఏం జరిగిందో తెలియక ఆశ్చర్య పోయాడు ఆఫీసరుగారు. ఇలా రెండు మూడుసార్లు జరిగింది. దీన్ని గురించి విచారిస్తే గిరిజనులు చెప్పింది ఏమంటే, ఆఫీసరు గారిమీద దాడి చెయ్యబోయే సమయంలో ఒక పెద్ద ఆకారం పదిఅడుగుల ఎత్తున భయంకరంగా ఆఫీసరు గారి వెనక నిలబడి ఉంది. దాన్ని చూసి భయపడి పారిపోయారు గిరిజనులు. ఈ భయంకరాకారం ఎక్కడి నుంచి వచ్చింది అనేది విచారిస్తే, గతంలో ఆఫీసరు గారు ప్రమాదంలో ఉన్న ఒక వ్యక్తిని ఆస్పత్రిలో చేర్పించారు. అందుకు కృతజ్ఞతగా ఆ వ్యక్తి తాలూకు ఆత్మ ఆఫీసరు గారిని రక్షిస్తోంది. అంటే అతడు చేసిన సహాయానికి కృతజ్ఞతగా తన ఋణం తీర్చుకుంటోంది. ఈ రకంగా ఎవరి దగ్గర బాకీ పడినా, ఎవరికి సహాయం చేసినా, మంచిగాని, చెడుగాని వడ్డీతో సహా తిరిగి చెల్లించాల్సిందే సందేహం లేదు. ఈ బాకీల నుంచి బయటపడటం ఎలా? అంటే – మంచి గురువే శరణ్యం. సద్గురువు ఒక్కడే ఈ బాకీల నుంచి సాధకుణ్ణి బయట పడెయ్యగలడు.

పూర్వకాలంలో ఒక గ్రామానికి ఒక సాధువు వచ్చాడు. ప్రతిరోజు ఊరి మధ్యలో ఉన్న రావిచెట్టు క్రింద కూర్చుని సాయంత్రం పూట నాలుగు మంచి మాటలు చెబుతున్నాడు. ఊళ్ళో జనం భక్తిశ్రద్ధలతో వింటున్నారు. భగవంతుడు అపారమైన కరుణామయుడు. ఆర్తితో ఒకసారి పిలిచినా చాలు పరుగెత్తుకు వస్తాడు. అంటూ ఉదాహరణగా గజేంద్రమోక్షం కథ వివరించి, మీరందరూ కూడా హరినామస్మరణ చేయండి. దానివల్ల సర్వపాపాలు హరించి కైవల్యం పొందుతారు" అని చెప్పాడు.

ఆ కథ, ఆయన చెప్పిన తీరు అందరికీ బాగా నచ్చింది. అక్కడున్న వారంతా ఆయన్ను తెగమెచ్చుకున్నారు. ఒకరైతు ఆయన దగ్గరకు వచ్చి నమస్కారం చేసి "స్వామీ ! నాక్కూడా శ్రీహరిని స్మరించాలని ఉంది. ఏ రకంగా చెయ్యాలో చెప్పి పుణ్యం కట్టుకోండి" అన్నాడు. 'అలాగే ! నారాయణ మంత్రం చెబుతాను. కాని ఒక షరతు. నీకు పుట్టబోయే బిడ్డలను నాకు ఇచ్చెయ్యాలి. దీనికి ఒప్పుకుంటే మంత్రం చెబుతాను" అన్నాడు. ఆ మాటలు విన్న రైతు 'స్వామీ ! నా భార్య గర్భవతి, ఈ షరతుకు అంగీకరిస్తుందో లేదో నాకు తెలియదు. నేను ఇంటికి వెళ్ళి, ఆమెను అడిగి వస్తాను" అని చెప్పి ఇంటికి వెళ్ళాడు రైతు. జరిగిన విషయమంతా భార్యకు చెప్పాడు. ఆ మాటలు విన్న భార్య 'మన బిడ్డ మనదగ్గర కన్న స్వామీజీ దగ్గర పెరగటమే క్షేమం. అలాగే మనకు బిడ్డ పుట్టగానే స్వామికి ఇచ్చేద్దాం. అంది. రైతు స్వామితో 'నా భార్య ఒప్పుకున్నది. మాకు బిడ్డ పుట్టగానే మీకు ఇచ్చేస్తాము' అన్నాడు. సంతోషించిన స్వామి రైతుకు అష్టాక్షరీ మంత్రోపదేశం చేశాడు. కొద్దిరోజులకే రైతుకు మగపిల్లవాడు పుట్టాడు. అన్న మాట ప్రకారం పిల్లవాణ్ణి వెంటనే గురువుగారికి అర్పించాడు రైతు. గురువుగారు ఆ పిల్లవాణ్ణి దూరంగా తీసుకువెళ్ళి గొయ్యి తీయించి అందులో పాతిపెట్టేశాడు. ఇదంతా రైతు చూస్తూనే ఉన్నాడు. పిల్లవాణ్ణి స్వామికి గురుదక్షిణగా సమర్పించేశాడు. వాడిమీద తనకు ఏ రకమైన హక్కులేదు. గురువు గారు తనమంచికే ఈ పనిచేసి ఉంటారు అనుకున్నాడు. ఏమీ మాట్లాడకుండా ఇంటికి వెళ్ళి జరిగిన సంగతంతా భార్యకు చెప్పాడు. ఆవిడకుడా గురువు గారి మీద నమ్మకంతో ఏమీ అనలేదు.

కాలం గడుస్తోంది. రైతు భార్య మళ్ళీ గర్భం ధరించింది. ఈసారి కూడా మగపిల్లవాడే పుట్టాడు. వాణ్ణికూడా గురువుగారికి అర్పించాడు రైతు. గతంలో మాదిరిగానే ఆ పిల్లవాణ్ణి కూడా గోతులో పాతిపెట్టేశాడు గురువుగారు రైతు దంపతులు

కిమ్మనలేదు. రైతు భార్య మూడోసారి గర్భం ధరించి మగపిల్ల వాణ్ణి కన్నది. పిల్లవాణ్ణి గురువుగారికి ఇస్తాను అన్నాడు రైతు. "గతంలో ఇద్దరు పిల్లల్ని చంపేశాడు. ఈ పిల్లవాణ్ణి కూడా చంపటానికి నేను ఒప్పుకోను. పిల్లవాణ్ణి ఇవ్వను" అని తేల్చి చెప్పింది రైతు భార్య. ఇదే విషయాన్ని గురువుగారికి వివరించి తన అశక్తతని వ్యక్తం చేశాడు రైతు. గురువుగారే స్వయంగా రైతు ఇంటికి వచ్చి రైతు భార్యని పిల్లవాణ్ణి ఇమ్మని అడిగాడు. ఆవిడ శశేమిరా అంది.

అప్పుడు గురువుగారు రైతు దంపతులతో "పిల్లవాణ్ణి నాకు ఇవ్వనవసరం లేదు. వాణ్ణి తీసుకుని నాతో రండి. ఏం జరిగిందో చూపిస్తాను. పోయారనుకుంటున్న మీ పిల్లల గురించి తెలుసుకుందురు గాని, ఈ పిల్లవాణ్ణి నేను ఏమీ చెయ్యను. నాతోరండి" అన్నాడు. పిల్లవాణ్ణి తీసుకుని గురువుగారితో బయల్దేరారు రైతు దంపతులు.

గురువుగారు సరాసరి, గతంలో తాను పాతిపెట్టిన ఇద్దరు పిల్లల సమాధుల దగ్గరకు వెళ్ళి, ఈ పిల్లవాణ్ణి ఆ రెండు సమాధుల మధ్యన పడుకోబెట్టి, రైతు దంపతులను దూరంగా నుంచోమని, ఏవో మంత్రాలు చదివాడు. ఇప్పుడు సమాధుల్లోంచి మాటలు వినిపిస్తున్నాయి. ముందుగా రెండవ గోతిలోని పిల్లవాడు మొదటి గోతిలోని వాడిని అడుగుతున్నాడు.

నువ్వెందుకు వచ్చావు?

ఈ రైతు నాకు బాకీ ఉన్నాడు. ఆ బాకీ వసూలు చేసుకుందామని వచ్చాను. మరి నువ్వెందుకు వచ్చావు?

ఈ రైతు గతజన్మలో నాక్కూడా చాలా బాకీ ఉన్నాడు. ఆ బాకీ వడ్డీతో సహా వసూలు చేసుకుని వెళ్ళిపోదామనుకున్నాను. ఇంతలో ఈ స్వామీజీ అడ్డు తగిలాడు.

ఇప్పుడు ఆ ఇద్దరూ కలిసి రెండు సమాధుల మధ్యన ఉన్న పిల్లవాణ్ణి అడిగారు.

నువ్వెందుకు వచ్చావు?

గతజన్మలో నేను రైతుకు ఋణపడి ఉన్నాను. ఈ జన్మలో ఆయన్ను సేవించి, సుఖపెట్టి ఆ ఋణం తీర్చుకోవటానికి వచ్చాను.

ఈ మాటలు విన్నారు రైతు దంపతులు ఆశ్చర్యపోయారు. మొదటి ఇద్దరు బిడ్డలు గతజన్మలో తాము బాకీ ఉన్నవాళ్ళు ఆ బాకీ వసూలు చేసుకోటానికి ఇలా

వచ్చారు. కాని గురువుగారి అనుగ్రహంతో ఆ బాకీ రద్దయిపోయింది. మూడో పిల్లవాడు తమను ఉద్ధరించటానికి వచ్చాడు. అందుకే గురువుగారు అతణ్ణి పాతిపెట్టలేదు.

**గురువు అనుగ్రహం చాలా గొప్పది. అతడు తలచుకుంటే ఏమైనా చెయ్యగలడు. గతజన్మలలో చేసిన సంచితకర్మనంతా క్షయం చేసి మోక్షాన్ని ప్రసాదించగలడు.** అందుకే గురువుగారి అనుగ్రహం **అద్వితీయం.**

## 37. పూజ

సామాన్యంగా పూజ అనే పదాన్ని మనం వాడేస్తుంటాం. మా యింట్లో ప్రతిరోజు పూజ జరుగుతుంది అంటాం. అమ్మవారికి అర్చన చేస్తున్నాము అంటాం.

వినాయకుడు – తర్పణ ప్రియుడు

విష్ణువు – అలంకార ప్రియుడు

శివుడు – అభిషేక ప్రియుడు

అమ్మవారికి – అర్చన అంటే ఇష్టం

పూజ అంటే – గౌరవము. పూజించటము అంటే – గౌరవించటము అని అర్థం. అర్చన అనే పదాన్ని విశేషమైన పూజ అనే అర్థంలో వాడతాం. భగవంతుణ్ణి పూజించటము అంటే ఆయన్ను పిలిచి కూర్చోబెట్టి అర్ఘ్యపాద్యాదులు, ధూప దీప నైవేద్యాలు సమర్పించటము. భగవంతుణ్ణి రెండు రకాలుగా ఆరాధిస్తాం. 1.సాకారము 2. నిరాకారము. సాకారారాధనలోనే పూజ అనేది ఉంటుంది. పూజ అనేది ఇలా ఉండాలి అని ఏ వేదము చెప్పలేదు. ఇది కేవలం సంప్రదాయం. ప్రపంచంలో ఏ మతంవారైనా సరే సాకారారాధన చేసేవారందరికి పూజ అనేది ఉంటుంది. పూజావిధానం వేరు కావచ్చు. కొందరు నేతితో దీపాలు పెడితే, కొంతమంది నూనెతో దీపాలు పెడతారు. వారి తాహతును బట్టి మట్టిప్రమిదలు, ఇత్తడి, కంచు, వెండి, బంగారు ప్రమిదలు వాడతారు. కొంతమంది పూజకు మామూలు పూలు వాడితే, కొందరు జిల్లేడువంటి విశేషమైన పూలు వాడతారు. ఇంకొందరు వెండిపూలు, బంగారపు పూలు వాడతారు. నివేదన కూడా అంతే. రకరకాల పదార్థాలు. కొందరు శాఖాహారం కొందరు మాంసాహారం. ఇలా భిన్న పద్ధతులలో పూజ జరుగుతుంది. కౌళాచారము, సమయాచారము, వామాచారము, దక్షిణాచారము ఇలా ఆచారాలను

బట్టి పూజావిధానము, అందులో వాడే వస్తువులను నిర్దేశించారు అనుభవజ్ఞులైన పూర్వీకులు. ముందుగా **సాకారార్చన** చూద్దాం.

సాకారము అంటే **సాధకానాం హితార్థాయ బ్రహ్మణోరూపకల్పనా** మానవుడి కోరికల ననుసరించి భగవంతుడికి ఒకరూపం కల్పించబడింది. ఆ రూపాన్ని ఒక విగ్రహాన్ని పూజించటం జరుగుతుంది. ఈ విధానంలో అనేక పద్ధతులున్నాయి. 1.లమిత్యాది పంచపూజలు 2.షోడశోపచార పూజ 3. చతుషష్టి ఉపచారాలు.

**1. పంచపూజలు :** పరమేశ్వరుని నుంచే పంచతన్మాత్రలు వాటి నుంచి పంచభూతాలు ఆవిర్భవించినాయి. అందుకే పరమేశ్వరుడికి పంచభూతాల తత్త్వాలతో అర్చన చెయ్యటం జరుగుతుంది.

లం పృథివీతత్త్వాత్మికాయై గంధం సమర్పయామి

హం ఆకాశతత్త్వాత్మికాయై పుష్పం సమర్పయామి

యం వాయుతత్త్వాత్మికాయై ధూపం సమర్పయామి

రం తేజస్తత్త్వాత్మికాయై దీపం సమర్పయామి

వం అమృతత్త్వాత్మికాయై నైవేద్యం సమర్పయామి

సం సర్వతత్త్వాత్మికాయై సర్వోపచారాన్ సమర్పయామి

సామాన్యంగా మంత్రజపం చేసే ముందు, తరువాత దేవతకు పంచపూజలు చెయ్యటం జరుగుతుంది.

**2. షోడశోపచారపూజ :** మన ఇంట్లో గాని, బైటగాని, ఎప్పుడైనా, ఎక్కడైనా భగవంతుడికి చేసేది షోడశోపచార పూజ. ఇందులో 16 రకాల ఉపచారాలుంటాయి.

1. ఆవాహన
2. ఆసనము
3. పాద్యము
4. అర్ఘ్యము
5. ఆచమనము
6. స్నానం
7. వస్త్రం
8. యజ్ఞోపవీతం
9. గంధం
10. పూజ (పుష్పం)
11. ధూపం
12. దీపం
13. నైవేద్యం
14. తాంబూలం
15. నీరాజనం
16. మంత్రపుష్పం

**3. చతుష్షష్టి ఉపచారాలు :** ఇందులో 64 రకాల ఉపచారాలుంటాయి. విశేషమైన సమయాల్లో మాత్రమే ఈ పూజ చేస్తారు.

పంచోపచారాలు, షోడశోపచారాలు, చతుష్షష్టి ఉపచారాలు అన్నీ కూడా బాహ్య పూజలే. ఐహిక సాధన కోసం అంటే కోరికలు తీరటం కోసం ఈ రకమైన పూజలు చేస్తారు. చతుష్షష్టి ఉపచారాలంటే –

1. పాద్యము
2. ఆభరణావరోపణం
3. సుగంధితైలాభ్యంగం
4. మజ్జనశాలాప్రవేశనం
5. మజ్జనశాలామణిపీఠోపవేశనం
6. దివ్యస్నానీ యోద్వర్తనం
7. ఉష్ణోదకస్నానం
8. సకల తీర్థాభిషేకం
9. వస్త్రం
10. అరుణదుకూల పరిధానం
11. అరుణకుచోత్తరీయం
12. ఆ లేపమంటప ప్రవేశనం
13. ఆ లేపమంటపమణి పీఠోపవేశనం
14. చందనాగరుకస్తూరిలేపనం
15. కాలాగరుధూపం
16. కుసుమమాలా
17. భూషణమంటప ప్రవేశనం
18. భూషణమంటపమణి పీఠోపవేశనం
19. నవమణిమకుటం
20. చంద్రశకలం
21. సీమంతసింధూరం
22. తిలకరత్నం
23. కాలాంజనం
24. నాళీయుగళం
25. మణికుండలయుగళం
26. నాసాభరణం
27. అధరయావకం
28. మాంగల్యం
29. కనకచింతాకం
30. పథకం
31. మహాపథకం
32. ముక్తావళి
33. ఏకావళి
34. ఛన్నపీఠం
35. కేయూరయుగళచతుష్టయం
36. వలయావళి
37. ఊర్మికావళి
38. కాంచీదామం
39. కటిసూత్రం
40. సౌభాగ్యాభరణం
41. పాదకటకం
42. రత్ననూపురం
43. పాదాంగుళీయకం
44. పాశం

45. అంకుశం
46. పుండ్రేక్షుచాపం
47. పుష్పబాణం
48. మాణిక్యపాదుక
49. మహాచక్రాధిరోహణం
50. కామేశ్వరాంకోపవేశనం
51. అమృతావచషకం
52. ఆచమనం
53. కర్పూరవీటికా
54. ఆనందోల్లాసవిలాసహాసం
55. ఛత్రం
56. చామరయుగళం
57. దర్పణం
58. తాళవృంతం
59. గంధం
60. పుష్పం
61. ధూపం
62. దీపం
63. నైవేద్యం
64. తాంబూలం

**2. అంతఃపూజ:** పరమేశ్వరుడు నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు. చరాచర జగత్తంతా ఆచరించి ఉన్నాడు. పిపీలికాది బ్రహ్మ పర్యంతము నిండి ఉన్నాడు. అన్ని జీవుల యందు అన్ని వస్తువుల యందు ఉన్నాడు. పరమేశ్వరుడు ఎక్కడ ఉన్నాడు? అని తండ్రియైన హిరణ్యకశ్యపుడు అడిగినప్పుడు

**ఇందుగల డందులేడను సందేహము వలదు, సర్వోపగతుండు చక్రి** అంటాడు ప్రహ్లాదుడు. నిర్దిష్టంగా ఒకచోటే కాదు ఎక్కడ కావాలంటే అక్కడ ఉన్నాడు. ప్రతిచోట, ప్రతిజీవి యందు, ప్రతి ప్రదేశంలోను, ప్రతివస్తువు నందు ఉన్నాడు అని చెప్పాడు. దానికి నిదర్శనంగానే స్తంభంలోంచి బయటకు వచ్చాడు హరి.

నిజంగా చెప్పాలంటే ఆ పరమేశ్వరుడు ఎక్కడో లేడు. నీ యందు ఉన్నాడు.

**దేహోదేవాలయ ప్రోక్తో జీవో దేవస్సనాతనః** అంటోంది స్కందోపనిషత్తు. దేహమే దేవాలయం. అందులో ఉన్న జీవుడే సనాతనుడైన పరబ్రహ్మ. **అహంబ్రహ్మాస్మి** నేనే పరబ్రహ్మని అంటోంది బృహదారణ్యకోపనిషత్తు

**తత్త్వమసి** నువ్వే పరబ్రహ్మావు అంటోంది ఛాందోగ్యోపనిషత్తు.

ఈ భావనతోనే అర్చన జరగాలి అంటారు వేదాంతులు. **భావనోపనిషత్తు**లో అంతరారాధన గురించి వివరించటం జరిగింది. మోక్షగామి నేనే పరబ్రహ్మని అని భావన చేస్తాడు. అరిషడ్వర్గాలు, రాగద్వేషాలు, అహంకార మమకారాలు వదిలేసిన వాడు, జగత్తులోని ప్రతివస్తువు నందు, ప్రతిప్రాణి యందు పరమాత్మని చూడగలవాడు

మాత్రమే మోక్షం పొందుతాడు. అందుకే లలితా సహస్రంలో రాగ స్వరూప పాశాఢ్యా, క్రోధాకారాంకుశోజ్వలా, మనోరూపేక్షు కోదండా అన్నారు. రాగము అంటే అభిమానము, ప్రేమ, కోరిక. ఇవే మానవుడిని కట్టిపడేసే పాశాలు. క్రోధము ఇదే కోపము. అంకుశం లాగా ఇతరులను బాధిస్తుంది. కాబట్టి ఆ రెండింటినీ అమ్మవారికి అర్పించెయ్యాలి. ఇక మనస్సు. బంధమోక్షాలకు కారణం ఇదే. కాబట్టి ఈ మనసును కూడా దేవికి సమర్పణ చెయ్యాలి. అంటే అన్నింటినీ వదిలెయ్యాలి **వామకేశ్వర తంత్రం**లో చెప్పినట్లు

**పాశాంకుశాతదీయౌతు రాగద్వేషాత్మకా స్మృతౌ**
**శబ్ద స్పర్శాదయోబాణాః మనస్తస్యా భవద్ధనుః**
**కరణేంద్రియచక్రస్థాం దేవీం సంవిత్స్వరూపిణీం**
**విశ్వాహంకార పుష్పేణ పూజయేత్సర్వ సిద్ధిభాక్**

సాధకుడు రాగద్వేషాలను వదిలిపెట్టి, మనసును నిశ్చలం చేసి, అహంకారమనే పుష్పంతో పరమేశ్వరిని అర్చిస్తే, అన్ని సిద్ధులు పొందుతాడు. మోక్షం పొందుతాడు.

## 38. సప్త ప్రమాణాలు

'ప్రమాదము' అంటే అనుకోకుండా సంభవించే విపత్తు, ఆపద, కష్టము. ఇది ఊహించకుండా జరుగుతుంది. మనం బయట రోడ్డుమీద వెడుతుంటాం. అనుకోకుండా వెనక నుంచి ఏ లారీనో వచ్చి గుద్దేస్తుంది. దాంతో ఎగిరి అవతల పడతాం. రోడ్డుమీద పడితే బలమైన దెబ్బ తగుల్తుంది. అది శరీరంలోని ఏ భాగానికైనా కావచ్చు. సున్నితమైన ప్రదేశాలలో, లేదా ముఖ్యమైన తల, గుండె లాంటి ప్రదేశాలలో గనక బలమైన దెబ్బ తగిలితే ప్రాణానికే ప్రమాదం ఏర్పడుతుంది. ఒక్కోసారి వెనక నుంచి లేదా ప్రక్క నుంచి వచ్చి ఢీ కొట్టిన వాహనం టైర్ల క్రింద పడి నలిగిపోతాం. మరుక్షణంలోనే, అక్కడికక్కడే ప్రాణాలు పోతాయి. ఈ ప్రమాదాలు ఏవీ చెప్పిరావు. అనుకోకుండానే జరుగుతాయి. ఒక యధార్థ సంఘటన చూడండి.

ఒక తల్లి. కుమారుడు పదవక్లాసు చదువుతున్నాడు. స్కూలుకు వెళ్ళాడు. మధ్యాహ్నం పదకొండు గంటల సమయంలో తల్లి మార్కెట్ వెళ్ళింది. టైము ఒంటి గంట కావస్తోంది. పిల్లవాడు, భర్తకూడా భోజనానికి వస్తారు. ఆదరాబాదరాగా ఆటో ఎక్కి ఇంటికి వస్తోంది. త్రోవలో ట్రాఫిక్ జామ్ అయింది. జనం గుమికూడారు.

ఏమైంది? అని ఆరా తీస్తే ఎవరో పిల్లవారు లారీ క్రింద పడ్డాడు అని చెప్పారు. భయంకరమైన ఆ దృశ్యాన్ని నేను చూడలేను. ప్రక్కదారి గుండా వెళ్ళిపోదాం. అంది ఆటోవాలాతో. ఇంటికి చేరి తలుపుతాళం తీస్తుండగా ప్రక్కవాళ్ళు చెప్పారు. 'మీ పిల్లవాడికి ప్రమాదం జరిగింది ఫలానాచోట లారీక్రింద పడ్డాడు.' అని. అంటే ఇందాక త్రోవలో తనకు కనిపించిన ప్రమాదం అదే అన్నమాట. ఆ దృశ్యం చూడలేనని ప్రక్కనుంచి వచ్చేసింది. తన కుమారుడు స్కూలు నుంచి వస్తూ లారీక్రింద పడి మరణించాడు. విషయం తెలియగానే కుప్పకూలిపోయింది తల్లి. అంతదాకా ఎందుకు? మన రాష్ట్రాన్ని పాలించిన ముఖ్యమంత్రి డా॥ వై.యస్. రాజశేఖర రెడ్డిగారు. హెలికాప్టర్‌లో బయలుదేరారు. ఏమైందో తెలియదు. హెలికాప్టరు కాస్తా పేలిపోయింది. రెడ్డిగారు మరణించారు. శరీర అవశేషాలు కూడా దొరకలేదు. ఆ తరువాత పరిశోధనలు చేసి వాతావరణం బాగుండకపోవటం చేత దారి కనపడక హెలికాప్టరు కొండకు గుద్దుకుంది అన్నారు. ఎలాగైతే నేం ముఖ్యమంత్రిగారు విమాన ప్రమాదంలో మరణించారు.

ఇలాంటివి అనేక సంఘటనలు. ప్రమాదం జరిగినప్పుడు మన తప్పు ఏమీ లేకపోవచ్చు. అర్థరాత్రి పూట రోడ్డు ప్రక్కన నిద్రిస్తున్నారు కొందరు. బాగా త్రాగి వేగంగా కారు నడిపి నిద్ర పోతున్నవారి మీద నుంచి కారు పోనిచ్చాడు ఒక వ్యక్తి. ఆ ప్రమాదంలో చాలామంది చనిపోయారు. ఇలాంటి సంఘటనలలో మన తప్పు ఏ మాత్రం ఉండదు కాని బాధితులం మాత్రం మనమే.

కొన్ని సందర్భాలలో మన అజాగర్త వల్ల కూడా ప్రమాదాలు జరుగుతాయి. రోడ్డు దాటుతుంటాము. వేగంగా వచ్చిన వాహనం 'ఢీ' కొడుతుంది. ఆ ప్రమాదంలో కాలు పోవచ్చు, చెయ్యి విరగచ్చు. చివరకు ప్రాణాలు కూడా పోవచ్చు. దురదృష్టవంతుడు ఎక్కడికి వెళ్ళినా, ఆపదలు అతనివెనకే ఉంటాయి. **దరిద్రుడు ఏ రేవుకు వెళ్ళినా మళ్ళీ పరిగే** అనేది సామెత. ఇదే విషయాన్ని 'భర్తృహరి' తన సుభాషితాల్లో **'దైవోపహతుండు పోవు కడకున్ పోవుంగదా ఆపదల్'** దురదృష్టవంతుణ్ణి ఆపదలు వెన్నంటే ఉంటాయి అంటాడు.

ప్రమాదం జరిగినంత మాత్రాన మనకి నష్టం జరగాలని, ఆపద సంభవించాలని ఏమీలేదు. ఒకసారి కారు ప్రమాదం జరిగింది. కారులో ఐదుగురు ప్రయాణం చేస్తున్నారు. కారు వేగంగా వెళ్ళి ముందు ఆగిఉన్న టిప్పరును ఢీ కొట్టింది. కారు

నుజ్జునుజ్జయింది. కారులో ఉన్నవారు ఇద్దరు అక్కడికక్కడే మరణించగా మిగిలిన ముగ్గురు ఆస్పత్రిలో మరణించారు. విచిత్రం ఏమంటే కారులో మూడునెలల పసిపాప కూడా ఉంది. ప్రమాదం జరిగినప్పుడు ఆ అదురుకి కారు తలుపులన్నీ తెరుచుకున్నాయి. పసిపాప ఎగిరి రోడ్డు ప్రక్కన ఉన్న చెట్ల దుబ్బులలో పడింది. ఏ మాత్రం దెబ్బతగల్లా. వంటిమీద రక్తపు చుక్క కూడా కనిపించలా. పాపమాత్రం బ్రతికింది. పాప బ్రతకటం అదృష్టమా? తల్లి, తండ్రి అయినవాళ్ళు అందరినీ పోగొట్టుకుని ఒంటరిగా బ్రతకటం దురదృష్టమా? ఏమనాలి? ఏది ఏమైనా ప్రమాదం జరిగినప్పుడు ఫలితం మన అదృష్టం మీదే ఆధారపడి ఉంటుందనేది మాత్రం యథార్థం. 'నీచాతినీచమైన పనులు చేసినవారు నీచమైన చావు చస్తారు' అంటోంది ఉపనిషత్తు. ఇవన్నీ అనుకోకుండా రోడ్డుమీద జరిగే ప్రమాదాలు. వీటికన్న ఘోరమైన ప్రమాదాలున్నాయి. ఇవి ఒక మనిషినే కాదు ఒక్కొక్కసారి సమాజాన్నే నాశనం చేస్తాయి. వీటినే **'సప్తప్రమాదాలు'** అంటాడు **మహాత్మాగాంధీ.** అవి వరుసగా

1. కష్టపడకుండా వచ్చే డబ్బు
2. ఏ మాత్రం వివేకం లేని వినోదం
3. మానవత్వం లేని సైన్సు
4. వ్యక్తిత్వం లేని విజ్ఞానం
5. నీతి, నిజాయితీ సూత్రబద్ధత లేని రాజకీయం
6. నీతి నియమాల్లేని వ్యాపారం
7. త్యాగం లేని మతం

వీటిని కొద్దిగా విశ్లేషిద్దాం

**1. కష్టపడకుండా వచ్చే డబ్బు :** ఏదైనా సరే కష్టపడి సంపాదిస్తేనే దాని విలువ తెలుస్తుంది. మన సంగతే చూడండి. మనం కష్టపడి సంపాదించిన ఆస్తిమీద ఉన్న మమకారం, జాగ్రత్త, తాత ముత్తాతలనుంచి వచ్చిన ఆస్తిమీద ఉండదు. కష్టపడి సంపాదించిన ధనాన్ని జాగ్రత్తగా ఖర్చుపెడతాం. కష్ట పడకుండా ఉత్త ఉడియంగా డబ్బు వస్తే జల్సా చేస్తాం. దీనివల్ల నీకే కాదు సమాజానికి కూడా హాని జరుగుతుంది.

**2. వివేకం లేని వినోదం :** వినోదం అంటే ఇష్టం లేనివారుండరు. అలా అని వినోదం హద్దులు దాటరాదు. ఇతరులను హేళన చెయ్యరాదు. ఒకసారి ఒక డైరెక్టరు

గారు సినిమా తీశారు. అందులో అశ్లీల దృశ్యాలు చాలా ఉన్నాయి. అశ్లీలత కూడా మోతాదుకు రెట్టింపు దాకా ఉంది. సినిమా బ్రహ్మాండంగా ఆడుతోంది. హౌస్‌ఫుల్ కలెక్షన్లు. తన సినిమా బాగా దరణ పొందటంతో డైరెక్టరుగారు నటి జమునను సినిమా చూడటానికి ఆహ్వానించారు.

సినిమా మధ్యలో మోతాదుకు మించిన అశ్లీలం ఏరులై పారుతోంది. మధ్యలో డైరెక్టరు గారు జమునను అడిగారు సినిమా ఎలా ఉంది? అని అప్పుడు శ్రీమతి జమున డైరెక్టరు గారిని చూసి 'ఈ సినిమాని నీ కొడుకుతో గాని, నీ భార్యతో గాని కలిసి నువ్వు చూడగలవా? అని అడిగింది. అవాక్కయ్యాడు డైరెక్టరు. తలదించుకున్నాడు. జమున లేచి వెళ్ళిపోయింది. హాస్యం ఉండాలి కాని అపహాస్యం పనికిరాదు. శృంగారం ఉండాలి కాని అశ్లీలం పనికిరాదు. విమర్శ ఉండాలి. కాని దూషణ పనికిరాదు. మొత్తంమీద వినోదంలో వివేకం ఉండాలి.

**3. మానవత్వం లేని సైన్సు :** సైన్సు అంటే విజ్ఞానం. ఇది దేశాభివృద్ధికి ఉపయోగించాలి. అంతేకాని వినాశనానికి మాత్రం కాదు. మనం ఏదైనా ఒక విషయాన్ని పరిశోధించేటప్పుడు సమాజ ప్రయోజనాలకు, దేశ ప్రయోజనాలకు అది ఎంత వరకు ఉపయోగపడుతుందో జాగ్రత్తగా చూడాలి. సమాజానికి హాని కలిగించే పనులు మనం చెయ్యరాదు.

**4. వ్యక్తిత్వం లేని విజ్ఞానం :** విజ్ఞానం ఎంత అభివృద్ధి చెందినా నీ వ్యక్తిత్వాన్ని పోగొట్టుకోరాదు. విజ్ఞానానికి బానిస కారాదు.

**5. సూత్రబద్ధత లేని రాజకీయం :** రాజకీయాంలో నీతి నియమాలుండవు. ఇచ్చిన మాట నిలబెట్టుకోవట ముండదు. ఇందులో కావాల్సింది అధికారం. అధికారం పొందటానికి ఎన్ని పనులైనా చేస్తారు. అందుకే **'ఓ రాక్షసీ ! నీ పేరు రాజకీయమా? అయితే వర్ధిల్లు'** అన్నారు. అటువంటి రాజకీయం పనికిరాదు. సమాజం నాశనమై పోతుంది.

**6. నీతినియమాల్లేని వ్యాపారం :** లాభం కోసం చేసేది వ్యాపారం. లాభం వస్తుంది కదా అని అడ్డమైన పనులు చెయ్యరాదు. ఆహార పదార్థాల్లో కల్తీ చెయ్యటం, దీపారాధన చేసే ఆవు నేతిలో గొడ్డు కొవ్వు కలపటం. తినుబండారాలలో హానికరమైన రంగులు కలపటం, చిన్నపిల్లలు తినే ఐస్‌క్రీంలు, చాక్లెట్లలో మత్తు పదార్థాలు కలపటం వంటివి సమాజానికి హాని కలిగిస్తాయి. వ్యాపారం చెయ్యండి. లాభాలు

సంపాదించండి. అంతేకాని తప్పుడు తూకాలు, నాణ్యత లేని వస్తువులలో జనజీవనానికి హాని కలిగించకండి.

**7. త్యాగం లేని మతం :** సమాజంలోని ప్రజలను సరైన మార్గంలో నడిపించటానికి ఏర్పాటైనదే మతము. ఎవరి మతాన్ని వారు అనుసరించాలి. ఇందులో తప్పులేదు. కాని ఎదుటి మతాలను విమర్శించరాదు. ఎదుటివారికి హాని చెయ్యరాదు. అవసరమైతే ప్రాణత్యాగం చెయ్యటానికైనా సిద్ధంగా ఉండాలి. చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. అనేభావన కలిగి ఉండాలి. మన మతాన్ని పెంచుకోవటానకి ఇతర మతాలను అవమానించటం, హింసించటం వంటివి చెయ్యరాదు.

ఈ ఏడు చాలా పెద్ద ప్రమాదాలు. వీటివల్ల ఒక వ్యక్తికే కాదు సమాజ మంతటికీ నష్టం వస్తుంది. ఇవి అనుకోకుండా సంభవించేవి కాదు. కావాలని చేసే అత్యంత భయంకరమైన ప్రమాదాలు. మానవుడు వీటినుంచి బయటపడే ప్రయత్నం చెయ్యాలి.

## 39. మనసును గాయపరచద్దు

ఎదుటి వ్యక్తి మీద కోపం వచ్చినప్పుడు ముందు వెనక చూడకుండా, వేరే ఆలోచన లేకుండా, నోటికి ఏది వస్తే అది మాట్లాడతాం. ఆ సమయంలో ఉచ్ఛనీచాలు కూడా ఆలోచించం. దాంతో అవతలి వ్యక్తి మనమంటే హడలిపోతాడు. మన జోలికి రాడు. ఒక్కోసారైతే మనం అన్న మాటలకు అతడు చాలా కాలం బాధ పడతాడు. పదిమందిలోను తలవంచుకుని వెళ్ళిపోతాడు. అవమానంతో క్రుంగిపోతాడు. ఇలా ఎందుకు జరుగుతుంది? అంటే మన అహంకారం. ఈ అహంకారం వల్లే నోటికి వచ్చినట్లు మాట్లాడతాం. ఎదుటి వ్యక్తి ఎటువంటి వాడైనా లెక్క చెయ్యం. ఒక్కోసారి తప్పనిసరి పరిస్థితుల్లో 'సారీనయ్యా! ఏమనుకోకు. ఏదో కోపంలో అలా మాట్లాడేశాను. ఆ మాటలేం పెద్దగా పట్టించుకోకు' అంటాం. దీంతో ఎదుటి వ్యక్తి పడ్డ అవమానం మాసిపోతుందా? అంటే లేదనే చెప్పాలి. దెబ్బ కొట్టావు. గాయమైంది. సారీ చెప్పినంత మాత్రాన గాయం మాసిపోదు గదా. ఆ గాయం తాలూకు బాధ అతడు భరించాల్సిందే.

ఎదుటి వ్యక్తిలో అన్నీ తప్పులే గాని ఒప్పులుండవా? అతడు చేసిన చెడుపనులే కాని, మంచిపనులు కనిపించవా? నిశతంగా పరిశీలిస్తే, మంచి పనులు ఉంటాయి. కాని అహంకారం ఆవరించిన మన కళ్ళకి ఆ మంచిపనులు కనిపించవు.

షిరిడీ సాయిబాబా ఆశ్రమంలో ఇద్దరు వ్యక్తులున్నారు. బాబాకు ఇద్దరూ ప్రీతిపాత్రులే. వీరిలో ఒకరు మెతక మనిషైతే రెండవ వాడికి దూకుడు ఎక్కువ. ఒకసారి ఏదో ఒకమాట మీద ఇద్దరికీ అభిప్రాయ భేదం వచ్చింది. రెండవ వ్యక్తికి కొంచెం నోరెక్కువ కాబట్టి మొదటి వ్యక్తిని నోటికొచ్చినట్లు మాట్లాడాడు. దాంతో అతను (మొదటి వ్యక్తి) అవమానంతో క్రుంగిపోయాడు. పదిమందిలోకి రాలేకపోతున్నాడు. పరుషంగా మాట్లాడిన వాడు చాలా సంతోషిస్తున్నాడు. జరిగిన విషయం ఆశ్రమంలో అందరికీ తెలిసింది. బాబాకి కూడా తెలిసే ఉండాలి. ఈ సంఘటన జరిగి మూడు రోజులైంది. కాని బాబా ఇంతవరకు తనని ఏమీ అడగలేదు. అసలు ఏమీ మాట్లాడలేదు. బాబాకు తెలుసా తెలియదా? తెలిస్తే తనను మెచ్చుకోవాలి కదా? ఒకవేళ తెలియకపోతే తెలిసేట్లు చెయ్యాలి. ఇవాళ్ళ దాని సంగతి ఏదో చూడాలి అనుకున్నాడు రెండవ వాడు.

ప్రతిరోజు సాయంత్రం ఆశ్రమం ప్రక్కనే ఉన్న కాలవ వద్దున కొద్దిసేపు నడవటం బాబాకి అలవాటు. ఆ సమయంలో ఎవరూ ఉండరు. బాబా ఒక్కరే ఉంటారు. అది చాలా మంచి సమయం ఈ విషయం మాట్లాడేందుకు. అని నిర్ణయించుకున్నాడు. సాయంత్రం అయింది. బాబా నడవటానికి బయల్దేరాడు. అప్పుడు బాబాతో పాటు తను కూడ బయల్దేరాడు. ఇద్దరు కాలవవద్దున నడుస్తున్నారు. తనే ఏదో విషయం చెప్పి బాబాని మాటల్లోకి దించాడు. కొంతసేపయింది. ఇప్పుడు అసలు విషయానికొచ్చాడు. 'బాబా ! మొన్న ఏమైందనుకున్నావ్' అంటూ ప్రారంభించి జరిగినదంతా, తను చెప్పదలచుకున్న రీతిలో చెప్పి, 'బాబా ! నిజంగా చెప్పాలంటే అతణ్ణి ఉతికి ఆరేశాను. ఆ దెబ్బతో నోరు మూసుకుని వెళ్ళిపోయాడు. మళ్ళీ ఈ రోజుదాకా గదిలోంచి బయటకి కూడా రాలేదు' అని తన వాక్పటిమ గురించి వివరించాడు. అంతా విన్నాడు బాబా. కాలవవద్దున చెత్తా, చెదారం కుప్పలుగా పోశారు. అందులో పనికిరాని, కుళ్ళిపోయిన పదార్థాలు చాలా ఉన్నాయి. ఒక పంది వాటిని అత్యాశగా తోకాడిస్తూ మహాసంతోషంగా తింటోంది. బాబా ఇప్పుడు ఆ పందిని చూపించి పందిచూడు ఇక్కడ ఇన్ని మంచి పదార్థాలుంటే వాటన్నింటినీ వదిలిపెట్టి కుళ్ళిపోయిన, నీచమైన పదార్థాలను ఎంత ఇష్టంగా తింటోందో. అలాగే నువ్వు కూడా అవతలి వ్యక్తిలో అన్ని గుణాలుంటే అందులో ఒక్కటీ మంచి గుణం కనిపించలేదా? అతడిలో అన్నీ చెడ్డగుణాలే ఉన్నాయా? ఆ పందికీ నీకూ తేడా ఏమిటి? అనవసరంగా అతడి మనసును గాయపరచావు. అతడు కోలుకుని

మామూలు మనిషైనా, ఆ గాయం ఎప్పటికైనా మానుతుందా? నోరుందని మాట్లాడట మేనా? ముందు వెనకా చూడకపోతే మనిషికి జంతువుకీ తేడా ఏమిటి?" అన్నాడు.

నోరున్నది కదా అని ఇష్టం వచ్చినట్లు మాట్లాడి అవతల వ్యక్తి మనసును గాయపరచరాదు. ఒక చిన్న ఉదాహరణ చూడండి.

ఒక ఊళ్ళో ఒక తండ్రి కొడుకు ఉన్నారు. తండ్రి మెత్తనివాడు. కొడుకు కూడా చాలా మంచివాడే కాని కోపిష్టి. ఎవరినీ లెక్క చెయ్యడు. ఎంత మాట పడితే అంత మాట అనేస్తాడు. ముందు వెనక ఆలోచించడు. ప్రతిరోజు ఎవర్నో ఒకళ్ళని తిడుతూనే ఉంటాడు. అతనివల్ల మాటలు పడ్డవాళ్ళు కొంతమంది విపరీతంగా బాధ పడుతుంటారు. అలాంటివాళ్ళు వచ్చి జరిగింది అతడి తండ్రికి చెబుతుంటారు. తండ్రి ఏం చెయ్యగలడు. ఎలా చెబితే కొడుకు వింటాడు. అతడు చేసేది తప్పు. దాన్ని ఎలా సరిదిద్దాలి? బాగా ఆలోచించాడు.

ఒకరోజున కొడుకును పిలిచి గుప్పెడు మేకులు ఇచ్చి, వీటిని బలంగా గోడకు కొట్టు అన్నాడు. ఎందుకు అని అడక్కుండా కొడుకు వాటిని బలంగా గోడకు దిగ్గొట్టి, మేకులు గోడకు కొట్టాను అని చెప్పాడు. సరే ఇప్పుడు వాటిని ఒక్కొక్కటే గోడ నుంచీ పీకెయ్యి అన్నాడు. చాలా చిరాకనిపించింది కొడుక్కి ఎందుకు కొట్టినట్లు? ఎందుకు పీకుతున్నట్లు ? అని విసుక్కుంటూనే పట్టకారతో కష్టపడి, కొట్టిన మేకులన్నీ పీకేసి తండ్రి చేతిలో పోశాడు. ఇప్పుడు తండ్రి చెబుతాడు. "చూడు నాయనా ! బలంగా గోడకు కొట్టిన మేకులు మళ్ళీ బలంగా పీకటమైతే పీకేశావు. కాని ఆమేకులు కొట్టిన తాలూకు రంధ్రాలు గోడకు అలానే మిగిలిపోయాయి. అవి పూడలేదు కదా? మన మేకులు మనం తీసుకున్నాం. కాని అవి చేసిన రంధ్రాలు మాత్రం పూడలా. అలాగే ఎదుటివారి మనసుని పదునైన మాటలతో గాయపరిచామనుకో. ఒకవేళ తరువాత వారిని క్షమించమని అడిగినా, మనమాట మనం వెనక్కి తీసుకున్నా, వారి మనసుకు అయిన గాయం మాత్రంపోదు. గోడకు అయిన రంధ్రల్లాగా అలాగే ఉండి పోతుంది. కాబట్టి సాధ్యమైనంత వరకు ఎవరి మనసునూ గాయపరచకు" అన్నాడు.

నోరుంది కదా అని దాన్ని పారేసుకోవద్దు. ఇతరుల మనసును గాయపరచద్దు. గాయపడిన మనస్సు, మళ్ళీ యథాస్థితి రాదు. విరిగిన మనస్సు అతుక్కోదు. **మాటవల్లే బంధాలు బలపడతాయి. కాబట్టి మాట్లాడేటప్పుడు ఆలోచించి, ఆచితూచి మాట్లాడండి. ఎదుటివారి మనసును గాయపరచద్దు.**

# 39. భారతీయత

ఆనందం రెండు రకాలుగా ఉంటుంది. 1. క్షణికమైన ఆనందము 2. శాశ్వతమైన ఆనందము. వీటిలో క్షణికమైన ఆనందం ఇహానికి సంబంధించినది. అంటే ఈ లోకంలో మనం పొందే ఆనందం. మన దగ్గర లేని దాన్ని మనం పొందినట్లైతే ఈ రకమైన ఆనందం కలుగుతుంది. సామాన్య మానవుడు. గంపెడు సంసారం. బ్రతుకు బండిని అని కష్టంమీద లాగుతున్నాడు. ప్రతిరోజు ఆఫీసుకి సైకిలు మీద వెడతాడు. అతని తాహత అది. బ్రతకటానికి మాత్రం తింటాడు. విలాసాల జోలికి వెళ్ళడు. అలా వెళ్ళటానికి అతడి ఆర్థిక పరిస్థితి సహకరించదు. తనతోపాటు పనిచేసే అందరికీ ద్విచక్ర వాహనాలున్నాయి. తనకు మాత్రమే సైకిలు. ఎప్పటికైనా తనుకూడా ఒక స్కూటరు కొనుక్కుంటే ఎంత బాగుండును? ఇది ఆశ. కొద్ది రోజులకు అనుకోకుండా కొంత డబ్బు వచ్చింది. ఇంకేమీ ఆలోచించకుండా స్కూటరు కొనేశాడు. ఇప్పుడు అతని కళ్ళలో ఆనందం చెప్పలేనంతగా కనిపిస్తున్నది. చాలా ఆనందంగా ఉన్నాడు. కాని ఆ ఆనందం ఎంత కాలం ఉంటుంది? రెండు రోజులు, పదిరోజులు, నెలరోజులు. తరువాత అలవాటు పడిపోతాడు. కొంత కాలానికి కారు కొనాలనిపిస్తుంది. అంతే కోరికలు గుర్రాలాంటివి. వేగంగా పరుగులు తీస్తాయి. మనకి లడ్డు తినాలనిపించింది. తింటున్నాం. చాలా బాగుంది. బందరు లడ్డు, మంచి రుచిగా ఉంది. ఈ ఆనందం ఎంతసేపు ఉంటుంది? లడ్డు తినేదాకా, తిన్న తరువాత? ఇంక ఆనందం కనిపించదు. ఆ క్షణం వరకు అంటే అనుభవించేవరకే ఉంటుంది ఈ ఆనందం. తరువాత ఉండదు. అందుకే దీన్ని **క్షణికానందం** అంటారు.

రెండవది శాశ్వతానందం. ఇది అప్పుడు, ఇప్పుడు ఎప్పుడూ అలాగే ఉంటుంది. వీటిలో క్షణికానందం లౌకికమైనది. శాశ్వతానందం – పారలౌకికము. మానవుడు ఎంత సంపాదించినా, ఎన్ని భోగాలు అనుభవించినా, ఎన్ని సుఖాలనుభవించినా, ఆ క్షణం వరకే ఉంటాయి. అవేవీ శాశ్వతం కాదు. ఇంద్రుడు త్రిలోకాధిపతి. ఎనలేని సంపద. స్వర్గం అతడి అధీనంలో ఉంటుంది. ఈ జగత్తులో అతడికన్న ధనవంతుడు, అధికారం గలవాడు ఎవరూ ఉండరు, కాని అతడికి శాంతిలేదు. ఆనందం లేదు. ఎందుకంటే ఎప్పుడు ఏ రాక్షసుడు తన సింహాసనాన్ని ఆక్రమించు కుంటాడో, ఏ మహానుభావుడు ఇంద్రపదవికి అర్హత పొందుతాడో, అని భయం.

రాక్షసులు ఘోరమైన తపస్సు చేసి, బ్రహ్మ దగ్గర వరాలు పొంది ఇంద్రుడితో యుద్ధం చేసి స్వర్గాన్ని ఆక్రమించారు. అచంచలమైన దీక్షతో తపస్సు చేసిన వాడు ఇంద్రుడు కాగలడు. వంద అశ్వమేధ యాగాలు చేసిన మహారాజు ఇంద్రపదవికి అర్హుడు. అందుకనే వారెవరూ ఈ పనులు చెయ్యకుండా అప్సరంగానలను పంపి వారి తపస్సు భంగం చేస్తుంటాడు ఇంద్రుడు. నిరంతరం తన పదవిని కాపాడుకోవటంలో నిమగ్నుడై ఉంటాడు. అంతేకాని అతడికి ఆనందం లేదు. శాంతిలేదు. గ్రామంలోని నాలుగు ఇళ్ళలో ఆడుక్కుని, అలా వచ్చినదాన్ని ఊరిచివర చెరువు గట్టున, చెట్టు క్రింద కూచుని తిని, ఆ చెట్టు క్రిందే నిద్రపోయే బిచ్చగాడు, కూటికి టికాణాలేని బిచ్చగాడు, **రేపన్న దానికి సమాధానం లేని బిచ్చగాడు ఇంద్రుడికన్న ఎక్కువ ఆనందంగా ఉంటాడు.**

లౌకికమైన ఆనందానికి కొన్నివేల రెట్లుంటుంది. శాశ్వతమైన ఆనందం. అదే బ్రహ్మానందం. దీన్ని గురించి తైత్తిరీయోపనిషత్తులోని ఆనందవల్లిలో చెబుతారు. లోకంలో మంచి బలమైనవాడు, విద్యావంతుడు, ధనవంతుడు, అనుభవించాలనే కోరిక గలవాడు, దాతృత్వమున్న వాడు, వినయ సంపన్నుడు అయిన పురుషుడు అనుభవించేది – మానుషానందం.

| | |
|---|---|
| మానుషానందానికి నూరు రెట్లు | – మనుష్య గంధర్వానందం |
| మనుష్యగంధర్వానందానికి నూరు రెట్లు | – దేవగంధర్వానందం |
| దేవగంధర్వానందానికి నూరు రెట్లు | – చిరలోకపితరానందం |
| చిరలోక పితరానందానికి నూరు రెట్లు | – అజానజదేవానందం |
| దానికి నూరు రెట్లు | – కర్మదేవానందం |
| దానికి నూరు రెట్లు | – దేవానదం |
| దానికి నూరెట్లు | – ఇంద్రానందం |
| దానికి నూరురెట్లు | – బృహస్పతి ఆనందం |
| దానికి నూరురెట్లు | – ప్రజాపతి ఆనందం |

ప్రజాపతి ఆనందానికి నూరు రెట్లు – బ్రహ్మానందం. ఇది శాశ్వతమైన ఆనందం. భారతీయులు మాత్రమే పొందగలిగేది. భారతీయ తత్త్వశాస్త్రంలో మాత్రమే చెప్పబడింది. **దీన్నే మోక్షము అనికూడా అంటారు.**

మానవుడు శాశ్వతమైన బ్రహ్మానందం కోసం ప్రయత్నించాలి. అదే అతడి అంతిమ లక్ష్యం. అంతేకాని క్షణికమైన లౌకికానందం కోసం కాదు. బ్రహ్మానందం ముందు ఏవీ సరికాదు. శాశ్వతమైన ఆనందం పొందినవాడు దేనినీ, ఎవరినీ పరిగణనలోకి తీసుకోడు.

పూర్వకాలంలో గ్రీసుదేశపురాజు. అలెగ్జాండరు విశ్వవిజేత కావాలనే కోరికతో ప్రపంచంలోని వివిధ దేశాలతో యుద్ధం చేశాడు. అందులో భాగంగానే భారతదేశానికి వచ్చాడు. ఆ రోజుల్లో భారతదేశం చిన్న చిన్న రాజ్యాలుగా ఉండేది. వీటిలో కొన్నింటిని గెలిచాడు. మిగిలిన రాజ్యాలు కూడా జయించాలనే ఉద్దేశ్యంతో వెడుతున్నాడు. అలా బయలుదేరిన అలెగ్జాండరు కొండలు కోనలు, అడవుల గుండా ప్రయాణం చేస్తున్నాడు. ఒక అరణ్యం గుండా వెడుతున్నాడు. సేనా సమూహంతో అట్టహాసంగా వస్తున్న అలెగ్జాండరుకు భయపడి అరణ్యాలలో నివసించే గిరిజనులు, చివరకు వన్యప్రాణులు కూడా దూరంగా పారిపోతున్నాయి. ఆ దృశ్యాలు చూసి ఆనందిస్తూ కదలి వెడుతున్నాడు అలెగ్జాండరు, త్రోవలో ఒక చెట్టుక్రింద ఒక పెద్ద బండరాయి. దానిమీద ఒంటిమీద కేవలం గోచీ మాత్రమే పెట్టుకున్న మనిషి, నెత్తిన జుట్టు, గడ్డాలు మీసాలు బాగా పెరిగి ఉన్నాయి. కాలిమీద కాలు వేసుకుని తలక్రింద రెండు చేతులు పెట్టుకుని చిద్విలాసంగా దేన్నో చూస్తున్నాడు. అలెగ్జాండరు సైన్యాన్ని చూసి అతడు లేవలేదు. బెదరలేదు. అలాగే ఉన్నాడు. అతణ్ణి చూసిన అలెగ్జాండరుకు కోపంతో పాటుగా ఆశ్చర్యం కూడా కలిగింది. ఇంతమంది తనను చూసి భయపడి పారిపోతుంటే ఇతను మాత్రం భయపడటం లేదు సరికదా గౌరవాన్ని ప్రదర్శించటానికి లేవను కూడా లేదు. ఉండబట్టలేకపోయాడు. ఈ సన్నివేశాన్ని భరించలేక పోయాడు. అతణ్ణి చంపెయ్యాలనే కోపం వచ్చింది. తన గుర్రాన్ని నేరుగా అతడి దగ్గరకు పోనిచ్చాడు. అయినా అతడు బెదరలేదు. లేవలేదు. గద్దింపుగా అతణ్ణి పిలుస్తూ, నేనెవరో తెలుసా? ప్రపంచ విజేత అలెగ్జాండరుని అన్నాడు. ఆ వ్యక్తి అలానే పడుకుని అయితే ఏమిటి? అన్నాడు. అతడి ముఖాన బ్రహ్మవర్చస్సు ప్రకాశిస్తోంది. మహదానందంగా ఉన్నాడు. తనను లెక్క చెయ్యటం లేదు. ప్రపంచాన్ని జయించిన తను, ఇతడి ముందు ఓడిపోయాడు. అతణ్ణి చూసి మహదాశ్చర్యంతో అడిగాడు అలెగ్జాండరు 'నేను ప్రపంచాన్ని జయించాను. నాకన్న పెద్దరాజు లేడు. ధనవంతుడు లేడు. నామాట ఈ ప్రపంచమంతా చెల్లుబడి అవుతుంది. అది నాకు

చాలా ఆనందంగా ఉంది. నీ దగ్గర ఏమీలేదు. నెత్తిన జుట్టు, గడ్డాలు, మీసాలు, ఒక గోచీ తప్ప, అలాంటి నువ్వు నాకన్నా ఆనందంగా కనిపిస్తున్నావు. కారణం ఏమిటి? అన్నాడు. పడుకున్న వ్యక్తి నెమ్మదిగా లేచి అలెగ్జాండరును చెయిచాపమని, ప్రక్కనే ఉన్న పెద్దరాయి తీసి ఆ చేతిలో పెట్టి పడిపోకుండా పట్టుకో అన్నాడు. పట్టుకున్నాడు అలెగ్జాండరు. కొంతసేపు బాగానే ఉంది. ఆ తరువాత చెయ్యి బరువెక్కటం మొదలుపెట్టింది. రానురాను బరువు పెరుగుతోంది. కొంత సేపటికి ఆ బరువు భరించలేక రాయిని వదిలేశాడు. ఇప్పుడెలా ఉంది? అన్నాడా వ్యక్తి. చాలాహాయిగా ఉంది అన్నాడు అలెగ్జాండరు, ఇప్పుడు ఆ వ్యక్తి, రాజా! ఒక్క రాయిని వదిలేస్తేనే నీకు హాయిగా ఆనందంగా ఉంది. అటువంటిది ప్రపంచం మొత్తాన్ని వదిలేసిన నాకు ఇంకెంత హాయిగా, ఆనందంగా ఉంటుందో ఆలోచించు' అన్నాడు.

ఆ మాటలు విన్న విశ్వవిజేత అలెగ్జాండరు అవాక్కయిపోయి అతడికి శిరస్సు వంచి నమస్కారం చేశాడు.

ఈ జగత్తులో శాశ్వతమైనది ఏదీలేదు. దృశ్యమానమైనవన్నీ నశించేవే. వాటివల్ల వచ్చేది **క్షణికానందం, అది దుఃఖానికి హేతువు. శాశ్వతమైన వాడు పరమాత్మ ఒక్కడే. అతణ్ణి తెలుసుకోవటమే శాశ్వతమైన ఆనందం. అదే ముక్తి. అదే మోక్షం.** అనాదిగా మానవుడు ప్రయత్నిస్తున్నది, ప్రయత్నించాల్సింది కూడా దీని కోసమే. అదే భారత దేశపు ఔన్నత్యం. **అదే భారతీయత.**